మహాకవి శ్రీ మయూర విరచిత

# సూర్యశతకమ్

## బాలప్రభ తెలుగు వ్యాఖ్యతో


వ్యాఖ్యాత

**డా|| తాళ్లూరి ఆంజనేయులు**



ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2017**

**SURYASATAKAM of Mahakavi Sri Mayura**
**with the Telugu Commentary of Balaprabha**

**by**
**Dr. Talluri Anjaneyulu**

T.T.D. Religious Publications Series No.1266


*First Edition :* 1990
*Re-print :* 2017

Copies : 500

*Published by*
**Sri ANIL KUMAR SINGHAL,** I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507

***D.T.P:***
Publications Division,
T.T.D, Tirupati.

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 507

# ముందుమాట

శ్రీహర్ష చక్రవర్తి ఆస్థానంలో మయూర మహాకవి ఉండేవారు. ఆయన సంస్కృతంలో రచించిన గ్రంథమే ఈ సూర్యశతకం. ఈ శతకానికి ఒక ప్రత్యేకత ఉంది. ఈ శతకకర్త మయూరుడు కుష్ఠవ్యాధి పీడితుడని, ఆ వ్యాధి నివారణకు ఆ మహాకవి సూర్యశతకం చెప్పుకొన్నాడని, ఆ వ్యాధి నయమయిందని ప్రతీతి. సూర్యశతకంలోని శ్లోకాలు సామాన్యులకు కొరుకుడు పడవు. అందుక్కారణం భాష ప్రౌఢమైన నారికేళపాకంలో ఉండడం, ఛందస్సు గంభీరమైన 'స్రగ్ధర' కావడమే. ప్రతిశ్లోకంలోను అద్భుతమైన భావుకత కనిపిస్తుంది.

ఈ శతకాన్ని మయూరుడు తనకోసం చెప్పుకొన్నట్లు ఎక్కడా కనిపించదు. మీ అశుభాలను తొలగించుగాక! మీ పాపాలను పోగొట్టుగాక! మీకు శుభములు ప్రసాదించుగాక అంటూనే సాగుతుంది. తనకు సంక్రమించిన వ్యాధి నయం కావాలనికాక – జగత్ కల్యాణాన్ని కాంక్షించి శతకం చెప్పారు – మయూర మహాకవి.

**"కావ్యంయశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే**
**సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే"**

అని ఆలంకారికులు పేర్కొన్నట్లు శివేతరక్షతికోసం, 'విశ్వశ్రేయఃకావ్యం' అని ఆదికవి నన్నయ సూత్రించినట్లు లోకశ్రేయస్సుకోసం వ్రాయబడింది మయూరుని ఈ సూర్యశతకం.

సంస్కృత భాషలోని ఈ శతకమాధుర్యాన్ని తెలుగువాళ్లకందించాలని డా॥ తాళ్లూరి ఆంజనేయులుగారు 'బాలప్రభ' పేరుతో తెలుగులో చక్కని వ్యాఖ్యానం సమకూర్చారు. సంస్కృతాంధ్ర భాషల్లో నిష్ణాతులైన వీరు

పదవీవిరమణానంతరం తిరుమల తిరుపతి దేవస్థానములు, ప్రచురణల విభాగంలో ప్రత్యేకాధికారిగా తమ సేవలందిస్తున్నారు. వారు ఈ రచనను తిరుమల తిరుపతి దేవస్థానానికి అప్పగించారు. 'బాలప్రభ' తెలుగు వ్యాఖ్యానంతో ఈ సూర్యశతకాన్ని తెలుగు పాఠకులకు అందించాలని నిర్ణయించి ప్రచురణకు స్వీకరించాము. వ్యాఖ్యాత డా॥ తాళ్లూరి ఆంజనేయులుగారికి అభినందనలు. తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురిస్తున్న ధార్మిక సాహిత్య ప్రచురణలను పాఠకులు ఆదరిస్తున్నట్లే ఈ సూర్యశతకాన్నీ ఆదరిస్తారని ఆకాంక్షిస్తున్నాము.

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.



# కృతజ్ఞతాభివాదం

ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు అన్నట్లు నా ఈ కృతి ఆవిర్భావానికి కారకులు ప్రేరకులయిన మహానుభావులు ఎందరో వున్నారు. వాళ్లందరికీ ముందుగా మనసార నా వందనాలు తెలుపుకుంటున్నాను.

శ్రీహర్షుని ఆస్థానంలో బాణుడితోపాటు ఆదరాన్ని పొందిన మహాకవి మయూరుడు క్రీ.శ. 7వ శతాబ్దం పూర్వార్ధంలో వున్నట్లుగా సాహిత్య చరిత్రకారులు చెబుతున్నారు. ఇతని కృతులు మయూరాష్టకం, మరియు సూర్యశతకం. మయూరాష్టకం కేవలం 8 శ్లోకాలతోకూడిన ఒకానొక యువతి యొక్క సౌందర్యవర్ణనం. కుష్ఠువ్యాధి పీడితుడైన మయూరుడు సూర్యశతకం వ్రాసి తద్రోగవిముక్తుడయ్యాడని ప్రాచీనోక్తి. సూర్యశతకంలోని శ్లోకాలు మహిమాసమన్వితాలని వాటికి వేదప్రాముఖ్యం వుందని అవి చదివినవారికి స్పష్టమౌతుంది. "అటువంటి శ్లోకాలకు తెలుగులో వ్యాఖ్యానం ఇంతకుముందు ఎవరూ వ్రాసినట్లు లేదు నీవు వ్రాస్తే బావుంటుంది" అని మాటవరసకు ఎప్పుడో ఒకసారి సలహా యిచ్చిన సోదరుడు శ్రీ మేడసాని మోహన్ ఈ కృతికి ప్రథమ ప్రేరకుడు. కాని ఈ పుస్తకం ముద్రించాక బ్రహ్మశ్రీ చదలవాడ జయరామశాస్త్రిగారు తెలుగులో వ్యాఖ్య వ్రాశారని మిత్రులెవ్వరో చెప్పారు. నేను మాత్రం దాన్ని ఇప్పటివరకు చూడలేదు. బహుశా శ్రీ శేషేంద్రశర్మగారికి తెలిసివుంటుంది. అందుకే వారి 'భూమిక'లో ఇంతవరకు "తెలుగులో వచ్చిన సూర్యశతక వ్యాఖ్యలన్నిటికంటే ఈ వ్యాఖ్య అత్యుత్కృష్టమైనదని" పేర్కొనివుంటారు. కాని వారు మౌఖికంగా ఆ విషయాన్ని నాతో అనియుండలేదు. నేను వ్రాయగలనా అన్న భయంతో మూలగ్రంథాన్ని క్షుణ్ణంగా చదివాను. చదివాక ఫర్వాలేదు అనుకొని వివిధ మూల ప్రతులు సంపాదించాను. నిర్ణయ సాగర్ (సవ్యాఖ్య), చౌఖంబా, వావిళ్లవారి ప్రతులు నాకెంతో ఉపకరించాయి. అయితే సూర్యశతకానికి

తెలుగు పద్యానువాదాలు దాసు శ్రీరాములు కవి, వడ్డాది సుబ్బారాయుడు, ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రి, మల్లాది లక్ష్మీపతిశాస్త్రి గారలు వ్రాయకపోలేదు. అందులో వ.సు. కవి గారిది నాకు లభ్యం కాలేదు. తక్కినవి మాత్రం చూశాను. పద్యానువాదం పాండిత్య స్ఫోరకంగా వుండి సామాన్య పాఠకుడికి ప్రయోజనకారి కాదన్న వుద్దేశంతో మూలగ్రంథానికి తెలుగు వ్యాఖ్య వ్రాయాలన్న ప్రయత్నం చేశాను. ఈ వ్యాఖ్య వ్రాయడంలో నా వుద్దేశం నాకున్న కొద్దిపాటి సంస్కృత భాషాపరిచయంతో ప్రాచీనులైన సంస్కృతాంధ్ర మహాకవులచేత వేనోళ్ల కొనియాడబడ్డ మహాకవి మయూరుని 'సువర్ణ' కలనత్వాన్ని సాధారణ తెలుగు పాఠకుడికి కూడ అందించాలనే ఆతురతే తప్ప సాహితీ క్షేత్రంలో అ-ఆలు దిద్దికుంటున్న నా బాలలేఖినియొక్క పండితమ్మన్యతను ప్రదర్శించడానికి మాత్రంకాదని పండితలోకానికి భక్తిప్రపత్తులతో విధేయుడనై ప్రణామం చేస్తున్నాను. తప్పులెన్నో వుంటాయి మన్నించగలరని నా నమ్మకం. నా కృషి ఏమాత్రం ఫలించినా నేను ఎంతో అదృష్టవంతుణ్ణి.

"జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"

**– డా॥ తాళ్లూరి**



# భూమిక

సుప్రసిద్ధమైన సూర్యశతకానికి విద్వద్గణమణి, కవిచూడామణి అయిన శ్రీ తాళ్లూరి ఆంజనేయులుగారు 'బాలప్రభ' అనే ఆంధ్రవ్యాఖ్య రాశారు. ఇంతవరకు తెలుగులో వచ్చిన సూర్యశతక వ్యాఖ్యలన్నిటికంటే ఈ వ్యాఖ్య అత్యుత్కృష్టమైనదనీ అత్యంత ఉపయోగకారి అని పఠితృలోకం సులభంగా గ్రహించగలదు.

సూర్యశతక కావ్యమోహానికి లొంగిన అసంఖ్యాక కావ్యలోలుపుల్లో నేనొకణ్ని. సూర్యమండల వ్యామోహితుడైన వాడికే ఆ మోహానుభవం తెలుస్తుంది. ఎప్పుడయినా త్రిసంధ్యల్లో అంతరిక్షాల్ని చూచారా? వృక్షాగ్రాలు కదిలించే ఆకులమీద, దూరపు ఇండ్ల కప్పులమీద, పర్వత శ్రేణులమీద, శ్వేతమేఘాలు వాస్తుకళలు శిల్పించేచోట, ఆ సౌందర్యాన్ని భరించలేము. సూర్యకిరణాలు క్రిక్కిరిసిన ధవళగోవుల మందల్లా భూమిమీద సంచరించే ఆ మూడువేళల్లో సృష్టిలో ప్రతివస్తువూ ఒక విశేష ఆకర్షణతో దర్శనమిస్తుంది. అన్ని వస్తువులూ ఆ సౌందర్యంలో తడిసిపోతాయి. సుఖదుఃఖాలన్నీ మరిచిపోయి జీవి ముగ్ధుడైపోతాడు. నేను ఏం చేస్తున్నా ఎక్కడున్నా బయటకు పరుగెత్తుకుపోతాను. 'ప్రాతర్మధ్యాహ్నసాయంకాలాల్లో' ప్రతిదినమూ! ప్రతిదినమూ ఎందుకా ఉత్కంఠ, ఆదర్శనలాలస, ఆ దిదృక్ష? నిన్న చూచిందే కదా? కానే కాదు. ఇవాళ నేను చూస్తున్న ఆ మోహిని నిన్న చూచిందికాదు. మళ్ళీ రేపు ఉండదు. అదే సంధ్య! నిత్యజన్మ శాశ్వత నూతనత్వం ఈ ఒక్క అనుభవంలోనే మనిషికి లభిస్తుంది. ఎంత ఆశ్చర్యం!

ఈ మోహజాలాన్ని భూమిమీద పరిచేవాడు ఆ ప్రభువు సూర్యుడు. అతడిది దుర్విలంఘ్యమహిమ. అందుచేత మంత్రగ్రామాలు దర్శించే ఋషులందరూ పక్షులై ఆకాశాల్లో ఎగిరిపోతారు. సూర్యుడు ఆకాశంలో ఎగిరే పక్షి. "ఖగః పూషా గభస్తిమాన్" అని ఆదిత్య హృదయం. సూర్యమాయామోహ మూర్ఛితుడై వాల్మీకి రామాయణం నిండా

సూర్యకిరణాలు పోసి నింపాడు. దాన్ని సూర్యకావ్యం చేశాడు. ప్రతి సహస్ర శ్లోక నికాయానికి అగ్రాక్షరంగా ఒక్కో సూర్య మంత్రాక్షరాన్ని నిక్షేపించాడు. సర్వత్రా సంధ్యానాదం వినిపిస్తుంది. రామాయణ పుటల్లో; "రామస్సంధ్యా ముపాగమత్", "అన్వాస్య పశ్చిమాం సంధ్యాం తత్ర వాస మకల్పయత్", "ఉపాస్పృశత్ సుశీతేన జలేనోత్పలగంధినా" ఇలా ఎన్నో... అందులో వున్న సూర్యమండలవ్యామోహం చెప్పడానికి అలవికాదు. మృదుసూర్యాః అంటాడు. దివసా స్సుభగాదిత్యాః అంటాడు. "రవిసంక్రాంత సౌభాగ్యః లక్ష్మీకః తుషారారుణ (వృత) మండలః" అంటాడు. "దూర మభ్యుదితస్సూర్యః శశాంక ఇవ దృశ్యతే" అంటాడు. హిమక్లిన్న శాద్వల సీమలలో శోభించే వనభూముల్లో బాలాతపక్రీడలు ఆయన్ని వెర్రివాణ్ని చేస్తాయి.

**అవశ్యాయ నిపాతేన కించిత్ ప్రక్లిన్నశాద్వలా ।**
**వనానాం శోభతే భూమిః నివిష్టతరుణాతపా ॥**

క్రియావిరహితుడైన రాముడు 'ఆదిత్య! భో! లోక కృతాకృతజ్ఞ! లోకస్య సత్యానృత కర్మసాక్షీ!' అని ఎలుగెత్తి సూర్యుడ్ని సంభోదిస్తాడు. ఆ ఉన్మత్తత ఎంత దూరం వెదుతుందంటే 'శక్యమంబర మారుహ్యా మేఘసోపాన పంక్తిభిః కుటజార్జున మాలాభిః అలంకర్తుం దివాకరం!' అంటాడు. ఆ ఋతువుల్లో పూచిన పూలతో గ్రుచ్చిన దండ తీసుకొని మేఘసోపానాలెక్కిపోయి ఆకాశంలోవున్న సూర్యుడి మెడలో ఆ దండవేసి రావచ్చునంటాడు.

కనుకనే సూర్యమండల ముగ్ధుడైన మయూరుడు సూర్యశతక రచన చేశాడు. కావ్యమంతా అలంకారహారం. కనకనే సూర్యశతకం కావ్యమయింది. "కావ్యం గ్రాహ్యం అలంకారాత్; సౌందర్య మలంకారః" అని వామనుడు. అలంకారాలన్నీ ధ్వనిప్రధానములే. అలంకారాలకు వాచ్యార్థం లేదు. లక్షణ లేక వ్యంజనచేతనే అలంకారం అర్థవంతమవుతుంది. "కావ్యాని నేయాని లక్షణేన మహాత్మనాం" అంటే ఇదే. పఠిత కావ్యంలో వాచ్యార్థాన్ని అనుభవించడం లేదు. వాచ్యేతరార్థాన్నే అనుభవిస్తున్నాడు. సూర్యశతకం ఈ విధంగా ధ్వనిమయం.



అలంకారాలన్నీ దర్శనాలే. "ఋషిశ్చ కిల దర్శనాత్". మయూర శ్లోకాలన్నీ దర్శనాలే. కనక మయూరుడు ఈ ఒక్క వాక్యంచేత లోకోత్తర స్థానం పొందాడు.

సూర్యకిరణాలను, అశ్వాలను, సారథిని, రథాన్ని, మండలాన్ని, దైవత్వాన్ని తన తపోమండలంలో ఝుంకృతం చేశాడు. అంతేకాదు. అనంత కాలాధ్వంలో సూర్యరథం రేపిన సనాతన వైదికధూళిమేఘాల్ని కూడా పోగుచేశాడు. సూర్యమండలాన్ని పిండి వంద కావ్యబిందువులు మనకు ఆస్వాదలభ్యం చేశాడు. శ్రీ ద్విజేంద్రనాథశాస్త్రి తన 'సంస్కృత సాహిత్య విమర్శః' అనే గ్రంథంలో "కావ్య మిదం గౌడీ రీతిమాలంబ్య విరచితం, యమకాద్యలంకార విశేషభూషితం, విదుషా మాదరాస్పదీ భూతం విలసతి, అస్య ఏకాదశటీకాః సంతి, తాసు సూర్యానువాదినీ నామ్నా వల్లభదేవ విరచితా సర్వోత్కృష్టేత్యవధార్యతే ।" – నిజమే, గౌడీరీతి ఉత్కృష్ట రచనామార్గంకాదు, శబ్దప్రధానం గనుక. విదుషాం ఆదరాస్పదీభూతం అనదంకూడా ప్రశంసకాదు. కాని సూర్యశతక పాఠకులు శ్రీ శాస్త్రిగారి మాటతో ఏకీభవించరు. గౌడీరీతి అయినప్పటికీ అద్భుతమైన అర్థ గౌరవం వున్న అలంకారాలు రచన అంతటా నిండి నిబిడీకృతమై ఉన్నాయి. కనుక ఇక్కడ శబ్దాలంకారాలు కూడా కావ్యశోభకు దోహదకారులేగానీ భంజకములు కావు. ఉదా॥ వ్యగ్రై రగ్ర్యగ్రహోదుగ్రసన గురుభరై ర్గోసమగ్రై రుదగ్రై" వర్ణసంఘాతగోచర" "ఆవృత్తి" చేత ఉత్పన్నమైన శ్రుతి పేశలత్వం కావ్యాస్వాదకుడి హృదయాన్ని కావ్యాభిముఖం చేస్తుంది. ఆ మహిమ యమకాద్యలంకారాలకుంది. ఇంచుమించు మయూరుని కాలానికి తత్సమీపకాలానికి చెందిన అమరుక, బాణభట్ట, జయదేవ, భోజదేవ, లీలాశుకాదుల కావ్యాలన్నింటిలోనూ ఈ శ్రుతిపేశల శబ్దయోజనా లక్షణ ప్రాచుర్యం కనిపిస్తుంది.

సూర్యశతక శ్లోకాల్లో ప్రతి శ్లోకమూ దేనికదే స్వతంత్రమై నైకాలంకార ప్రయుక్తిమూలక అర్థభారనమితపంక్తియై సూర్యార్పణమైన ఫలపుష్పగుచ్ఛంలా కనిపిస్తుంది. ఒక్కో శ్లోకం ఒక్కో ముక్తకం. భామహుడి వర్గీకరణ ప్రకారం ఇది 'అనిబద్ధ' కావ్యం.

**అనిబద్ధం పునర్గాథా శ్లోకమాత్రాదియత్పునః ।**
**యుక్తం వక్ర స్వభావోక్త్యా సర్వమేవైతదిష్యతే ॥**

శ్లోకమాత్రం అనడంచేత ఆదికావ్యం అవడానికి అలంకారయుక్తత అనివార్యం. కనుకనే "యుక్తం వక్రస్వభావోక్త్యా" అన్నాడు. సారాంశం, "ముక్తకః శ్లోక ఏవై కః చమత్కార క్షమః సతాం". "చమత్కృత్యా నంద విశేషః" అని జగన్నాథుడు ఈ తత్త్వంలోనుంచి అభినవగుప్తుడు "పూర్వాపర నిరపేక్షణేనాపి హి యేన రసచర్వణా క్రియతే తదేవ ముక్తకః" అని పూర్వాపర నిరపేక్షకత్వం అనే ఒక లక్షణం ఆవిష్కరించాడు.

హర్షనైషధంలో "గ్రంథగ్రంథిరిహ క్వచిత్ క్వచిదపి న్యాసి ప్రయత్నా న్మయా" అన్నట్లు కొన్ని శ్లోకాలు ఈ శతకంలో అనావిష్కృత మర్మగర్భిత వ్యూహరచనల్లా వున్నాయి.

1) ఏకంజ్యోతి ర్దృశౌద్వే (13 శ్లో) 2) మౌళీందోర్మైషమోషీ (16 శ్లో) 3) వజ్రిన్‌జాతం వికాసీక్షణ కమలవనం (54 శ్లో) 4) ధూర్ధ్వస్తా గ్ర్య గ్రహాణి (6 శ్లో) 5) చక్రే చక్రారపంక్తిం (71 శ్లో) ఇత్యాది శ్లోకాలు కొన్ని నిపుణతయా ఖననాపేక్షకములని తోస్తుంది. బాగా వెదకటానికి అలవాటుపడ్డ కళ్ళతో చూడవలసిన కృతి ఇది.

వేదాలు, ఉపనిషత్తులు, ఇతిహాసాలు అనే గనుల్నుంచి త్రవ్వితీసిన మణులతో చెక్కిన మహత్తర శిల్పం ఈ సూర్యశతకం సూర్యుడు ద్యులోకద్యుమణి అయితే సూర్యశతకం భూలోకద్యుమణి. ద్యులోక సూర్య ప్రభావమే ఈ భూలోకసూర్యశతకంలో వుంది. సూర్యుడు దైవతమైతే



సూర్యశతకం తన్మంత్రం; పత్రాక్షర రూపమైన పుస్తకం యంత్రం; మయూరుడు ఋషి; స్రగ్ధర ఛందస్సు.

ఋగ్వేదము, కతిపయఋక్సూక్తభాగ సమాహారమైన మహాసౌరము, పూర్వోపస్థితి అనేక మంత్రసామగ్రిని సంపుటీకరించిన అరుణపాఠము, వీటికి సారమైన శ్రీమద్రామాయణాంతర్గత ఆదిత్య హృదయము మయూర సూర్యశతకానికి మూలద్రవ్యాలు. మహాసౌరంలో ఋక్సంఖ్య, ఋషి, దైవతచ్ఛందములు ఇచ్చి సూక్తమంత్రాలు ఇవ్వబడ్డాయి. కేవల సూర్యస్తోత్రములు – యజుర్వేదీయ పాఠమైన అరుణమట్లాకాదు. అనేక మంత్రాల సంకలనం. ప్రధానంగా ఇందులో కాలోత్పత్తి, సృష్టిక్రమము పరిశీలించవలసిన భాగాలు. 'ఆదిత్యానదితిం దైవీం యోని నోర్ధ్వముదీషత' అని ఆదిత్యోత్పత్తి చెప్పి, ఒకచోట 'అపశ్యమహ మేతాస్థుప్త' అని 'సప్త సూర్యా దివ మనుప్రవిష్టాః' అని మరొకచోట, మరొకచోట 'నానా సూర్యా సూర్యా నవచ' అంటుంది. ఒకచోట 'కశ్యపాదుదితాః సూర్యాః' అంటుంది (ఎప్పుడూ సూర్యశబ్దానికి బహువచనమే ఉంది) మరొకచోట 'కశ్యపోఽ ష్టమః" అని చెప్పబడుతుంది. "స మహామేరుం న జహాతి" (కశ్యపః) అంటుంది. మళ్ళీ "కశ్యపం పశ్యకోభవతి" అని చెపుతుంది. మరొకచోట "దివోరాత్రిః తా అవిసృష్టా... తయో రేతౌ వత్సౌ, అగ్నిశ్చా దిత్యశ్చ... పైగా అన్యత్ర ఉన్న ప్రసిద్ధ మంత్రపంక్తులు అప్పుడప్పుడూ వస్తూ ఉంటాయి. ఉదా॥ బ్రహ్మదేవానాం, ఊర్ధ్వమూల మవాక్ఛాఖమ్ యోఽపాం పుష్పం వేదా పుష్పవాన్ భవతి... ఆయతనవాన్ భవతి, సతపో తప్యత, అష్టాచక్రా నవద్వారా దేవానాం పూరయో ధ్యా..., తత్సవితృవరేణ్యం భర్గోదేవస్య ధీమహి..., సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ – ఇట్లా అరుషపాఠం ఒక వేదోపనిషత్సార సంగ్రహం.

వీటన్నిటికీ మూలకందమైన ఋగ్వేదమే సూర్యశతక సందర్భంలో ముఖ్యమని భావించాలి. సూర్యశతకం చెప్పిన సూర్యమహిమలైన

అఘునిఘ్నత్వం, వర్షజనకత్వం, ప్రాణదాతృత్వం, జ్ఞానదాతృత్వం, కాలకర్తృత్వం, మోక్షలోకద్వారత్వం, అన్నీ ఋగ్వేదీయాలే. ఇంకా సూర్యశతకం చెప్పే సూర్య అంతర్యామిత్వం సూర్యరథం, సూర్య అశ్వాలు, వాటిరంగు ఇత్యాదులన్నీ ఋగ్వేదాధారంగా చర్చించవలసినవి.

1) సూర్యశతకంలో 7, 14, 21, 22, 31, 32 శ్లోకాల్లో చెప్పిన పాపపాతక దుఃఖదుర్నిమిత్త అశుభాదులను హరించే సూర్యమహిమ క్రింద దిఙ్మాత్రంగా ఇవ్వబడిన ఋక్కుల్లో చెప్పబడింది - 1వ అష్టకం, 2వ అధ్యాయం 1వ మండలం 7వ అనువాకం 35వ సూక్తంలో "హిరణ్య పాణిః సవితా విచర్షణి"... ఇత్యాది 419వ ఋక్కుల్లో చెప్పబడింది. 1-4-1-9-50వ సూక్తంలో 597వ ఋక్కు "ఉద్యన్నద్య మిత్ర మహ ఆరోహన్నుత్తరాం దివం। హృద్రోగం మమసూర్యహరిమాణంచ నాశయ; ఆ సూక్తంలోనే 599వ ఋక్కు "ఉదగాదయ మాదిత్యో విశ్వేన సహసా సహ..." ఈ రెండు ఋక్కులు కూడా ఆ సూర్యమహిమను చెపుతాయి.

2) సూర్యశతకంలోని 77వ శ్లోకం చెప్పే సూర్యుడి ప్రాణదాతృత్వ మహిమను 1-3-1-7-35వ సూక్తంలోని "విసుపర్ణో అంతరిక్షాణ్యఖ్యద్గ భీరవేపాఅసురః సునీథః..." ఇత్యాది అయిన 417వ ఋక్కు చెపుతుంది. ఇక్కడ మరో విశేషం వుంది. ఈ 417వ ఋక్కులో 'సువర్ణ' అనే పేరు గల సూర్యరశ్మి త్రిలోకములందు వ్యాపించును. ప్రాణము నిచ్చును అని వుంది. ఈ సువర్ణ అనే పేరుగల సూర్యరశ్మి ఆధారంగా "యోక్త్రీభూతాన్యగస్య గ్రసితుమివ" అనే సూర్యశతక 64వ శ్లోకం పుట్టింది. ఈ శ్లోకంలో సూర్యరథం గరుత్మంతుడితో పోల్చబడింది.

3) వేదత్రితయమయిన సూర్యమండలం జ్ఞాన స్వరూపం అని చెప్పే 89వ శ్లోక సారాంశాన్ని "ఉదుత్యం జాతవేద సందీపం వహంతి కేతవః దృశే విశ్వాయ సూర్యం" అనే 1-4-1-9-50వ సూక్తంలోని 587వ ఋక్కు చెపుతుంది.



4) సూర్యశతకంలో 87, 97 శ్లోకాలు చెప్పే సూర్యుడి కాలకర్తృత్వ మహిమను ఈ క్రింది ఋక్కులు చెప్పాయి. 1-2-1-5-23వ సూక్తంలోని 244వ ఋక్కు "ఉతోసమహ్యమిందుభిఃషద్యుక్తా..." ఇత్యాది (ఇక్కడ షద్యుక్తా అని ఆఱు ఋతువులు చెప్పబడ్డాయి. కాని వేదంలో అన్యత్ర ఋతువులు ఐదు; (హేమంత శిశిరాలు కలిసి ఒక్క ఋతువే). 1-7-1-15-193వ సూక్తంలోని 1103వ ఋక్కు "తదూచుషే మానుషే మాయుగాని కర్తేవ్యం మఘవానామ బిభ్రత్..." ఇత్యాది. ఇందులో మఘవ, వజ్రీశబ్దాలు సూర్యుడికి వర్తిస్తాయి. కారణం ఇంద్రుడు ఋగ్వేదంలో సూర్యరూపంలో వస్తాడు. ఉదా॥ 1-7-1-15-102లోని 1090వ ఋక్కులో సూర్యరూప ఇంద్రుడున్నాడు. విష్ణురూపంలోకూడా వస్తాడు. అక్కడక్కడా అగ్నిరూపంలో కూడా. అగ్నిని వృత్రహంత అన్న ఋక్కు (1వ మండలం 834వ ఋక్కు) కూడా వుంది. అంటే ఋగ్వేదంలో సంభవిస్తూ వచ్చిన పరిణామ ఫలితంగా ఇంద్రమహిమలు మొదట సూర్యుడికి సంక్రమించాయి. తర్వాత విష్ణువుకు. కానీ చివరకు పురాణాల్లో ఇంద్రుడిది విష్ణువుకంటె నిమ్నస్థానంగా మారినప్పుడుకూడా సూర్యస్థానం వైదిక క్షేత్రంలో యథాతథంగానే వుండిపోయింది. నేటికీ భారతవర్షంలో సర్వబ్రాహ్మణ గృహాల్లో సవితృమంత్రఝంకృతి వినిపిస్తూ వుండడమే దీనికి నిదర్శనం. విష్ణువు ఇంద్రుడ్ని నిమ్నస్థానీకృతుడ్ని చేయగలిగాడే గానీ సూర్యుడ్ని అలా చేయలేకపోయాడు. సూర్యనారాయణ రూపంలో విలీనం జరిగినప్పటికీ, సూర్యుడు ఒక దిక్పాలకుడయినప్పటికీ, మరొక విశేషం, 1100వ ఋక్కు- ఇంద్రా! నీ తేజస్సు భూమిమీద అగ్ని, అంతరిక్షంలో సూర్యుడు అంటుంది. 2-3-1-22-164లోని 1703వ ఋక్కులో వచ్చే ఇంద్రుడు ద్వాదశాదిత్యుల్లో ఒక ఆదిత్యుడని భాష్యం. (1103వ ఋక్కు సూర్యరూప ఇంద్రుడు ఈ మానుష యుగాల్ని ఇస్తున్నాడని చెపుతుంది).

సూర్యభగవానుడి కాలకర్తృత్వాన్ని నిర్ద్వంద్వంగా విశదంగా 2-3-1-22-164వ సూక్తంలోవున్న ఋక్కులన్నీ వర్ణిస్తాయి. ఈ సూక్తం

అతిముఖ్యమయింది, మహాభారతంలోని పౌష్యపర ఉత్తంకోపాఖ్యానానికి ఇది మూలద్రవ్యం. ఈ సూక్తంలో 1686వ ఋక్కు "సప్తయుంజంతి రథమేవ చక్రమేకో అశ్వోవహతి సప్తనామా (తి) నాభిచక్రమజరమనర్వం యత్రేమా విశ్వాభువనాధితస్థుః" – ఒక రథం దానికి ఒక చక్రం దానికి ఏడు(?) పూన్చబడివున్నవి. 'సప్త' అనే పేరుగల ఒక అశ్వం ఆ రథాన్ని లాగుచున్నది. చక్రానికి మూడు కన్నములున్నవి. ఆ చక్రంనందు అన్ని లోకాలు ఆధారపడి ఉన్నవి. ఇక్కడ రథం సూర్యమండలం, అశ్వం ఏడు కిరణాలు (సప్తనామా), మూడు చక్రపు కన్నాలు త్రికాలాలు. ఈ చక్రంలో అన్ని లోకాలున్నాయి అని భాష్యం. కానీ 1687వ ఋక్కులో "సప్త వహం త్యశ్వాః" అని వుంది. "సప్తచక్రం" (ఇమం రథం) అనికూడా వుంది. 1–4–1–9–50వ సూక్తంలోని 594వ ఋక్కు సూర్యాశ్వాల సంఖ్య ఏడు అని చెపుతుంది. "సప్తత్వాహరితో రథే వహంతి సూర్యశోచిష్కేశం విచక్షణ".

సూర్యాశ్వవర్ణం శ్వేతమని 1–2–1–7–35వ సూక్తంలోని 413వ ఋక్కు "యాతిదేవః ప్రవతాయాత్యుద్వతా యాతి శుభ్రాభ్యాం యజతో హరిభ్యాం" ఇత్యాది 80వ సూక్తంలోని ఋక్కులన్నీ సూర్యదేవతాకములు. అదే సూక్తంలో 415వ ఋక్కు సూర్యాశ్వముల పేరు శ్యావములని వాటి పాదాలు తెల్లగా ఉంటాయనీ చెపుతుంది. శావము అంటే నల్లనిది; అంటే గుర్రాలు నల్లటివి వాటి పాదాలు తెల్లటివి. కానీ ఋగ్వేదం సూర్యాశ్వాలు పచ్చనివనికూడా భంగ్యంతరంగా చెపుతుంది అది "త్వం సూరో హరితో రామయో న్యా న్భరచ్చక్రమేతశోనాయ మింద్ర । ప్రాస్యపారం..." ఇత్యాది 1–8–18–121వ సూక్తంలోని 1337వ ఋక్కు. "హరిదశ్వ స్సహస్రార్చిః" అని ఆదిత్య హృదయం. సూర్యశతకంలో 56 మొదలైన శ్లోకాలు సూర్యాశ్వాలు ఆకుపచ్చనివని చెపుతాయి.

ఇంద్రాశ్వాలు ఆకుపచ్చనివని రామాయణం. శరభంగర్షి దర్శనం కోసం వెడుతూ రాముడు అందుకే రథారూఢుడై వస్తున్న ఇంద్రుడ్ని చూస్తాడు. ఇంద్రరథవర్ణన – "హరిభిర్వాజిభిర్యుక్తం అంతరిక్షగతం రథం । దదర్శ అవిదూరత స్తస్య తరుణాదిత్యసన్నిభం ॥ (అరణ్య. 5–7) గుర్రాలు పచ్చటివి రథం తరుణాదిత్య సన్నిభం. ఆ రెండు విశేషాల్ని ఋగ్వేదంలో ఇంద్ర సూర్యులకు అభేదాన్ని పాటించే ఋక్కుల్ని దృష్టిలో పెట్టుకొని చూడాలి. ఇంద్రాశ్వాలు ఋగ్వేదంలో రెండు; వాటి పేర్లు హరి. దీన్ని రామాయణ శ్లోకానికి సంధిస్తే ఏమవుతుంది! 1–1–1–2–7లోని "ఇంద్ర ఇద్ధర్యోం సచా సంమిశ్ల..." ఇత్యాది 62వ ఋక్కు ఇంద్రాశ్వాల పేర్లు హరి అని చెపుతుంది. 1–1–1–3–10లోని 93వ ఋక్కు కూడా అదే చెపుతుంది. ఇంకా చాలా ఋక్కులు అదే చెపుతాయి. 1–6–1–13–82వ సూక్తంలోని ఋక్కులన్నీ (873 నుంచి 878) రెండు గుర్రాలని కూడా చెపుతాయి. ఇంద్రుడివి ఎప్పుడూ రెండు గుర్రాలే. 1–1–1–2–6లో 52వ ఋక్కు ఇంద్రుడి రెండు గుర్రాలు ఎర్రగా వున్నాయని చెపుతుంది. (బహుశా అగ్నిరూప ఇంద్రుని విషయం కావచ్చు. కారణం అగ్న్యశ్వాలవర్ణం ఎరుపు.)

సూర్యుడి కాలకర్తృత్వమహిమ పునఃప్రసక్తం చెయ్యాలి. 2–3–1–22–164 సూక్తంలోని 1695వ ఋక్కు సూర్యరథచక్రం ద్వాదశారం అని వర్ణించింది. అంటే ఆ చక్రానికి పంద్రెండు ఆకులున్నవని, పంద్రెండాకులు మేషాది ద్వాదశరాశులు అని భాష్యం. కాని 1697వ ఋక్కులో "పంచారే చక్రే పరివర్తమానే" అని వుంది. అంటే ఆ చక్రానికి ఐదు ఆకులట! ఐదాకులు ఐదు ఋతువులని భాష్యం. హేమంత శిశిరము కలిపి వేదంలో ఐదు ఋతువులే. ఈ 164వ సూక్తఋక్కులన్నింటినీ సూర్యశతక పఠిత అత్యంత మర్మదృష్టితో చదవాలి.

5) సూర్యశతకం 11వ శ్లోకం సూర్యభగవానుడు పాంథులకు మార్గమని చెపుతుంది. ఈ భావం 1–7–1–15–105లో "అసౌ యః పంథా ఆదిత్యో దివి ప్రవాచ్యం కృతః" అనే ఋక్కు చెపుతుంది.

6) సూర్యుడు సర్వాంతర్యామి, జీవులకు సర్వస్వం అని సూర్యశతక 100వ శ్లోకం చెప్పే మహద్విషయాన్ని 1–8–1–16–115 సూక్తంలోని

మొదటిదైన 1236వ ఋక్కు ప్రతిపాదిస్తుంది. "చిత్రం దేవానా ముదగా దనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః । ఆప్రా ద్యావా పృథివీ అంతరిక్షం సూర్యఆత్మా జగతస్తస్థుషశ్చ" "ఏషసుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః" అని ఆదిత్య హృదయం.

శ్రీ సూర్యశతకాన్ని ఈ యావత్తు సామగ్రినీ దృష్టిలో పెట్టుకొని చదివితే ఆ కావ్యపు సమగ్ర మహిమ సాక్షాత్కరిస్తుంది.

అస్తగిరి, మేరు పర్వతం రెండు విభిన్న పర్వతాలని కనిపిస్తుంది కిష్కింధకాండలో సుగ్రీవుడు పశ్చిమదిక్కు వెళ్ళే వానరులకు ఆ దిక్కు భూగోళవర్ణన చేస్తాడు. అక్కడ అరవైవేల కాంచన పర్వతాలున్నాయని చెపుతూ "తేషాం మధ్యేస్థితో రాజా మేరురుత్తమ పర్వతః । ఆదిత్యేన ప్రసన్నేన శైలోదత్తవరః పురా... అదృశ్య సర్వభూతానాం అస్తం గచ్ఛతి పర్వతం । యోజనానాం సహస్రాణి దశశతాని దివాకరః ॥ ముహూర్తార్ధేన తం శీఘ్రం అభియాతి శిలోచ్ఛయం... । అంతరా మేరుమస్తంచ తాళోదశశిరామహాన్। జాతరూపమయం శ్రీమాన్ భ్రాజతే చిత్రవేదికః ॥" (కిష్కింధ 42 సర్గ – 38 శ్లో – 46 శ్లో వరకు)

ఇక కశ్యపుడు అదితి అనూరుడు ఆదిత్యుడు ఆదిత్యుల సంఖ్య ఇత్యాది విషయాలమీద చాలా విస్తృత చర్చకు తావుంది. ఋగ్వేదం నుంచి రామాయణం వరకు అన్ని గ్రంథాలు చర్చలోకి వస్తాయి. గ్రంథ విస్తరభీతిచేత మద్విరచిత 'షోడశీ' నామక గ్రంథంలో (తిరుపతి దేవస్థానం ముద్రణం) 176, 177 పేజీల్లోవున్న చర్చ చూడవచ్చునని చెపుతున్నాను. అయితే ఇక్కడ ఒక చిన్న విషయం చ్యుతమయింది. 'అరిష్టనేమినః' అన్న శబ్దానికి రామాయణ వ్యాఖ్యాతలు 'అరిష్టనేమినః కాశ్యపస్య నకారాం తత్వమార్షం' అన్నారు. కానీ 'త్రియంబకం యజా మహే సుగంధిం పుష్టివర్ధనం' అన్నచోట సుగంధినం అనబడలేదు. ఈ విషయం సమీచీనతయా చింత్యం. మరొకటి



సామవేదంలో 3వ అధ్యాయం 11వ ఖండంలో అరిష్టనేమి అనే మంత్రర్షి వున్నాడు. అతడు తార్క్ష్య పుత్రుడు.

మయూరుడి కావ్యశైలిమీద ఆయన పూర్వులైన మహాకవుల ప్రభావం వుండడం సహజం. వారిలో ముఖ్యంగా కాళిదాస, భర్తృమేంఠులు అత్యంత ప్రభావశాలి కవులు. కాళిదాస మేఘసందేశంలోని మందాక్రాంత వృత్తగమనము, భర్తృమేంఠుని హయగ్రీవవధము కావ్యంలోని స్రగ్ధరాఠీవి బహుశః మయూరుడి కాలంలో కావ్యపాఠకుల్ని వశీభూతం చేసుకుని వుంటాయి – "యక్షశ్చక్రే జనకతనయాస్నాన పుణ్యోదకేషు । స్నిగ్ధచ్ఛాయా తరుషువసతిం రామగిర్యాశ్రమేషు" (మేఘ) సరిగ్గా అలాంటిశైలే అయిన భర్తృమేంఠుడి స్రగ్ధర – "ఘానగ్రాసం గ్రహాణ, త్యజగజక లభ! ప్రేమబంధం కరిణ్యాః । పాశగ్రంథిం వ్రణానాం అభిమతమధునాదేహి పంకానులేపం । దూరీభూతాస్తవైతే శవర వరవధూ విభ్రమోద్భ్రాంత రమ్యా! రేవా కూలోపకంఠద్రుమ కుసుమ రజోధూసరా వింధ్యపాదాః ।" – ఈ రెంటినీ చదివితే, కర్ణేంద్రియంతో అనుభవిస్తే సాహిత్యాళువులు కాళిదాస భర్తృమేంఠుల శైలి అనంతర కవులను ప్రభావితం చేసిందని తెలుసుకుంటారు. క్రీ.పూ. 1వ శతాబ్దివాడు కాళిదాసు; భర్తృమేంఠుడు క్రీ.శ. 430 నాటివాడు. శివమహిమ్న స్తోత్రము, సౌందర్యలహరి ఇత్యాది ప్రాచీన కావ్యాల్లోకూడా పూర్వుల ఛందశ్శైలికి సన్నిహితమైన శిఖరిణీ వృత్తం గ్రహింపబడింది. మొత్తంమీద వీటన్నిటికీ శైలిలో శబ్దచయనాది లక్షణాల్లో సారూప్యం వుంది. భర్తృమేంఠానంతరం క్రమంగా జయదేవ, భోజదేవ, లీలాశుకాదులనుంచి శబ్దాలంకారాల అంతశ్శక్తిని నిపుణతతో వాడడం ప్రాచుర్యం పొందింది. మయూరుడు ఈ మార్గానికి మూలపురుషుడుగా కనిపిస్తాడు.

సూర్యశతకంలో అక్కడక్కడా స్పష్టమైన కాళిదాస ప్రభావం కనిపిస్తుంది. 55వ శ్లోకంలో "విశ్వస్యేవాదిసర్గః ప్రణవ ఇవపరం పావనో వేదరాశేః"

అన్నచోట రఘువంశంలోని "ప్రణవశ్ఛందసామివ" జ్ఞాపకం వస్తుంది. "ఏకాహేనైవ దీర్ఘాం త్రిభువన పదవీం" అనే 65వ శ్లోకం చదివితే కాళిదాస శాకుంతల ప్రథమాంక "గ్రీవాభంగాభిరామం" లోని "పశ్యోదగ్రప్లుతత్వాద్వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి" స్మృతి పథంలో మెరుస్తుంది. అలాగే "యః స్రష్టాపాం పురస్తాదచలవర సమభ్యున్నతేర్వేతురేకో" అనే 93వ శ్లోకం "యాసృష్టిః స్రష్టురాద్యా వహతి విధిహుతం యాహవిర్యాచహోత్రీ" శ్లోకరచనా పద్ధతి గుర్తుకొస్తుంది. "యేద్వేకాలంవిధత్తః" అనే మాటల పద్ధతికూడా "చతురాశాముఖస్త్రాద్విభక్తో! ద్వేధావేధా ఇవావిష్కృత" అనే మయూరుడి పై శ్లోకపంక్తుల్లో కనిపిస్తుంది.

ఇలాంటి మహాకవులకు ఆంధ్రమహాకవులు పాదాక్రాంతులయ్యారు. "జంభారాతీభకుంభోద్భవమివ" అని మయూరుడు ప్రారంభించగానే శ్రీనాథుడు "జంభారాతీభశోభాచకచకనిభముల్ శాంభవీయాట్టహాసా । రంభావష్టంభరేఖారభటలటహముల్" అని ఆ వేగోద్ధతికి వశీభూతుడై నక్షత్ర మండలం చేరాడు.

ఏవంగుణగణ విశిష్టమైన ఈ సూరశతకానికి విద్వాంసులైన మన్మిత్రులు శ్రీ తాళ్లూరి ఆంజనేయులు గారు 'బాలప్రభ' అనే ఆంధ్రవ్యాఖ్య అత్యుత్కృష్టంగా వ్రాశారు. మూలకృతి ముద్రణలనేకం పరిశీలించి వేదోపనిషత్పురాణేతిహాసాల నుంచి ప్రమాణాలు తీసుకుంటూ తన వ్యాఖ్యకు సౌష్ఠవం కలిగిస్తూ వ్రాసిన ఈ వ్యాఖ్య నిస్సంశయంగా తెలుగు సాహిత్యానికి అమూల్య ఉపహారమని భావిస్తున్నాను. శ్రీ ఆంజనేయులు గారి విద్వత్తను మహాకవి హృదయభాండార మర్మజ్ఞతను పునఃపునః ప్రశంసిస్తున్నాను.

జ్ఞాన్‌బాగ్ — గుంటూరు శేషేంద్రశర్మ
హైదరాబాద్–12

# విషయానుక్రమణిక

# ప్రభావర్ణనమ్

***స్రగ్ధరా. జంబారాతీభకుంభోద్భవమివ దధత స్సాంద్రసిందూరరేణుం**
**రక్తాస్సిక్తా ఇవౌఘై రుదయగిరితటీధాతుధారాద్రవస్య,**
**ఆయాంత్యా తుల్యకాలం కమలవనరుచేవారుణా వో విభూత్యై**
**భూయాసుర్భాసయంతో భువనమభినవా భానవో భానవీయాః ॥ 1**

**అవతారిక :** ప్రాతఃకాలంలో ఆకాశంలో మనకు కన్పించే అరుణకాంతిని స్వర్గ, భూలోకవాసులు ఎలా భావిస్తారో చెబుతున్నాడు కవి.

**ప్రతిపదార్థం :** జంభారాతీభ కుంభోద్భవమ్, జంబ+అరాతి= జంభాసురునికి శత్రువైన ఇంద్రునియొక్క[1]; ఇభ= వాహనపుటేనుగైన ఐరావతంయొక్క[2]; కుంభ+ఉద్భవమ్= కుంభ (గండ) స్థలమునందు పుట్టిన; సాంద్ర= దట్టమైన; సిందూరరేణుమ్= చెందిరపు ఎఱ్ఱని ధూళిని; దధతః ఇవ= ధరించుచున్న వానివలె వున్నట్టియు; ఉదయ... ద్రవస్య; ఉదయగిరి= మేరు పర్వతంయొక్క[3]; తటీ= సానువులందు (చరియలందు) భాసిల్లునట్టి; ధాతుధారా ద్రవస్య= గైరికాది ధాతువుల ధార ఆకారంకల్గిన ద్రవంయొక్క; ఓఘైః= ప్రవాహాలచేత; సిక్తాః= తడువబడడంవలన; రక్తాః ఇవ= ఎఱ్ఱదనాన్ని వహించినవానివలె వున్నట్టియు; తుల్యకాలం= ఏకకాలంలో; ఆయాంత్యా= వచ్చుచున్నట్టి; కమలవనరుచాఇవ= పద్మాలగుంపుయొక్క కాంతిచేతవలె; ఆరుణాః= ఎఱ్ఱనైనట్టివియు అయిన (సూర్యోదయంతోపాటే కమలాలకుకూడ కాంతి కల్గుతుందని భావం); భువనమ్= ముల్లోకాలను; భాసయంతః= ప్రకాశింపజేయుచున్న; అభినవాః= నిత్యనూతనాలైన; భానవీయాః= సూర్యసంబంధమైన; భానవః= కిరణాలు; వః= మీకు; విభూత్యై= ఐశ్వర్య సమృద్ధికొరకు; భూయాసుః= అగునుగాక!

**తాత్పర్యం :** ఐరావతం యొక్క గండస్థలంనందలి ఎఱ్ఱదనాన్ని తాల్చి (స్వర్గలోకంలోని వారికి అలా అనిపిస్తుంది) ఉదయపర్వత సానువుల నుండి

ప్రవిస్తున్న గైరికాది ధాతువుల ప్రవాహంతో తడిసి ఎఱ్ఱబడినవై, కమలాలతోపాటే ఒకే సమయంలో అరుణత్వాన్ని పొంది (భూలోకంలోని వారికి అలా తోస్తుంది) లోకాలకు వెలుతురును ప్రసాదిస్తున్న నిత్యనూతనాలైన ఆ సూర్యభగవానుని ప్రభాత కిరణాలు మీకు ఐశ్వర్యదాయకాలు అగునుగాక!

**వివరణ :** * ఈ శ్లోకం సుభాషితరత్న భాండాగారంలో కన్పిస్తుంది.

పుట 45 శ్లో. 12. 1938 బొంబాయి ముద్రణం)

1. జంభాసురుని ప్రసక్తి రామాయణ, భారత, భాగవతాల్లో కన్పిస్తుంది. అన్నింటిలోనూ అతడు ఇంద్రునికి శత్రువుగా చెప్పబడి చంపబడినట్లు వర్ణింపబడింది.

   "ఇంద్రో జంభస్య సంక్రుద్ధో వజ్రేణాపహరచ్ఛిరః"

   (సం.భాగ. 8-11-18)

2. ఐరావతం లేక ఐరావణం అనేది క్షీరసాగరమథనంలో పుట్టిన రత్నాల్లో ఒకటి. దీన్ని ఇంద్రుడు కావాలని వాహనంగా చేసుకున్నాడు. అష్టదిక్కుల్లో అష్టదిగ్గజాలుంటాయని పురాణ ప్రతీతి. అలాగే ఇంద్రాదులు ఎనిమిదిమంది ఎనిమిది దిక్కులు కాపాడుతారనికూడా ప్రసిద్ధి. తూర్పు దిక్పాలకుడైన ఇంద్రుని వాహనంకాబట్టి ఇక్కడ ఐరావతం ప్రసక్తమైంది.

   1) ఐరవతః పుండరీకో వామనః కుముదోఽఞ్జనః ।
   పుష్పదన్త స్సార్వభౌమస్సు ప్రతీకశ్చ దిగ్గజాః ॥

   2) ఇన్ద్రో వహ్నిః పితృపతిర్నైరృతో వరుణో మరుత్ ।
   కుబేర ఈశః పతయః పూర్వాదీనాం దిశాం క్రమాత్ ॥

అని అమరంలో అష్టదిక్పాలకులు, వారి వాహనాల పేర్లు యథాక్రమంలో ఇవ్వబడ్డాయి (అమరం, పుట 66).



3. ఉదయపర్వతం అన్నా మేరుపర్వతం అన్నా ఒక్కటే. దీనికి వెనుకనుంచే సూర్యోదయం అవుతుందని ప్రసిద్ధి. దీని ఎత్తు సుమారు 84 వేల యోజనాలు. అంటే 16,38,604 కి.మీ.లకు సమానం. (24 అంగుళాలు ఒక హస్తం. 8 వేల హస్తాలు 1 క్రోసు. 4 క్రోసులు 1 యోజనం అంటే ఆమడ అన్న అమరవాక్యం ఆధారంగా పై లెక్క ఊహింపబడింది).

**ప్ర. భక్తిప్రహ్వాయ దాతుం ముకుళపుటకుటీకోటర క్రోడలీనాం**
**లక్ష్మీ మాకృష్టుకామా ఇవ కమలవనోద్ఘాటనం కుర్వతే యే,**
**కాలాకారాంధకారానన పతితజగత్సాధ్వసధ్వంసకల్యాః**
**కల్యాణం వః క్రియాసుః కిసలయరుచయ స్తే కరా భాస్కరస్య ॥* 2**

**ప్రతి :** ముకుళ... లీనా ముకుళ= అరవిరిసిన మొగ్గలయొక్క (అప్పుడే వికసించడానికి సిద్ధంగావున్న పరువైన మొగ్గ); పుట= దొప్పలేక దొన్నె అనెడి; కుటీ= గృహభాగంయొక్క; కోటర= లోపలి ప్రదేశంయొక్క; క్రోడ= తొఱ్ఱలాంటి మధ్యభాగంనందు; లీనాం= లగ్నమైన; లక్ష్మీం= సంపదను (శోభను); భక్తి ప్రహ్వాయ= భక్తితో కొలిచేవారికి (వినమ్రులకు); దాతుం= ఇవ్వడానికి; ఆక్రష్టు కామా ఇవ= ఆకర్షించు ఉద్దేశం కలవానివలె; యే= ఏవైతే; కమలవన+ఉద్ఘాటనం= పద్మదళాల వికాసాన్ని; కుర్వతే= చేయుచున్నవో కాలాకార... కల్యాః కాల+ఆకార= యమునివలె నల్లని ఆకారం కల్గిన; అంధకార= చీకటియొక్క; ఆనన= ముఖంనందు; పతిత= పడినట్టి; జగత్= లోకంయొక్క; సాధ్వస= భయాన్ని; ధ్వంస= పోగొట్టడంలో; కల్యాః= సమర్ధములైన; కిసలయ= చిగుళ్ళయొక్క; రుచయః= కాంతివంటి కాంతికల్గిన; తే= ఆ; భాస్కరస్య= సూర్యునియొక్క; కరాః= కిరణాలు; వః= మీకు; కల్యాణం= శుభాన్ని; క్రియాసుః= చేయుగాక.

**తా :** కమలనివాసిని అయిన లక్ష్మీదేవిని భక్తులందరికీ అందుబాటులోనికి తేవడానికా అన్నట్లు ఏవైతే కమలాలకు వికాసాన్ని కలిగిస్తున్నాయో,

యమునివంటి చీకటి బారినుంచి భయపడిన లోకాన్ని రక్షించడంలో సమర్థాలైన చిగురుటాకు వన్నెగల ఆ బాలభాస్కరుని కిరణాలు మీకు శుభాన్ని కలిగించుగాక!

**అలం :** ఉత్ప్రేక్ష (లక్ష్మీ మాకృష్టుకామా ఇవ అనడంవల్ల)

**విశే :** కమలంయొక్క వికసించిన రేకుల లోపల ఆసీనురాలైన లక్ష్మీదేవి క్షీరసాగర మథన ఫలం. ఆమె కలుములరాణి. కవి ఇక్కడ 'లక్ష్మీ' పదాన్ని సంపద అనే అర్థంలో వాడాడు. 'భాస్కరకరాః' అనేచోట 'కర' శబ్దం సాభిప్రాయంగా వాడబడింది. కమలవనంలో చిక్కుకున్న లక్ష్మిని అందరికీ అందించాలంటే 'కర' శబ్దానికి ఇక్కడ చేయి అనే అర్థంకూడ చెప్పుకోవాలి.

**వివ :** *ఈ శ్లోకంకూడ సుభాషితరత్న భాండాగారంలో కన్పిస్తుంది. (పుట 45 శ్లో. 13)

స్ర. **గర్భేష్వంభోరుహాణాం శిఖరిషుచ శితాగ్రేషుతుల్యంపతంతః**
**ప్రారంభేవాసరస్య వ్యుపరతిసమయే చైకరూపా స్తథైవ,**
**నిష్పర్యాయం ప్రవృత్తాస్త్రిభువనభువనప్రాంగణే పాంతు యుష్మా**
**నూష్మాణం సంతతాధ్వశ్రమజమివ భృశం బిభ్రతో బ్రధ్నపాదాః॥ 3**

**అవ :** సూర్యుని పాదాలకు (కిరణాలకు) లోకంలో పాదాలకు (కాళ్ళకు) వ్యత్యాసం చెబుతున్నాడు.

**ప్రతి :** అంభోరుహాణాం= కమలాలయొక్క; గర్భేషు= లోపలి ప్రదేశాలందు; శితాగ్రేషు= వాడియైన చివరలుగల; శిఖరిషుచ= పర్వతాలందును; తుల్యం= సమానంగా; పతంతః= పడుతున్నట్టి (ఇతర పాదాలైతే మెత్తని భూముల్లో మాదిరిగా ముళ్ళున్న తావుల్లో నడవలేవు); వాసరస్య= దినంయొక్క; ప్రారంభే= ఉదయకాలమందు; వ్యుపరతిసమయేచ= అస్తమయకాలమందును; తథైవ= సమానంగానే; ఏకరూపాః= ఒకే రూపం కలిగినటువంటి; త్రిభువన భవనప్రాంగణే= ముల్లోకాలనే గృహంయొక్క ముంగిటిలో; నిష్పర్యాయం=



క్రమంతోగాక; (అనగా ఒకేసారి) ప్రవృత్తాః= ప్రసరించునట్టి (ఇతర పాదాలు లోకంలో సహజంగా ఒకదాని తర్వాత మరొకటి మోపడం జరుగుతుంది); సంతత.... మివ సంతత= ఎడతెగని; అధ్వ= సుదీర్ఘ ప్రయాణంయొక్క; (అధ్వశబ్దోఽత్రాధిక గమనే వర్తతే" అని త్రిభువన పాలవ్యాఖ్య); శ్రమజమివ= శ్రమనుండి పుట్టిన దానివలె; ఊష్మాణం= వేడిని (ఉక్కబోయడం); భృశం= మిక్కిలి; బిభ్రతః= ధరించిన (ఇతర పాంథుడు అంటే బాటసారి కేవలం ఉక్కను భరిస్తాడు); బ్రధ్న= సూర్యుని యొక్క; పాదాః= కిరణాలు; యుష్మాన్= మిమ్మల్ని; పాతు= కాపాడుగాక!

**తా :** మెత్తని కమలాల్లో మాదిరిగానే వాడియైన పర్వత భూముల్లోను సమానమైన నడక కల్గి; ఉదయాస్తమయ కాలాల్లో ఒకే విధమైన వర్ణం (వన్నె) కల్గి; ముల్లోకాలనే ఇంటి ముంగిట్లో ఒకే పర్యాయం అడుగుమోపి నిరంతర ప్రయాణంచేత కల్గిన అలసట కారణంగా ఉక్కదాల్చిన ఆ సూర్యకిరణాలు మిమ్మల్ని కాపాడుగాక!

**అలం :** ఉత్ప్రేక్ష (సంతతాధ్వశ్రమజమివ అనడంచేత)

**విశే :** 'బ్రధ్నపాద' లోని పాదశబ్దం సాభిప్రేతం. కవి లోకంలోని పాదాలకు (కాళ్ళకు) సూర్యుడి పాదాలకు (కిరణాలకు) గల వ్యత్యాసాన్ని వ్యంగ్యంగా చెప్పి సూర్యునిపాదాలే ఉత్కృష్టం అని సూచించాడు. లోకంలో ఏ ప్రాణియైనా ఒకేసారి పూలతోటలోను, రాళ్ళమీద నడవలేడు. అలాగే లోకంలో పాదాలు ఒకదాని తర్వాత మరొకటి నడవడం అనే క్రమం ఉంటుంది. సూర్యుని పాదాలు అలాగాక ఏకకాలంలో నడుస్తాయి. కనుక వ్యతిరేకాలంకారం కూడ వుంది.

స్ర. **ప్రభ్రశ్యత్యుత్తరీయత్విషి తమసి సముద్వీక్ష్య వీతావృతీన్ప్రా**
**గ్జంతూం స్తంతూన్యథా యానతను వితనుతే తిగ్మరోచిర్మరీచీన్,**
**తే సాంద్రీభూయ సద్యః క్రమవిశదదశాశా దశాలీవిశాలం**
**శశ్వత్సంపాదయంతోఽంబరమమలమలం మంగళంవో దిశంతు॥ 4**

**ప్రతి :** యథా= ఏవిధంగా; ప్రాక్= మొదట; ఉత్తరీయ= అంశుకంయొక్క; త్విషి= కాంతిగల; తమసి= చీకటి; ప్రభ్రశ్యతి= తొలగిపోగా; వీత= తొలగింపబడిన; ఆవృతీన్= ఆచ్ఛాదనం కల; జంతూన్= ప్రాణులను; సముద్వీక్ష్య= చక్కగాచూచి; తిగ్మరోచిః= తీక్ష్ణకాంతులు గల సూర్యుడు; యాస్= ఏ; మరీచీన్= కాంతులనెడి; తంతూన్= దారాలను; అతను= విస్తారంగా; వితనుతే= విస్తరింపజేయుచున్నాడో; అదేవిధంగా; సాంద్రీభూయ= చిక్కబడి; సద్యః= వెంటనే క్రమ... విశాలం క్రమ = క్రమంగా; విశద= స్పష్టమైన; దశాశా= పదిదిక్కుల యొక్క; దశాళీ= పది అను వరుసచేత; విశాలం= విస్తీర్ణం కలదిగానూ; శశ్వత్= ఎల్లప్పుడూ; అమలం= నిర్మలమైన దానిగా; అంబరం= ఆకాశాన్ని; సంపాదయంతః= చేయుచున్న; తే= ఆ సూర్యకిరణాలు; వః= మీకు; అలం= మిక్కిలి; మంగళం= శుభాన్ని; దిశంతు= ఇచ్చుగాక!

**తా :** చీకటి అనే వస్త్రం తొలగిపోయాక జీవులకు కిరణాలనే తంతువులద్వారా అల్లిన నిర్మలమైన అంబరాన్ని (వస్త్రాన్ని) ప్రసాదిస్తున్న ఆ సూర్యభగవానుడు మీకు శుభాన్ని కల్గించుగాక! తంతువులు ఒకదానికొకటి చేరి వస్త్రాన్ని నిర్మించినట్లు కిరణాలు దట్టమై నిర్మలాకాశాన్ని అందిస్తున్నాయని ఉద్దేశం.

**అలం :** శ్లేష

**విశే :** ఇందులో సూర్యభగవానుడు ఒక నేతపనివాడుగా వర్ణింపబడ్డాడు. ఏవిధంగా ఒక నేతపనివాడు ఆచ్ఛాదనలేని ప్రాణులకోసం దారపు పోగులతో వస్త్రాన్ని నిర్మిస్తాడో అదేవిధంగా సూర్యుడు తన కిరణతంతువులతో చీకటి ఆవరణం వీడిన జీవకోటికోసం నిర్మలాంబరాన్ని సృజిస్తున్నాడు. (అంబరం వ్యోమ్నివాససి అని అమరం) ఈ శ్లోకంలోని ప్రథమపాదం ధ్వన్యాలోకంలో ఉదాహృతం (31-6 వృత్తికా) సూర్యశతకంలోని కొన్ని శ్లోకాల్లో దిక్కులు ఎనిమిది అని, మరికొన్ని శ్లోకాల్లో పది అని చెప్పబడడం గమనార్హం. 13,



59 శ్లోకాల్లో ఎనిమిది; 4, 17, 85, 94 శ్లోకాల్లో పది దిక్కులు చెప్పారు. వ్యాసమహాభారతంలో మాత్రం పదిదిక్కులే చెప్పబడ్డాయి.

"దిశో దశోక్తాః పురుషస్యలోకే (మహా. 3-134-17)

1930 పూనా ముద్రణం.

ప్ర. **న్యక్కుర్వన్నోషధీశే ముషితరుచి శుచేవౌషధీః ప్రోషితాభా**
**భాస్వద్గ్రావోద్గతేన ప్రథమమివ కృతాభ్యుద్గతిః పావకేన,**
**పక్షచ్ఛేదవ్రణాసృక్స్రుతఇవ దృషదో దర్శయన్ ప్రాతరద్రే**
**రాతామ్రస్తీవ్రభానో రనభిమతనుదే స్తాద్గభస్త్యుద్గమోవః**[1] ॥ **5**

**ప్రతి :** ఓషధీశే= ఓషధులకు పతియైన చంద్రుడు; ముషితరుచి= కాంతిహీనుడుకాగా; శుచా= దుఃఖంచేతవలె; ప్రోషితాభా= పోగొట్టబడిన కాంతిగల; ఔషధీః= ఓషధిగతతేజస్సులకు; (ఓషధిశబ్దేనౌషధిస్థం తేజఉచ్యతే, తాస్థ్యాత్, యథాగిరిర్దహ్యతే పన్థానో ముష్యన్త ఇతి అని త్రిభువన పాలవ్యాఖ్య); న్యక్కుర్వన్= ధిక్కరిస్తూ; భాస్వద్గ్రావ+ఉద్గతేన= సూర్యకాంతి మణులనుండి వెలువడిన; పావకేన= అగ్నిచేత; ప్రథమం= ముందుగా; కృత+అభ్యుద్గతిః ఇవ= ఇవ్వబడిన స్వాగతంకల్గిన దానివలె వుండి; పక్ష... స్రుతఇవ పక్షచ్ఛేద= రెక్కలను నరకడంవలన (ఇంద్రుడు) ఏర్పడిన; వ్రణ= గాయాల యొక్క; అసృక్స్రుతఇవ= రక్తం కారుతున్న దానివలె; ప్రాతర్అద్రేః= ఉదయ పర్వతంయొక్క; దృషదః= శిలలను; దర్శయన్= ప్రకటిస్తూ; ఆతామ్ర= లోహితవర్ణం గల (ఎఱుపు); తీవ్రభానోః= తీక్ష్ణమైన సూర్యునియొక్క; గభస్తి= కిరణాల; ఉద్గమః= రాక; (పుట్టుక); వః= మీకు; అనభిమత= పాపము; (శత్రువు, అశుభం, అనిష్టం) నుదే= పోగొట్టడానికి; స్తాత్= అగుగాక! (అనగా మీ పాపాలన్ని పోగొట్టుగాక అని అర్థం).

**తా :** ఓషధులకు పతియైన చంద్రుడస్తమించగానే కాంతి కోల్పోయిన ఓషధిలతలను తిరస్కరిస్తూ, సూర్యకాంత మణులనుంచి వెలువడుతున్న

అగ్నిచేత స్వాగతం అందుకొని ఇంద్రునిచేత నరకబడిన రెక్కల గాయాలనుంచి కారుతున్న రక్తాన్ని సూచించే తూరుపుకొండ శిలలు కలిగి వెలువడుతున్న ఆ సూర్యభగవానుని అరుణకిరణోదయం మీ పాపాలను పోగొట్టుగాక!

**అలం :** హేతూత్ప్రేక్ష

**విశే :** ఉదయించే సూర్యకిరణాల్లోని ఎర్రదనాన్ని కవి చక్కగా ఉత్ప్రేక్షించాడు. ఇంద్రుడు తన వజ్రాయుధంతో పర్వతాల రెక్కల్ని నరికాడని పురాణ ప్రతీతి. ఇంద్రుడు ఉదయాద్రియొక్క రెక్కలను నరకగా ఆ గాయాల నుంచి కారుతున్న రక్తంతో తడిసి సూర్యకిరణాలు ఎర్రబడ్డాయని కవి చమత్కారం.

**వివ :** 1. శ్రీనాథుని అనువాదాన్ని చూడవచ్చు. (కాశీ. 1-122)

స్ర. **శీర్ణఘ్రాణాంఘ్రిపాణీన్వ్రణిభి రపఘనైర్ఘర్ఘరావ్యక్తఘోషాన్**
**దీర్ఘాఘ్రాతానఘౌఘైః పునరపి ఘటయత్యపిఏక ఉల్లాఘయన్యః**
**ఘర్మాంశో స్తస్యవోఽ ంత్వర్ద్విగుణఘనఘృణానిఘ్న నిర్విఘ్నవృత్తే**
**ర్దత్తార్ఘాస్సిద్ధసంఘైర్విదధతు ఘృణయశ్శీఘ్రమంహో విఘాతమ్॥ 6**

**ప్రతి :** శీర్ణ... పాణీన్ శీర్ణ= శిథిలాలైన; ఘ్రాణ= ముక్కు; అంఘ్రి= పాదాలు; పాణిన్= చేతులు కలవారిని; వ్రణిభిః= గాయాలు కల; అపఘనైః= శరీరాలతో; ఘర్ఘర= గురగురమనెడి; అవ్యక్తఘోషాన్= అస్పష్టమైన మూలుగువంటి ధ్వనిగలవారిని; ఈ విధంగా, అఘ+ఓఘైః= పాపసమూహం చేత; దీర్ఘ+ఆఘ్రాతాన్= చిరకాలంగా ఆవరింపబడినవారిని (పాపాలు లోగొన్నవారిని); యఃఏకః అపి= ఎవడు నిస్సహాయుడైనప్పటికి (ఒంటరివాడు) ఉల్లాఘయన్= వ్యాధిరహితులను (విముక్తులను) చేయడాన్ని; ఘటయతి= నిర్వర్తించుతున్నాడో (సంఘటిస్తున్నాడో); అంతర్ద్వి... వృత్తే అంతః= లోపల; ద్విగుణ= రెట్టింపయిన; ఘన= గొప్పదైన; ఘృణా= దయచేత; నిఘ్న= పరవశమై; నిర్విఘ్నవృత్తేః= అంతరాయం లేని వ్యాపారము



గల (ప్రవృత్తి); తస్య= ఆ; ఘర్మాంశోః= తీక్ష్ణకిరణుడైన సూర్యునియొక్క; సిద్ధసంఘైః= ఆణిమాది అష్టసిద్ధులు గల విశ్వావసు ప్రభృతులచేత (ఆణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ, వశిత్వములు అష్టసిద్ధులు); దత్తార్ఘాః= పూజింపబడినట్టి; ఘృణయః= కాంతులు; వః= మీకు; శీఘ్రం= వెంటనే; అంహోవిఘాతం= పాపనాశనాన్ని; విదధతు= ప్రసాదించుగాక! (పాపాలు పోగొట్టుగాక).

**తా :** "పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ బాధతే" అన్న ఆర్యోక్తి ప్రకారం పూర్వజన్మకృత పాపఫలంగా శిథిలమై పోయిన ముక్కు, కాళ్ళు, చేతులువంటి అవయవాలు కలిగి దుర్గంధభూయిష్ఠమైన గాయాలతో అస్పష్టమైన మూలుగులు కలిగి బాధపడుతున్నవారిని ఓదార్చి స్వస్థత చేకూర్చునటువంటి సిద్ధాదిదేవగణంచేత నిత్యం పూజింపబడే ఆ సూర్యకిరణాలు మీ పాపాలు పోగొట్టుగాక!

**అలం :** అనుప్రాసం. ('ఘ' వర్ణం పదే పదే ప్రసక్తమైంది)

**విశే :** ఈ శ్లోకం మమ్మట కృత కావ్యప్రకాశంలో (7-301) రూక్షధ్వనికల శబ్దాల కుదాహరణంగా ఇవ్వబడింది. మమ్మటాభిప్రాయం ప్రకారం ఈ శ్లోకంలో శబ్దాల కఠోరతలో ఎటువంటి గుణంకాని దోషం కాని లేదు. "క్వచిన్నీరసే నగుణో నదోషః యథా... అని మమ్మట వాక్యం. జనశ్రుతినిబట్టి బహుశా ఈ శ్లోకం వ్రాసిన తర్వాతే మయూర మహాకవి సూర్యానుగ్రహంవల్ల కుష్ఠవ్యాధి విముక్తుడయ్యాడని భావించవచ్చు. ఎందుకంటే ఇందులో వర్ణన కుష్ఠరోగానికి సంబంధించినదే.

స్ర. **బిభ్రాణా వామనత్వం ప్రథమమథ తథైవాంశవః ప్రాంశవోవః**
**క్రాంతాకాశాంతరాళా స్తదను దశదిశః పూరయన్తస్తతోఽ పి,**
**ధ్వాంతాదాచ్ఛిద్య దేవద్విష ఇవ బలినో విశ్వమాశ్వశ్నువానాః**
**కృచ్ఛ్రాణ్యుచ్ఛ్రాయ హేలోపహసితహరయో హారిదశ్వాహరంతు॥ 7**

**ప్రతి :** ప్రథమం= మొదటగా; వామనత్వం= పొట్టి ఆకారాన్ని; బిభ్రాణాః= ధరించినవై; అథ= తరువాత; తథైవ= అదేవిధంగా (వామనావతారాన్ని తాల్చిన మహావిష్ణువు మాదిరిగా); ప్రాంశవః= దీర్ఘములైన; అంశవః= కిరణాలు కలిగి; తదను= ఆ వెంటనే; క్రాంత= ఆక్రమింపబడిన; ఆకాశ+ అంతరాళాః= ఆకాశ మధ్యభాగం కలిగి; తతఃఅపి= ఆ వెనువెంటనే; దశదిశః= పది దిక్కుల్ని; పూరయన్తః= నింపినవై; దేవద్విషః= దేవతలకు శత్రువైన; బలినః ఇవ= బలిచక్రవర్తి నుండివలె; ధ్వాంతాత్= చీకటి నుండి; విశ్వం= ప్రపంచాన్ని; ఆచ్ఛిద్య= ఆకర్షించి (తొలగించి, అపహరించి); ఆశు= శీఘ్రంగా; అశ్నువానాః= వ్యాపించునటువంటి; ఉచ్ఛ్రాయ= ఔన్నత్యంయొక్క (అనగా ఎత్తుపెరగడం), హేలా= విలాసంచేత; ఉపహసిత= ఎగతాళి చేయబడిన; హరయః= విష్ణుమూర్తికల (అంటే పైకి ఎదిగిపోయి విష్ణువును మించిపోయినవని అర్థం); హారిదశ్వాః= పచ్చని గుఱ్ఱాలుగల ఆ సూర్యభగవానుని కిరణాలు; వః= మీయొక్క; కృచ్ఛ్రాణి= దుఃఖాలను; హరంతు= తొలగించుగాక!

**తా :** విష్ణుమూర్తిలాంటి సూర్యకిరణాలు బలిచక్రవర్తి అనే చీకటిని అణచడానికి మొదట వామనావతారాన్ని తాల్చి తర్వాత ఆకాశమంతా వ్యాపించి ప్రపంచాన్ని ఆవరించాయి. ఈ విషయంలో సూర్యకిరణాలు విష్ణుమూర్తికంటె కూడ ఎంతో ఎత్తుకు ఎదగడంవల్ల విష్ణువు అపహాస్యం పాలయ్యాడు. అటువంటి సూర్యకిరణాలు మీ దుఃఖాలను పోగొట్టుగాక!

**విశే :** ఈ శ్లోకంలో సూర్యకిరణాలు విష్ణువుగాను, చీకటి బలిచక్రవర్తిగాను పోల్చబడ్డాయి. భాగవతంలోని వామనావతారఘట్టం తెలిసినవారికి ఈ పోలిక చమత్కారాన్నిస్తుంది.

స్ర. **ఉద్గాఢేనారుణిమ్నా విదధతి బహుళం యేఽరుణస్యారుణత్వం**
**మూర్ధోద్ధూతే ఖలీనక్షతరుధిరరుచో యే రథాశ్వాననేషు,**



**శైలానాం శేఖరత్వం శ్రితశిఖరిశిఖా స్తన్వతే యేదిశంతు**
**ప్రేంఖన్తఃఖే ఖరాంశోః ఖచితదినముఖాస్తేమయూఖాస్సుఖం వః ॥ 8**

**ప్రతి :** ఉద్గాఢేన= ప్రబలమైన; అరుణిమ్నా= ఎఱ్ఱదనంచేత; యే= ఏ కిరణాలయితే; అరుణస్య= సారథియైన అనూరునికి[1]; బహుళం= మిక్కిలి; అరుణత్వం= ఎఱ్ఱదనాన్ని; విదధతి= కలిగిస్తున్నాయో; యే= ఏవైతే; మూర్ధ+ ఉద్ధూతౌ= ముఖాలు పైకి ఎత్తడంవల్ల; రథ+అశ్వ+ఆననేషు= రథానికి పూన్చిన గుఱ్ఱాల ముఖములందలి; ఖలీన.... రుచః ఖలీన= కళ్ళెములచేత ఏర్పడ్డ; క్షత= గాయాలనుంచి కారుతున్న; రుధిరరుచః= రక్త (ఎరుపు) వర్ణం కల్గివున్నాయో; యే= ఏవైతే; శ్రితశిఖరిశిఖాః= ఆశ్రయింపబడ్డ పర్వతాగ్రభాగం కలిగి; శైలానాం= పర్వతాలయొక్క; శేఖరత్వం= కిరీటత్వాన్ని; (అగ్రభాగాన వుండడం); తన్వతే= విస్తరింపచేస్తున్నాయో; ఖే= ఆకాశంలో; ప్రేంఖన్తః= ప్రయాణిస్తున్న (సాగిపోతున్న); ఖచితదినముఖాః= స్పష్టం చేయబడ్డ పగటిని సూచించునట్టి (దినప్రారంభాన్ని తెలుపునట్టి); ఖరాంశోః= వాడియైన కిరణాలుగల ఆ సూర్యునియొక్క; తే= పైన చెప్పబడ్డ; మయూఖాః= కిరణాలు; వః= మీకు; సుఖం= క్షేమాన్ని; దిశంతు= ఇచ్చుగాక!

**తా :** ఏ సూర్యకిరణాలయితే తమ ఎఱ్ఱదనంచేత రథసారథి అయిన (అనూరునికి) అరుణునికి మరింత అరుణత్వాన్ని (ఎఱ్ఱదనం) కలుగజేస్తూ, పగ్గాలు లాగడంవల్ల గుఱ్ఱాల నోటియందలి కళ్ళెములు కదిలి కారుతున్న రక్తంతో పర్వతాగ్రభాగాన్ని అధిగమించి ఆకాశంలో సాగిపోతూ స్పష్టమైన పగటిని తెలియజేస్తున్నాయో ఆ సూర్యకిరణాలు మీకు సుఖాన్నిచ్చుగాక!

**వివ :** 1. సూర్యశతకంలో 50–61 శ్లోకాల్లో సూర్యసారథి అయిన అనూరుడి వర్ణన చేయబడింది. పురాణగాథల్నిబట్టి అనూరుడు వినత కుమారుడు. గరుత్మంతుడికి అన్న. వినతకు ఇద్దరు మాత్రమే సంతానం కల్గుతుందని వరం. సమయం ఆసన్నమయ్యాక వినత రెండు అండాలకు జన్మనిచ్చింది.

ఐదు సంవత్సరాలైనా వాటినుంచి ఏ బిడ్డాబయటికి రాలేదు. వినత నిరాశకు గురై ఒక అండాన్ని పగలగొట్టింది. అందులోనుంచి అరుణుడు పుట్టుకొచ్చాడు. అయితే అకాలజననంవల్ల అరుణుడికి శరీరంలో క్రిందిభాగం ఏర్పడలేదు. అందుకే అరుణుడు అనూరుడు (తొడలు లేనివాడు) అని పిలువబడ్డాడు అని భారతగాథ.

మరొక పౌరాణిక గాథనుబట్టి అనూరుడు సూర్యసారథి ఎలా అయ్యాడో తెలుస్తుంది. దీనిప్రకారం రాహువు ఒకసారి సూర్యుణ్ణి మ్రింగినప్పుడు అతనికి సాయంగా ఎవరూ ముందుకురాలేదు. కోపంతో సూర్యుడు ముల్లోకాలను భస్మం చేయాలనుకున్నాడు. ఈ అకాలప్రళయానికి భయపడిన దేవతలు అరుణుణ్ణి సూర్యునికి సారథిగా పంపారు. రథంలో ముందుభాగాన కూర్చోవడంవల్ల సూర్యుడికాంతి కొంత తగ్గింది. అప్పటి నుంచి అరుణుడు రథసారథి అయ్యాడు. ఇతని భార్య శ్యేని. సంపాతి, జటాయువులు ఇతని బిడ్డలు.

స్ర. **దత్తానందాః ప్రజానాం సముచితసమయాకృష్టసృష్టైః పయోభిః**
**పూర్వాహ్ణే విప్రకీర్ణా దిశిదిశి విరమత్యహ్ని సంహారభాజః,**
**దీప్తాంశో ర్దీర్ఘదుఃఖప్రభవభవభయోదన్వదుత్తారనావో**
**గావో వః పావనానాం పరమపరిమితాం ప్రీతిముత్పాదయంతు॥ 9**

**ప్రతి :** సముచిత... పయోభిః సముచిత= యోగ్యమైన; సమయ= గ్రీష్మాదికాలంలో; ఆకృష్ట= ఆకర్షింపబడి; సృష్టైః= విడుదలగల; పయోభిః= నీటిచేత (పాలచేత); ప్రజానాం= జనులకు; దత్త+ఆనందాః= సంతోషాన్నిచ్చినవై; పూర్వాహ్ణే= ఉదయంపూట; దిశదిశి= అన్నిదిక్కులలో; విప్రకీర్ణాః= చెదిరినవై (మేతకువెళ్ళినవై); అహ్నివిరమతిసతి= సాయంకాలం అవుతుండగా; సంహారభాజః= ముగింపు కలిగినవై (అస్తమయ కాలానికి ఇంటికి చేరినవై); దీర్ఘ... నావో దీర్ఘ= గొప్పవైన; దుఃఖ= కష్టములకు; ప్రభవ= పుట్టుకయయిన; భవ= సంసారం వలని; భయ= భయమనెడు;



ఉదన్వత్= సముద్రంనుంచి; ఉత్తార= దాటించెడి; నావ= పడవలైన; దీప్తాంశోః= సూర్యునియొక్క; గావః= కిరణాలు (ఆవులు); పావనానాం= పవిత్రులైన; వః= మీకు; పరం= ఉత్కృష్టమైన (గొప్ప); అపరిమితాం= హద్దులేని; ప్రీతిం= సుఖాన్ని; ఉత్పాదయంతు= కలిగించుగాక!

**తా :** సూర్యకిరణాలు గోవులవంటివి. ఆవులు అవసరకాలంలో పాలిస్తాయి. కిరణాలు వర్షానిస్తాయి. ఆవులు ఉదయాన్నే మేతకు వెళ్ళి సాయంత్రం ఇంటికి వస్తాయి. కిరణాలు ఉదయాన దశదిశలా వ్యాపించి సాయంత్రం అస్తమిస్తాయి. ఆవుపాలను విప్రులు అగ్న్యాది దేవతలకు తర్పణం ఇచ్చి పుణ్యలోకాలకు వెళ్తారు. కిరణాల కాంతివల్ల ప్రజలు ఆయా దేవతలకు పుణ్యకర్మలాచరించి భవబంధాల నుంచి విముక్తులౌతారు. అటువంటి సూర్యకిరణాలు మీకు సుఖాన్నిచ్చుగాక!

**అలం :** శ్లేష. (గోవులు. పయస్సు, విప్రకీర్ణత మొ॥ శబ్దాలు శబ్దశ్లేషను సూచిస్తాయి).

**విశే :** ఈ శ్లోకంలో ఆవులకు సూర్యకిరణాలకు శబ్దశక్తి మూలశ్లేష చెప్పబడింది. మయూరుడు తన గ్రంథంలో శ్లేషను చాలసార్లు ప్రయోగించాడు. శ్లేషతోకూడిన పదవిన్యాసంలో ఇతడు దిట్ట. ఇందులో గోవు మొదలైన శబ్దాల్ని తీసి మరొక శబ్దాల్ని ప్రయోగిస్తే ఇంత చమత్కారం రాదు. అందుకే ఇక్కడ శబ్దశక్తి మూలసంలక్ష్యక్రమ వ్యంగ్యధ్వని ఉన్నదనవచ్చు. ధ్వన్యాలోకకర్త ఈ శ్లోకాన్ని ద్వితీయోద్యోతంలో ఉదాహరించాడు. (పుట 167, 1964 చౌఖంబా)

సూర్యకిరణాలవల్ల వర్షం కురుస్తుందని భారతీయ విశ్వాసం. సూర్యకిరణాలు గ్రీష్మంలో సముద్రజలాన్ని త్రాగి వర్షాకాలంలో వర్షిస్తాయి.

**"అగ్నౌ ప్రాప్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే ।**
**ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః ॥" (శ్రుతివాక్యం)**

రఘువంశంలోకూడ ప్రథమసర్గలో (1-18) "సహస్రగుణ ముత్స్రష్టు మాదత్తే హి రసం రవిః" అని సూర్యునికి వర్ష ప్రదానశక్తి వున్నట్లు సూచింపబడింది. సూర్యశతకంలో ఇటువంటి అభిప్రాయం 30, 77, 93 శ్లోకాల్లోకూడా చెప్పబడింది.

**స్ర. బంధధ్వంసైకహేతుం శిరసి నతిరసాబద్ధసంధ్యాంజలీనాం**
**లోకానాం యే ప్రబోధం విదధతి విపులాంభోజషండాశయేవ,**
**తే యుష్మాకం స్వచిత్తప్రథితపృథుతరప్రార్థనా కల్పవృక్షాః**
**కల్పంతాం నిర్వికల్పం దినకరకిరణాః కేతవః కల్మషస్య ॥ 10**

**ప్రతి :** యే= ఏవైతే; శిరసి= తలమీద; నతి... నాం; నతి= నమస్కారమనెడి; రసా= జలంచేత; ఆబద్ధ= విరచింపబడిన; సంధ్యాంజలీనాం= సంధ్యాకాలపు అర్ఘ్యప్రదానాలుగల; లోకానాం= జనులకు; విపుల= విస్తారమైన; అంభోజషండాశయా ఇవ= కమలముల సమూహ వికాసం వలె; బంధ= సంసారబంధాన్ని; ధ్వంస= నశింపజేయడంలో; ఏకహేతుం= ప్రధాన కారణమైన; ప్రబోధం= జ్ఞానాన్ని; విదధతి= కలిగిస్తున్నాయో; స్వచిత్త... వృక్షాః, స్వచిత్త= తమ మనసులలోని; ప్రథిత= గొప్పవైన; పృథుతర= విశాలమైన; ప్రార్థనా= ప్రార్థనల పాలిట; కల్పవృక్షాః= కల్పవృక్షాలయిన[1]; తే= అ; దినకరకిరణాః= సూర్యుని కిరణాలు; యుష్మాకం= మీయొక్క; కల్మషస్య= పాపాలకు (పాపసమూహానికి); కేతవః= ఉత్పాతాలను; నిర్వికల్పం= నిస్సంశయంగా; కల్పం తాం= కల్గించుగాక! (అనగా మీ పాపాలను పోగొట్టుగాక)

**తా :** భక్తితో శిరసుచేత అంజలి ఘటించు ప్రజల భవబంధాన్ని తొలగించడానికి ప్రధాన కారణమైనట్టి, ముకుళించిన కమలసమూహంవలె ప్రజల్ని కూడ చైతన్యవంతం చేస్తున్నటువంటి (ప్రబోధితం) కల్పవృక్షంలాంటి ఆ సూర్యకిరణాలు ఎల్లప్పుడూ మీ పాపాలను తొలగించుగాక! (పాపాలపాలిటి ధూమకేతువులగుగాక)



**అలం :** శ్లేష.

**వివ :** 1. కల్పవృక్షం స్వర్గలోకంలో నందనవనంలో వున్న ఐదు ప్రధాన వృక్షాలలో ఒకటి. కల్పయతి వాంఛితమితికల్పః సచాసౌవృక్షశ్చ కల్పవృక్షః అని వ్యుత్పత్తి. మనం అనుకున్న ఫలాన్ని ప్రసాదిస్తుంది కాబట్టి దీన్ని కల్పవృక్షం అన్నారు.

"పంచైతే దేవతరవో మందారః పారిజాతకః ।
సంతానః కల్పవృక్షశ్చ పుంసి వా హరిచందనం ॥ (అమరం 1-50)

**స్ర. ధారా రాయోధనాయాపది సపది కరాలంబభూతాః ప్రపాతే**
**తత్త్వాలోకైకదీపా స్త్రిదివపతిపురప్రస్థితౌ వీథ్య ఏవ,**
**నిర్వాణోద్యోగియోగిప్రగమ నిజతనుద్వారి వేత్రాయమాణా**
**స్త్రాయం తాం తీవ్రభానోర్దివసముఖసుఖా రశ్మయఃకల్మషాద్వః 11**

**ప్రతి :** ధనాయ= ధనంకోసం; ఆపది= ఆపద కలిగినప్పుడు (ధనాశకల వారికి); రాయో= ధనముయొక్క; ధారాః= ధారలు (ధనాన్ని కురిపించేవి); ప్రపాతే= నరకంలో పడినవారికి; సపది= వెంటనే; కరాలంబభూతాః= చేయూతనిచ్చేవి; తత్త్వాలోక= సత్యప్రకాశమున; ఏకదీపాః= ప్రధానంగా వెలుగుచూపేవి; త్రిదివపతిపుర= స్వర్గంయొక్క; ప్రస్థితౌ= ప్రయాణానికి; వీథ్యః ఏవ= ప్రధాన మార్గాలు (అనగా స్వర్గానికి వెళ్ళేవారు సూర్యమండలం ఛేదించుకొని వెళ్తారని కవిలోక ప్రసిద్ధి)[1] నిర్వాణ... మాణాః : నిర్వాణ= మోక్షమునందు; ఉద్యోగ= ఉత్సాహంగల; యోగి= యోగులయొక్క; ప్రగమ= మార్గానికి; నిజ= స్వకీయమైన (తనదైన); తను= శరీరమనెడి; ద్వారి= ద్వారమున ప్రవేశపెట్టబడిన; వేత్రాయమాణాః= బెత్తములు ధరించినట్టివి; అయిన (అనగా మోక్షకాములగు యోగులకు సూర్యకిరణాలు తమ శరీరద్వారమందు ప్రవేశమిచ్చి ముక్తి కలుగజేస్తాయని భావం); దివసముఖ సుఖాః= దిన ప్రారంభకాలంలో సుఖాన్నిచ్చేటటువంటి; తీవ్రభానోః= తీక్ష్ణ

కిరణుడయిన సూర్యునియొక్క; రశ్మయః= కిరణాలు (కాంతులు); వః= మిమ్మల్ని; కల్మషాత్= పాపంనుంచి; త్రాయంతాం= కాపాడుగాక!

**తా :** దినప్రారంభమున సుఖదాయకాలైన సూర్యకిరణాలు ధనాశ కలవారికి ధనాన్నిస్తాయి. నరకలోకానికి పోయిన వాళ్ళకు చేయూతనిస్తాయి. యథార్థజ్ఞానాన్ని కలుగజేస్తాయి. పరమార్థ దర్శనానికి ప్రధాన దీపాలై స్వర్గానికి దారి చూపుతాయి. మోక్షకాములగు యోగులకు ప్రధాన ద్వారములై మోక్షమార్గాన్ని చూపిస్తాయి. ఇలాంటి భానుకాంతులు మిమ్మల్ని పాపాలనుంచి కాపాడుగాక!

**వివ :** 1. 1) కలనం దావకఘుగ్గఖండిత రిపుక్ష్మాభర్త మార్తాండమండల భేదంబొనరించి యేగునెడ తన్మధ్యంబునన్హారకుండలకేయూర … … … (కృష్ణదేవరాయలగూర్చి ఒక ప్రసిద్ధ కవి చెప్పిన పద్యం)

2) నీదురవగాహ సౌర్యము
భేదింపంగలేక విమతపృథివీశుఁడనిన్
భేదించు నృసింహ భవ
న్మేదురభయదప్రతాప మిత్రుని మిత్రున్. (నరస. 5-209)

శ్లో. **ప్రాచిప్రాగచరంత్యో౽నతిచిరమచలే చారుచూడామణిత్వం**
**ముంచంత్యో రోచనాంబుప్రచుర మివ దిశాముచ్చకైశ్చర్చనాయ,**
**చాటూత్కై శ్చక్రనామ్నాం చతుర మవిచలై ర్లోచనై రర్చ్యమానా**
**శ్చేష్టంతాం చింతితానా ముచిత మచరమా శ్చండరోచీరుచో వః॥ 12**

**ప్రతి :** ప్రాక్= ప్రథమంగా; అనతిచిరం= స్వల్పకాలం; ప్రాచిఅచలే= తూర్పు పర్వతమందు; చారుచూడామణిత్వం= మనోహరమైన తలమానికతను; ఆచరంత్యః= తాల్చుచూ; దిశాం= దిక్కాంతలకు; ఉచ్చకైః= మిక్కిలి (చక్కని); చర్చనాయ= మైపూతకోసం; రోచనాంబు= గోరోచనజలాన్ని; ప్రచురం= అధికంగా; ముంచత్య ఇవ= ఇచ్చుచున్న వానివలెవున్న (వదులుతున్న



వానివలె); చాటూత్కైః= మిక్కిలి ప్రియమైన కాంక్షగల; చక్రనామ్నాం= చక్రవాక పక్షులయొక్క; అవిచలైః= నిశ్చలములైన; లోచనైఃనేత్రాంచలముల చేత; చతురం= నేర్పుగా (ప్రీతితో); అర్చ్యమానా= పూజింపబడుతున్నట్టు; అచరమా= అప్పుడే ఉదయిస్తున్న (అప్రాచీనములైన); చండరోచీ= తీక్ష్ణకిరణుడైన సూర్యునియొక్క; రుచః= కిరణాలు; వః= మీయొక్క; చింతితానాం= కోర్కెలకు; ఉచితం= అనుకూల్యాన్ని; చేష్టంతాం= కలిగించుగాక! (అనగా మీ కోర్కెలు తీర్చుగాక!)

**తా :** క్షణకాలం ఉదయాద్రికి మకుటాయమానంగా (చూడామణి) భాసించి, తర్వాత దిక్కాంతలకు గోరోచనజలాన్నందించి, చక్రవాకపక్షులచేత నిరీక్షింపబడుతూ (సూర్యోదయంతో చక్రవాకాలకు విరహం పోతుంది) పూజింపబడుతున్న సూర్యకిరణాలు మీ కోర్కెలు తీర్చుగాక!

**విశే :** ఇందులో సూర్యకిరణాలకు ముందు అతిలోహితత్వం (ఎఱ్ఱదనం) అనంతరం పిశంగ (పింగళ) వర్ణం చెప్పబడింది.

**అలం :** అనుప్రాసం (చకారావృత్తి)

శ్లో. **ఏకంజ్యోతి ర్దృశౌద్వే త్రిజగతి గదితాన్యబ్జజాస్యై శ్చతుర్భి**
**ర్భూతానాం పంచమం యా న్యల మృతుషు తథా షట్సు నానావిధాని,**
**యుష్మాకం తాని సప్తత్రిదశమునినుతా న్యష్టదిగ్భాంజిభానో**
**ర్యాంతి ప్రాహ్ణే నవత్వం దశదదతు శివం దీధితీనాం శతాని॥ 13**

**ప్రతి :** యాని= ఏవైతే; జ్యోతిః= తేజస్సు; ఏకం= ఒకటిగా వుండి; దృశే= కన్నులు; ద్వే= రెండుకల్గి (కళ్ళకు చూపునిచ్చి); త్రిజగతి= ముల్లోకాల్లో; చతుర్భిః= నాలుగైన; అబ్జజాస్యైః= కమలజుడైన బ్రహ్మయొక్క ముఖాలచేత; గదితాని= చెప్పబడినవై; భూతానాం= పృథివ్యాది పంచభూతాలలో; పంచమం= ఐదవదిగా (తేజస్సు) వుండి; తథా= అదేవిధంగా; షట్సు= ఆరైన; ఋతుషు= ఋతువుల్లో; అలం= మిక్కిలిగా; నానావిధాని= తీవ్ర

మందాది భేదాలతో అనేక విధాలుగా వున్నాయో (ఆయా ఋతువుల్లో సూర్యుడు అనేక విధాలుగా అంటే హెచ్చుతగ్గులతో వుంటాడని భావం) సప్త త్రిదశ ముని= ఏడుగురు దేవర్షులచేత; నుతాని= కొనియాడబడినదై; అష్టదిగ్భాంజి= అష్టదిక్కులలో వ్యాపించినవో; ప్రాహ్ణే= ఉదయకాలమందు; నవత్వం= నూతనత్వాన్ని (నవసంఖ్యత శబ్దచమత్కారం); యాంతి= పొందుతున్నాయో; తాని= ఆ; భానోః= సూర్యునియొక్క; దీధితీనాం= కిరణాలయొక్క; దశశతాని= సహస్రకిరణాలు; యుష్మాకం= మీకు; శివం= శుభాన్ని; దదతు= చేకూర్చుగాక!

**తా :** ఒకటే తేజస్సుగా వుండి రెండు కన్నులకు చూపునిచ్చి, ముల్లోకాల్లోను చతుర్ముఖుని[1]చేత కొనియాడబడి పంచభూతాలనుంచి షడ్రుతువుల నేర్పరచి సప్తర్షుల[2]చేత కీర్తింపబడి అష్టదిక్కులయందు ప్రసరించి నవత్వాన్ని పొందిన ఆ సూర్యునియొక్క దశశత కిరణాలు మీకు శుభాన్ని కల్గించుగాక!

**విశే :** ఈ శ్లోకంలో మయూరుడు ఆశ్రయభేదాన్నిబట్టి సూర్యునికి బహురూపత్వం ఏర్పడుతుందని సూచించాడు. ప్రధానంగా ఆ సూర్యకిరణాలు ఒక జ్యోతిస్వరూపం. రెండు కళ్ళచేత చూడబడ్డంవల్ల ద్విరూపత్వం; త్రిలోక వ్యాపనంవల్ల త్రిత్వమూ, బ్రహ్మయొక్క నాల్గుముఖాలచేత కొనియాడబడడంవల్ల చతుస్సంఖ్యాత్వం, పృథివ్యాది పంచభూతాలవల్ల పంచమ సంఖ్యాత్వం, వసంతాది ఆరు ఋతువులు కారణంగా అష్టతా, ఉదయకాలంలో నవీనత కారణంగా నవత్వమూ (శాబ్దిక చమత్కారం) పొందడం సహజమే కదా!

**వివ :** 1. పౌరాణిక గాథనుబట్టి బ్రహ్మ శతరూపని ప్రేమించాడు. (ఈ శతరూప బ్రహ్మ మానసంనుంచి సగం పురుషరూపంతోను, సగం స్త్రీ రూపంతోను పుట్టిన శక్తి అని మత్స్యపురాణం) ఆ ప్రేమలో బ్రహ్మ ఆమెను స్పృహలేని విధంగా రెప్పవాల్చకుండా అలాగే చూశాడు. దాంతో 'శతరూప' గాబరా పడిపోయి ముఖాన్ని వెనక్కి తిప్పుకుంది. కాని దానివల్ల కూడ



లాభం లేకపోయింది. ఎందుకంటే శతరూప ఏ వైపుకు ముఖం తిప్పితే ఆ వైపు బ్రహ్మ మరో క్రొత్త ముఖంతో ఆమెను చూశాడు. ఈవిధంగా బ్రహ్మకు అయిదుముఖాలు ఏర్పడ్డాయి. అంతటితో శివుడికి కోపంవచ్చి భైరవుణ్ణి పంపి ఒక ముఖాన్ని నరికించాడు. అప్పటినుంచి బ్రహ్మ చతుర్ముఖుడయ్యాడు.

2. సప్తర్షుల పేర్ల విషయంలో వైమత్యం వుంది.

మహాభారతం ప్రకారం (12–335–29) మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు. "సప్తర్షయో మరీచ్య త్రిముఖాః" అని అమరం.

**"కశ్యపోఽత్రిర్భరద్వాజో విశ్వామిత్రశ్చ గౌతమః ।**
**జమదగ్ని ర్వసిష్ఠశ్చసప్తైతే ఋషయస్స్మృతాః ॥**

(శృం. నై. సర్వం. వ్యా. పుట 12)

స్ర. **ఆవృత్తిభ్రాంతవిశ్వాశ్రమమివ దధత శ్శోషిణః స్వోష్మణేవ**
**గ్రీష్మే దావాగ్నితప్తా ఇవ రస మసకృద్యే ధరిత్ర్యా ధయంతి,**
**తే ప్రావృష్యాత్తపానాతిశయరుజ ఇవోద్వాంతతోయా హిమర్తౌ**
**మార్తాండస్యాప్రచండా శ్చిరమశుభభిదేఽభీషవో వో భవంతు ॥ 14**

**ప్రతి :** ఆవృత్తిభ్రాంతవిశ్వాః= ప్రపంచమంతా ఎడతెరపిలేక తిరగడంవలన; శ్రమం= అలసటను; దధతఃఇవ= తాల్చినవానివలె; స్వ+ఊష్మణా= తనయొక్క ఉక్కచేత; శోషిణఃఇవ= శుష్కించిన వానివలె; గ్రీష్మే= ఎండకాలమందు; దావాగ్నితప్తాఃఇవ= దావాగ్ని చేత తపింపజేయబడినవై; యే= ఏ కిరణాలయితే; ధరిత్ర్యాః= భూమియొక్క; రసం= నీటిని; ఆధయంతి= త్రాగుతున్నాయో; అందువల్లనే; ప్రావృ...రుజః : ప్రావృషి= వర్షాకాలమందు; ఆత్త= పొందబడిన; పాన= త్రాగుటయొక్క; అతిశయ= ఆధిక్యంచేత ఏర్పడిన (అతిగా త్రాగడంవల్ల); రుజః= రోగాలు కలిగి; ఉద్వాన్త= విడువబడిన (వాంతి చేసుకోవడం); తోయా : ఇవ= నీరువలె (వర్షించడం);

అందువల్లనే; హిమ+ఋతౌ= చలికాలమందు (హేమంత, శిశిరాలు); అప్రచండాః= మాంద్యం వహించిన (చురుకుదనంలేని); మార్తాండస్య[1]= సూర్యునియొక్క; తే= ఆ; అభీశవః= కిరణాల; చిరం= శాశ్వతంగా; వః= మీయొక్క; అశుభభిదే= పాపపరిహారణార్థం; భవంతు= అగుగాక! (పాపాలను శాశ్వతంగా తొలగించుగాక).

**తా :** ఎండకాలంలో ఎడతెరపిలేని ప్రయాణంచేత అలసిపోయి ఉక్కబోసి దప్పికతో భూమ్మీద జలమంతా తాగి వర్షాకాలంలో వెడలకక్కి శీతాకాలంలో నీరసాన్ని పొందిన ఆ సూర్యకిరణాలు మీ అశుభాన్ని తొలగించుగాక!

**అలం :** ఉత్ప్రేక్ష (దావాగ్ని తప్తాఇవ) ఉపమా.

**విశే :** ఈ శ్లోకంలో మయూరుడు వేసవికాలం, వర్షాకాలం, చలికాలం అనే మూడింటిలో వరుసగా సూర్యకిరణాల కార్యక్రమం మరియు ప్రభావం (స్థితి) ఏమిటో చక్కగా చెప్పాడు. ఎండకాలం అలసటతో ఉక్కబోసి దప్పికగొన్న మానవుడు ఏవిధంగా అతిగా నీళ్ళు తాగి వర్షాకాలంలో అతిసారానికి గురై చలికాలంలో నీరసిస్తాడో అదే విధంగా సూర్యభగవానుడు కూడ అని చమత్కరించాడు కవి. గ్రీష్మంలో సూర్యప్రతాపం ఎక్కువై, సముద్రాల్లోని జలాన్ని ఆకర్షించి వర్షాకాలంలో వర్షరూపేణ త్యజించి శీతాకాలంలో మందత్వం కలిగి నీరసించిన మాదిరిగా వుండడం సహజమే కదా! ఈ విధంగా నిత్య జీవితంలో ఒక మానవుడి అవస్థతో సూర్యస్థితి వర్ణితం.

**వివ :** 1. సూర్యునికి మార్తాడుడనే పేరు ఎలా వచ్చిందో మార్కండేయ పురాణములో చెప్పబడింది (1058–20). సూర్యునియొక్క 'సుషుమ్నా' అనే కిరణం ఒకసారి అదితి గర్భంలో ప్రవేశించింది. దాంతో అదితి ఉపవాసం చేసింది. అప్పుడు కశ్యపుడు అదితితో "నీవు ఇలా ఆహారం తీసుకోకుండ కడుపులోని పిండానికి కష్టం కలిగించడం భావ్యమేనా?" అన్నాడు. ఆ తర్వాత అదితికి బిడ్డపుట్టగానే అశరీరవాణి ఆకాశవాణి ఇలా అంది "ఓ మహర్షీ! అదితి కడుపులోని పిండానికి ఆహారం ఇవ్వకుండ హింసించింది కాబట్టి ఈ బిడ్డకి మార్తాండుడన్న పేరు కల్గుతుంది" (మారితం అండమ్) ఇలా మార్తాండుడన్న పేరువచ్చింది సూర్యుడికి. "మృతండస్య అపత్యం మార్తాండః లేక మృతం బ్రహ్మాండం జీవయతీతి మార్తాండః" అని గురుబాల ప్రబోధినీకార వచనం.



ప్ర. **తన్వానా దిగ్వధూనాం సమధికమధురాలోకరమ్యా మవస్థా**
**మారూఢ ప్రౌఢిలేశోత్కలిత కపిలిమాలంకృతిః కేవలైవ,**
**ఉజ్జృంభాంభోజనేత్రద్యుతిని దినముఖే కించి దుద్భిద్యమానా**
**శ్మశ్రుశ్రేణీవ భాసాం దిశతు దశశతీ శర్మఘర్మత్విషోవః ॥ 15**

**ప్రతి :** దిగ్వధూనాం= దిక్కులనెడి కాంతలకు; సమధిక... అవస్థాం : సమధిక= మిక్కిలి; మధుర= సుందరమైన; ఆలోక= ప్రకాశంచేత; రమ్యాం= మనోహరమైన; అవస్థాం= స్థితిని; తన్వానా= కలుగజేయు నట్టిది; ఆరూఢ... కపిలిమా : ఆరూఢ= ఎక్కువైన; ప్రౌఢిలేశ= అల్పాధిక్యంచేత (కొద్దిగా ఎక్కువగా ఎఱ్ఱబడడం); ఉత్కలిత= పెంచబడిన; కపిలిమా= కపిలవర్ణత్వం; కేవలైన= ప్రధానమైన; అలంకృతిః= అలంకారమైనట్టిది (కపిలవర్ణం దిక్కులకు అలంకారప్రాయం); ఉజ్జృంభ... ద్యుతిని : ఉజ్జృంభ= వికసించిన; అంభోజ= కమలములనెడి; నేత్ర= కన్నులయొక్క; ద్యుతిని= కాంతిగల; దినముఖే= ప్రాతః కాలమందు (పగటి ముఖంమీద); కించిత్= కొద్దిగా; ఉద్భిద్యమానా= ఉద్భేదన మందుచున్న (వెలుపలికి ఛేదించుకొని వస్తున్న); శ్మశ్రుశ్రేణీ ఇవ= మీసాల వరుసవలెవున్న; ఘర్మత్విషః= చండభానునియొక్క; భాసాం= కాంతుల; దశశతీ= సహస్రము; వః= మీకు; శర్మ= సుఖాన్ని; దిశతు= ఇచ్చుగాక!

**తా :** దిక్కులనే కాంతలకు మరింత మృదుప్రకాశత కలుగజేసి తర్వాత పింగళ వర్ణత్వమనే అలంకారాన్నిచ్చి, వికసిత కమలములనెడి

నేత్రాలకాంతులు కల్గి పగలు అనెడి ముఖానికి నూనూగు మీసాల పంక్తిని ఏర్పరస్తున్న ఆ సూర్యకిరణాలు మీకు సుఖాన్నిచ్చుగాక!

**అలం :** శ్లేష.

**విశే :** ఇందులో సూర్యకిరణాలు మీసాలవంటివన్న ఉపమా పోషణార్థమే 'దినముఖ' లాంటి శబ్దాలు ప్రయుక్తాలు. ఏవిధంగా ఆనందం కలిగినప్పుడు మీసాలు (రోమరాజి) ఉద్భిన్నాలవుతాయో (నిక్కపొడుచుకోవడం) అదేవిధంగా సూర్యకిరణాలు పగటిముఖంలో (దినారంభంలో) ఉద్భిన్నాలవుతున్నాయని కవి భావన.

శ్లో. **మౌళీందోర్మైష మోషీ ద్యుతిమితి వృషభాంకేన యశ్శంకినేవ**
**ప్రత్యగ్రోద్ఘాటితాంభోరుహకుహర గుహాసుస్థితేనేవ ధాత్రా,**
**కృష్ణేన ధ్వాంతకృష్ణ స్వతనుపరిభవత్రస్నునేవ స్తుతోఽలం**
**త్రాణాయ స్తాత్తనీయా నపి తిమిరరిపో స్త్విషాముద్గమో వః 16**

**ప్రతి :** మౌళి+ఇందోః= శిరసునందలి చంద్రునియొక్క; ఏషద్యుతిం= ఈ కాంతిని; మా మోషీత్= హరింపకుండుగాక అని; శంకినా ఇవ= సందేహించిన వానివలె; వృషభాంకేన= ఎద్దు చిహ్నముగా కల్గిన శివుని చేతను; ప్రత్యగ్ర... స్థితేనేవ : ప్రత్యగ్ర= నూతనములైన కిరణాలచేత (నూతనంగా); ఉద్ఘాటిత= వికసితములయిన; అంభోరుహ= కమలాలయొక్క; కుహరగుహా= గర్భప్రదేశములందు; సుస్థితేనఇవ= సుఖాసీనుడైన వానివలెవున్న; ధాత్రా= బ్రహ్మచేతను; ధ్వాంత... త్రస్ను నేవ : ధ్వాంతకృష్ణ= చీకటివలె నల్లనైన; స్వతను= తన శరీరానికి; పరిభవ= అవమానం కల్గుతుందని; త్రస్నునాఇవ= భయపడినవానివలెవున్న; కృష్ణేన= శ్రీకృష్ణునిచేతనూ; యః= ఏదైతే; స్తుతః= కొనియాడబడినదో; సః= అటువంటి; తిమిరరిపోః= అంధకారానికి శత్రువైన సూర్యునియొక్క; త్విషాం= కాంతుల యొక్క; ఉద్గమః= పుట్టుక; తనీయానపి= అల్పమైనదే (లేతది) అయినా; వః= మీయొక్క; త్రాణాయ= రక్షణకొరకు; స్తాత్= అగుగాక!



**తా :** ఉదయిస్తే తన శిరసుమీదవున్న చంద్రుని కాంతి తగ్గుతుందేమో అన్న భయంవల్ల శివునిచేతనూ, (సూర్యోదయంతో చంద్రుడు వెలవెలబోతాడు) ఉదయించకపోతే ముకుళితములైన కమలాల్లోవున్న తనకు కష్టం కల్గుతుందన్న భయంగల బ్రహ్మచేతనూ, చీకటిని పారద్రోలే స్వభావంచేత తన శరీరాన్ని చీకటి అనుకొని వెంబడిస్తాడేమో అన్న భయంగల శ్రీకృష్ణునిచేతనూ ఈ విధంగా ప్రార్థింపబడుతున్న సూర్యుడు మీ పాపాలను తొలగించుగాక!

**విశే :** త్రిమూర్తులచేత సూర్యుడు ప్రార్థింపబడ్డం ఆతని ఆధిక్యాన్ని సూచిస్తుంది, త్రిమూర్తులకంటే సూర్యుడే గొప్పవాడన్న భావాన్ని మయూరుడు 88, 91, 92, 93 శ్లోకాల్లోకూడ వ్యక్తం చేశాడు.

**అలం :** ఉత్ప్రేక్ష.

శ్లో. **విస్తీర్ణం వ్యోమ దీర్ఘాస్సపది దశదిశో వ్యస్త వేలాంభసోఽబ్ధీ**
**న్కుర్వద్భిర్దృశ్యనానానగనగరనగాభోగపృథ్వీం చ పృథ్వీం,**
**పద్మిన్యుచ్ఛ్వాస్యతే యై రుషసి జగదపి ధ్వంసయిత్వా తమిస్రా**
**ముస్రావిస్రావయంతు ద్రుతమనభిమతం తే సహస్రత్విషోనః ॥ 17**

**ప్రతి :** వ్యోమ= ఆకాశాన్ని; విస్తీర్ణం= విపులమైన దానిగను; సపది= ఆ వెంటనే; దశదిశః= పది దిక్కులను; దీర్ఘాః= విశాలముగను; అబ్ధీన్= సముద్రాలను; వ్యస్త= విక్షిప్తాలయిన (విడువబడిన); వేల= చెలియలి కట్టలుగల; అంభసః= నీరుకలవిగాను; పృథ్వీం= భూమిని; దృశ్య... పృథ్వీం: దృశ్య= చూడదగిన; నానా= అనేకవిధాలయిన; నగ= చెట్లు; నగర= పట్టణాలు; నగ= పర్వతాల యొక్క; ఆభోగ= విస్తారముచేత; పృథ్వీం= విశాలమైనదిగాను; కుర్వద్భిః= చేయుచున్న; యైః= వేటిచేత; ఉషసి= ప్రాతః కాలమందు; తమిస్రాం= చీకటి(ని); ధ్వంసయిత్వా= నశింపజేసి (కాబడి); పద్మినీ= కమలము; జగదపి= లోకమున్నూ; ఉచ్ఛ్వాస్యతే= మేలుకొనబడు

చేయుచున్నదో; తే= అటువంటి; సహస్రత్విషః= వేయి కిరణాలుగల సూర్యునియొక్క; ఉస్రాః= కిరణాలు; నః= మీయొక్క; అనభిమతం= అయిష్టతను (అశుభం); ద్రుతం= శీఘ్రంగా; విస్రావయంతు= పారద్రోలుగాక!

**తా :** ఏ సూర్యోదయం ఆకాశమూ, దిక్కులూ, సముద్రాలు, చెట్లు, కొండలు, పట్టణాలచేత విశాలమైన భూమిని చూపిస్తూ, చీకటిని పారద్రోలి లోకానికి, కమలవనానికి మేలుకొలుపు పాడుతున్నదో అటువంటి భానూదయం మీ అయిష్టతను తొలగించుగాక!

**స్ర. అస్తవ్యస్తత్వశూన్యో నిజరుచిరనిశానశ్వరః కర్తుమీశో**
**విశ్వం వేశ్మేవ దీపః ప్రతిహతతిమిరం యః ప్రదేశస్థితో౽పి,**
**దిక్కాలాపేక్షయాశౌ త్రిభువనమటతస్తిగ్మభానో ర్నవాఖ్యాం**
**యాతశ్శాతక్రతవ్యాం దిశి దిశతు శివం సో౽ర్చిషాముద్గమోవః. 18**

**ప్రతి :** యఃదీపః= ఏ దీపమైతే; అస్తవ్యస్తత్వశూన్యః= అస్తవ్యస్త పరిస్థితుల్లేని (స్థిరత్వంగల); నిజరుచిః= తనదైన కాంతి గల్గియున్నదో; అనిశా+అనశ్వరః= పగటియందు నాశములేనిదో; ప్రదేశస్థితో౽పి= ఒకే ప్రదేశం వుండిగూడ; వేశ్మఇవ= గృహంవలె; విశ్వం= లోకమంతటినీ; ప్రతిహత తిమిరం= తొలగింపబడిన చీకటిగల దాన్నిగా; కర్తుం= చేయుటకు; ఈశః= సమర్థత కల్గియున్నదో; దిక్కాల...అటత : దిక్= దిక్కులయొక్క; కాల= సమయం యొక్క; అపేక్షయా= కోరికచేత; అసౌ= ఈ; త్రిభువనం= ముల్లోకాలను; అటతః= చరిస్తూ (తిరుగుతూ); శాతక్రతవ్యాం దిశి= నూరు యాగాలుచేసిన ఇంద్రుని దిక్కు అయిన తూర్పున; నవాఖ్యాం= నూతనత్వాన్ని; యాతః= పొందినట్టి (అప్పుడే ఉదయించిన); సః= అటువంటి (ఆ); తిగ్మభానోః= తీక్ష్ణకిరణుడైన సూర్యునియొక్క; అర్చిషాం= కాంతుల; ఉద్గమః= పుట్టుక (రాక) అనే దీపం; వః= మీకు; శుభం= మంచిని; దిశతు= కలుగజేయుగాక! (ఇచ్చుగాక).



**తా :** ఇక్కడ లోకంలోని మామూలు దీపంకంటె సూర్యుడనే దీపానికి విశిష్టత చెప్పబడింది. సామాన్యమైన దీపం గాలికి కొట్టుకుంటూ అస్తవ్యస్తమౌతుంది. సూర్యదీపం అలాకాదు. సాధారణ దీపం తైలమిచ్చిన కాంతిగలిగి, పగటివేళ కాంతి హీనమౌతుంది. సూర్యుడలాకాదు. మామూలు దీపం గృహానికి మాత్రమే పరిమితం. సూర్యదీపం లోకానికంతా వెలుగునిస్తుంది. త్రిభువన సంచారేచ్ఛ, దిక్కుల అపేక్షచేత ఈ విధంగా తూర్పుదిక్కున ఉదయించి నూతనత్వాన్ని పొందిన భానూదయం మీకు శుభాన్ని ప్రసాదించుగాక!

**అలం :** శ్లేష... వ్యతిరేకం.

**స్ర. మాగా న్మ్లానిం మృణాళీమృదురితి దయయేవాప్రవిష్టో౽హి లోకం**
**లోకాలోకస్యపార్శ్వం ప్రతపతి న పరం యస్తదాఖ్యార్థమేవ,**
**ఊర్ధ్వం బ్రహ్మాండఖండస్ఫుటనభయపరిత్యక్తదైర్ఘ్యోద్యుసీమ్ని**
**స్వేచ్ఛాపశ్యావకాశావధి రవతు స వ స్తాపనో రోచిరోఘః ॥ 19**

**ప్రతి :** యః= ఏ సూర్యోదయమైతే; మృణాళీ= తామరతూడులవలె; మృదుః= కోమలమైన (సర్పకోటి= పాములగుంపు); మ్లానిం= వాడిపోవుటను; మాగాత్= పొందకుండుగాక; ఇతి= అని; దయయాఇవ= కరుణచేతవలె; అహిలోకం= పాతాళలోకాన్ని; అప్రవిష్టః= ప్రవేశించలేదో; లోకాలోకస్య= లోకాలోకంయొక్క[1]; తత్+అఖ్యార్థమేవ= ఆ పేరు నిలుపుటకోసమే (ఇది లోకం, ఇది అలోకం అన్న వ్యవహారంకోసమే); పరం= ఇతరమైన; పార్శ్వం= ప్రక్కలను; నప్రతపతి= ప్రకాశింపజేయదో; ఊర్ధ్వం= పైనవున్న; బ్రహ్మాండ... దైర్ఘ్యః : బ్రహ్మాండ= బ్రహ్మాండ కర్పరంయొక్క[2]; ఖండ= భాగంయొక్క; స్ఫుటన= పగులుటయందలి; భయ= భయంచేత; పరిత్యక్త= విడువబడిన; దైర్ఘ్యః= కిరణ వ్యాపిత్వం కలిగివున్నదో (బాగా పైకి వ్యాపిస్తే బ్రహ్మాండం పగిలిపోతుంది అన్న భయం); ద్యుసీమ్ని= స్వర్గలోకమందు; స్వేచ్ఛావశ్య= తన ఆధీనమందున స్వేచ్ఛతోగూడిన; అవకాశః= ఆకాశం; అవధిః= హద్దుగా కలిగిన

(ఆకాశమందలి స్వేచ్ఛచేత స్థాన మర్యాద జ్ఞానంగల); సః= ఆ; తాపనః= సూర్యునియొక్క; రోచిరోఘః= కాంతిపుంజం; వః= మిమ్మల్ని; అవతు= కాపాడుగాక!

**తా :** తామరతూడుల్లా కోమలమైన పాములగుంపు చచ్చిపోతుందని దయతో పాతాళానికి ప్రసరించనట్టి; లోకాలోకమన్న వ్యవహారం నిలబెట్టడానికే ప్రక్కలకు వ్యాపించనట్టి (అనగా సూర్యకిరణాలు ఎచట సోకుతాయో అచట లోకం, సోకనిది అలోకం అని), బ్రహ్మాండపు పైభాగం పగిలిపోతుందన్న భయంతో హద్దుమీరి పైకి ప్రసరించనట్టి ఆ సూర్యకిరణపుంజం మిమ్మల్ని కాపాడుగాక!

**అలం :** హేతూత్ప్రేక్ష.

**విశే :** ఇందులో సూర్యుని గమనంయొక్క ఆర్జత్వం చెప్పబడింది. ముక్కుసూటిగా నడవడం తప్ప పక్కకు చూడడం, కిందికి చూడడం, పైకిచూడడం సూర్యుని పద్ధతిగాదని కవి వుద్దేశం. ఆర్జత్వానికి కవి చెప్పిన కారణాలు చమత్కార గర్భితాలు.

**వివ :** 1. 'లోకాలోకా'న్నే 'చక్రవాళ' మంటారు. "లోకాలోకశ్చక్రవాళః" అని అమరం. పౌరాణిక గాథనుబట్టి లోకాలోకం ఒక పర్వతశ్రేణి. ఇది ఆకాశంనుంచి భూమిని వేరుచేస్తుంది. దీనికి ఒకవైపు (లోపలి) సూర్యుని వెలుగు సోకుతుంది. మరోవైపు (బయట) సోకదు. అంటే అంధకారం వుంటుంది. అందుకే దీన్ని లోకాలోకమంటారు. ఇది ఎంత ఎత్తైన పర్వతశ్రేణి అంటే చంద్ర, సూర్య, నక్షత్రకాంతులు కూడ దీని పైభాగాన్ని అంటలేవు. అందుకే దీని ప్రభావం నీలవర్ణంతో వుంటుంది. ఈ విషయం భాగవత పురాణంలో చెప్పబడింది. కాళిదాసు రఘువంశంలో దీని ప్రస్తావన తెచ్చాడు.

**"సోఽహమిజ్యా విశుద్ధాత్మా ప్రజాలోపనిమీలితః ।**
**ప్రకాశశ్చాప్రకాశశ్చ లోకాలోకఇవాచలః ॥" (రఘు 1-68)**



2. బ్రహ్మాండంనుంచి సృష్టి ఎలా ప్రారంభమయిందన్న విషయం దాదాపు అన్ని పురాణాల్లోను వుంది. మనుస్మృతిలో స్పష్టంగా వుంది. ఈ ప్రపంచం అంతా బ్రహ్మాండంలో దాగివుంది. కనుక సూర్యకిరణాలు ప్రపంచానికి ప్రమాదం రాకుండా వుండడంకోసమే లోకోపకార దృష్టితో బ్రహ్మాండం పైభాగాన్ని అంటవని కవి చమత్కరించాడు.

3. వీతాంధకారః అని పాఠాంతరం.

**శ్లో.** **అశ్యామఃకాలఏకో నభవతి భువనాంతోఽపి వీతేఽంధకారే[3]**
**సద్యఃప్రాలేయపాదో నవిలయమచల శ్చంద్రమా అప్యుపైతి,**
**బంధస్సిద్ధాంజలీనాం నహి కుముదవనస్యాపి యత్రోజ్జిహానే**
**తత్ప్రాతః ప్రేక్షణీయం దిశతు దినపతే ర్ధామకామాధికం వః ॥ 20**

**ప్రతి :** యత్ర= ఏ కాంతి; ఉత్+జిహానే= బయలువెడలగానే; కాలం= పగలు; ఏకః= ఒక్కటియే; అశ్యామ= శ్యామత్వం (నల్లనిది) లేనిది; నభవతి= కాదో; మరి; వీతే+అంధకారే= చీకటి తొలగగానే; భువనాంతఃఅపి= లోకంగూడ; భవతి= అవుతున్నదో; ప్రాలేయపాదః= మంచుకొండ ఒక్కటియే; సద్యః= వెంటనే; విలయం= కరిగిపోవుటను (నశించడం); నఉపైతి= పొందుటలేదో; మరి, చంద్రమా అపి= చంద్రుడుకూడ; ఉపైతి= పొందుతున్నాడో (కాంతిహీనుడు) కావడం; బంధః= చేతులు జోడించుట అనేది; సిద్ధ+అంజలీనాం= చేతులెత్తి నమస్కరించు సిద్ధులకు మాత్రమే కాదో; కుముదవనస్యాపి= కలువల గుంపులకు కూడ వుండునో (సూర్యోదయంతో కలువలు మూసుకుపోతాయి); తత్= ఆ; ప్రాతః= ఉదయకాలమందు; ప్రేక్షణీయం= చూడదగిన (రమణీయమైన); దినపతేః= పగటిరాజుయొక్క; ధామ= తేజస్సు; వః= మీయొక్క; కామాధికం= అనేకములైన కోర్కెలను; దిశతు= తీర్చుగాక!

**తా :** ఏ సూర్యోదయం కాలమునేగాక లోకాన్ని కూడ ప్రకాశింపజేస్తున్నదో; మంచుకొండతోపాటు మంచు చంద్రుణ్ణికూడ కాంతిరహితునిగా చేస్తున్నదో;

సిద్ధులతోపాటు కలువలకుగూడ బద్ధతను (చేతులు జోడించడం, రేకులు ముకుళితాలు కావడం) కలుగజేస్తున్నదో ప్రాతఃకాల రమణీయమైన ఆ సూర్యోదయం మీ కోర్కెలీడేర్చుగాక!

**అలం :** శ్లేష.

స్ర. **యత్కాంతిం పంకజానాం నహరతి కురుతే ప్రత్యుతాధిక్యరమ్యాం**
**నోధత్తే తారకాభాం తిరయతి నితరామాశు యన్నిత్యమేవ,**
**కర్తుం నాలం నిమేషం దివసమపిపరం యత్తదేకం త్రిలోక్యా**
**శ్చక్షుస్సామాన్యచక్షుర్విసదృశమఘభిద్భాస్వతస్తాన్మహో వః ॥ 21**

**ప్రతి :** యత్= ఏదైతే; పంకజానాం= పద్మాలయొక్క; కాంతిం= శోభను; నహరతి= హరించడంలేదో; ప్రత్యుత= పైపెచ్చు ఆధిక్యరమ్యాం= మిక్కిలి శోభను; అలాగే; యత్= ఏదైతే; నిత్యం= ఎల్లప్పుడూ; తారకాభాం= నక్షత్రాల కాంతిని (కనుగుడ్లు); నధత్తే= ధరించడంలేదో; నితరాం= మిక్కిలి; ఆశు= శీఘ్రంగా; తిరయతి= తిరస్కరిస్తున్నదో; నిమేషం= నిముషాన్ని (రెప్పపాటును); కర్తుం= చేయడానికి; న అలం= శక్తిలేదో; పైగా; పరం= అధికంగా; దివసమపి= రోజంతటనీ చేయడానికి శక్తి కలిగి వున్నదో; యత్ఏకం= ఏ ఒక్కటి; త్రిలోక్యాః= ముల్లోకాలకు; చక్షుః= నేత్రభూతమో; సామాన్య చక్షుర్విసదృశం= మామూలు కన్నుకంటె విలక్షణమైన; భాస్వతః= సూర్యునియొక్క; తత్మహః= ఆ తేజస్సనెడి నేత్రం; వః= మీకు; అఘభిత్= పాపవినాశిని; స్తాత్= అగుగాక!

**తా :** ఇక్కడ మామూలు కంటికంటె సూర్యుడనే కన్ను ఎలా విలక్షణమైనదో చెప్పబడింది. మామూలు కన్ను పద్మాలశోభను హరిస్తుంది. ఇది అలాగాదు. పద్మాలకు అధికశోభని, వికాసాన్ని కలుగజేస్తుంది. మామూలు కన్ను తారకల (నల్లని కనుగ్రుడ్లు) శోభని ధరించగా ఇది తారకల (నక్షత్రాల) కాంతిని హరిస్తుంది. మామూలు కన్ను నిమేషాన్ని (రెప్పపాటు) కలుగజేస్తే ఇది రోజుని ఏర్పరస్తుంది. అట్టి విలక్షణ నేత్రం మీ పాపాలను పోగొట్టుగాక!



**అలం :** వ్యతిరేకం. (శ్లేషానుప్రాణితం)

**విశే :** కవులు కళ్ళను పద్మాలతో పోల్చి వాటికంటె అందమైనవిగా వర్ణించడం పరిపాటి. ఆ దృష్టితో చూస్తే మామూలు కన్ను పద్మాల శోభని హరించగా, సూర్యకాంతి అనే కన్ను పద్మాలకు కాంతి కలుగజేస్తుంది. అంటే వికాసాన్నిస్తుంది. మామూలు కన్ను 'తారక' (నల్లని కనుగ్రుడ్డు) ని ధరించగా సూర్యకాంతి తారకని ధిక్కరిస్తుంది. అంటే సూర్యోదయంతో నక్షత్రాలు కాంతిహీనాలౌతాయి. మామూలు కన్ను నిమేషాన్ని (రెప్పపాటుతనం) మాత్రమే తాల్చగా సూర్యకాంతి నేత్రం రోజంతా వుంటుంది. నిమిషంకంటె రోజు గొప్పదికదా! కావున మామూలు కన్నుకంటె సూర్యనేత్రం విలక్షణమూ విశిష్టమున్నూ.

స్ర. **క్ష్మాం క్షేపీయః క్షపాంభశ్శిశిరతరతలస్పర్శతర్షాదృతేవ**
**ద్రాగాశానేతు మాశా ద్విరదకరసరః పుష్కరాణీవ బోధమ్,**
**ప్రాతః ప్రోల్లంఘ్య విష్ణోః పదమపి కృపయేవాతివేగాద్దవీయ**
**స్యుద్దామం ద్యోతమానా దహతుదినపతేర్దుర్నిమిత్తంద్యుతి ర్వః 22**

**ప్రతి :** క్షపాంభః= రాత్రి అవే నీటిచేత; శిశిరతర= మిక్కిలి చల్లనైన; తల= ప్రదేశంయొక్క; స్పర్శ= తాకుటయందలి; తర్షాత్ ఇవ= అభిలాషవల్ల అన్నట్లు; క్షేపీయః= శీఘ్రంగా; క్ష్మాం= భూమిని; ఋతా= పొందినట్టిది; ఆకా... పుష్కరాణి : ఆశాద్విరద= దిగ్గజాలయొక్క; కర= తొండములనెడి; సరః= సరసులందలి; పుష్కరాణి= కమలాలను; బోధం నేతుం ఇవ= వికాసమును పొందించుటకువలె; ద్రాక్= శీఘ్రంగా; ఆశా : (ఋతా)= దిక్కులకు ప్రాకినట్టిది (దిక్కులు కలది); ప్రాతః= ఉదయకాలమందు; విష్ణోః పదమ్ అపి= హరిపదమైన ఆకాశాన్ని గూడ; ప్రోల్లంఘ్య= అధిగమించి; కృపయాఇవ= శీతార్తులను రక్షించాలన్న దయాబుద్ధితో అన్నట్లుగా; అతివేగాత్= మిక్కిలి వేగంగా; దవీయసి (ఋతా)= మిక్కిలి దూరప్రదేశాలకు

సోకినట్టి; ఉద్దామం= మిక్కిలి; ద్యోతమానా= ప్రకాశిస్తున్న; దినపతేః= సూర్యునియొక్క; ద్యుతిః= కాంతి; వః= మీయొక్క; దుర్నిమిత్తం= అశుభాన్ని; దహతి= దహించుగాక!

**తా :** రాత్రంతా కురిసిన మంచులోని చల్లదనాన్ని మోహించి ఉదయాన్నే నేలమీదికేతెంచినట్టి, దిక్కులందలి ఏనుగుల యొక్క తొండాలనే సరస్సులందలి కమలాలకు వికాసాన్ని కలుగజేయాలన్న కోరికతో శీఘ్రంగా దిగంతాలకు వ్యాపించినట్టి, ప్రాతఃకాలాన ఆకాశాన్ని గూడ అధిగమించి శీతార్తులను కాపాడాలన్న దయాబుద్ధితో దూరతీరాలకు ప్రాకినట్టి దేదీప్యమానమైన సూర్యకాంతి మీ అశుభాన్ని పోగొట్టుగాక!

**అలం :** ఉత్ప్రేక్ష.

**విశే :** ఇందులో ఏనుగుల తొండాలను సరస్సులతో పోల్చడం సముచితం. తొండాల చివరి భాగాలు తినే పదార్థాలను స్వీకరించడానికి తెరుచుకుంటాయి (వికసిస్తాయి) కనుక సరస్సుల్లోని కమలవికాసం తొండాల చివరిభాగ వికసనానికి సమానం. దిగ్గజకరానికి సరస్సులకు తాద్రూప్య రంజనం. అలాగే శ్లేషద్వారా పుష్కరశబ్దానికి తాద్రూప్య రంజనం. పుష్కరం అంటే ఏనుగు తొండంయొక్క చివరి భాగమనీ, పద్మమనీ రెండర్థాలున్నాయి.

"పుష్కరం కరిహస్తాగ్రే............

"బిసప్రసూన రాజీవ పుష్కరామ్భోరుహాణి చ" అని అమరం.

శ్ర. **నోకల్పాపాయవాయో రదయరయదళత్క్ష్మాధరస్యాపీ గమ్యా**
**గాఢోద్గీర్ణోజ్జ్వలశ్రీ రహని న రహితా నో తమఃకజ్జలేన,**
**ప్రాప్తోత్పత్తిః పతంగాన్నపున కుపగతా మోషముష్ణత్విషో వో**
**వర్తిస్సైవాన్యరూపాసుఖయతు నిఖిలద్వీపదీపస్య దీప్తిః ॥ 23**

**అవ :** మామూలు దీపపువత్తికి సూర్యుడనే దీపపువత్తికి భేదం చెప్పుతున్నాడు.



**ప్రతి :** అదయ= దయలేని; రయ= వేగంచేత; దళత్= భేదింబడు (విదిలింపబడు); క్ష్మాధరస్య= పర్వతాలుగల; కల్ప[1]+అపాయవాయో : అపి= ప్రళయకాల ప్రమాదకరమగు గాలికిగూడ; నగమ్యా= కదిలింప వీలుకానిది (పర్వతాలను సైతం కదిలించే గాలి సూర్యుడనే దీపపువత్తిని కదిలించలేదని వుద్దేశం); అహని= పగటియందునూ; గాఢ+ఉద్గీర్ణ+ఉజ్జ్వలశ్రీః= బాగా వ్యాపించిన ప్రకాశించు శోభగలది; తమః= చీకటి అనెడి; కజ్జలేన= కాటుకచేత (మసి); నరహితాన= ఉన్నదికాదు (దీపపువత్తికి మసిబారుతుంది; దీనికి చీకటి అనే మసి వుండదు); పతంగాత్= సూర్యునివల్ల; ప్రాప్త+ఉత్పత్తిః= పుట్టుకగలదై; మోషం= కాంతిహీనతను; నపునః ఉపగతా= పొందనట్టి (మామూలు వత్తి పతంగం (మిడుత) వలన కాంతి పోగొట్టుకుంటే ఈ వత్తి వతంగంవల్ల (సూర్యుడు) కాంతి పొందుతుందని పతంగశబ్దశ్లేషచేత చమత్కరించాడు కవి); అన్యరూపావర్తిః= మామూలు వత్తికంటె విలక్షణమైన వత్తి అనదగిన; నిఖిల ద్వీపదీపస్య[2]= సమస్త ద్వీపాలకే దీపంవంటి (మామూలు దీపం ఏదో ఒక్క యింటికి మాత్రమే పరిమితం); ఉష్ణత్విషః= తీక్ష్ణ కిరణుడైన సూర్యునియొక్క; దీప్తిః= కాంతి (అనే వత్తి); వః= మిమ్మల్ని; సుఖయతు= సుఖపెట్టుగాక!

**తా :** మామూలు దీపపువత్తి చిన్నగాలికి గూడ కదులుతుంది. ఇది అలాగాదు. పర్వతాలను సైతం కదిలించే గాలికిగూడ తొణకదు. అది పగటియందు కాంతినివ్వదు. ఇది పగటియందు బాగా భాసిస్తుంది. దానికి మసి అంటుకుంటుంది. దీనికి మసి ఉండదు. అలాగే ఆ వత్తి పతంగాలకు (మిడుతలకు) ఆరిపోవచ్చు. ఈ వత్తి పతంగంవల్ల (సూర్యుడు) నే వెలుగునిస్తుంది.

**అలం :** వ్యతిరేకం – శ్లేషానుప్రాణితం

**విశే :** ఈ శ్లోకం ఆనందవర్ధనుడి ధ్వన్యాలోకంలో ద్వితీయోద్యోతంలో వ్యతిరేకాలంకారాని కుదాహరణంగా ఇవ్వబడింది (పుట 145). "అత్రహి

సామ్య ప్రపంచ ప్రతిపాదనం వినైవ వ్యతిరేకో దర్శితః" అని వివరణం. ధ్వనివాదంలో అలంకారవర్ణన చేసే సమయంలో ఇది ఉదాహృతం.

**వివ :** 1. 'కల్ప'మంటే 4,29,40,80,000 సంవత్సరాలని పురాణోక్తి. ఇదంతా బ్రహ్మకు ఒకరోజు. ప్రతి కల్పంయొక్క చివర ముల్లోకాల్లో ప్రళయాగ్ని పుడుతుంది. బ్రహ్మ సముద్రంలో లీనమౌతాడు (నిద్రకు). అపుడు బ్రహ్మకు ఒకరాత్రి గడుస్తుంది. కలసి మొత్తం బ్రహ్మకు ఒక రోజన్నమాట. తర్వాత బ్రహ్మ నిద్రలేస్తాడు. అపుడు నారాయణ రూపంలో ఆదిశేషువుపై కూర్చుండి సృష్టి పునః ప్రారంభిస్తాడు అని విష్ణుపురాణం.

2. పురాణోక్తినిబట్టి ద్వీపాలు ఏడు. ఇవి కమలంయొక్క రేకులు మాదిరిగా ఒకదానికొకటి విడివిడిగా వుంటాయి. అవి ఒక సముద్రాన్ని మరో సముద్రం నుంచి వేరు చేస్తాయి. ఈ ద్వీపాలన్నింటి మధ్యలో మేరుపర్వతానికి దక్షిణంగా జంబూద్వీపం ఉంది. అందులోనే భారతవర్షం అని విష్ణుపురాణం.

స్ర. **నిశ్శేషాశావపూర ప్రవరగురుగుణశ్లాఘనీయం స్వరూపా**
**పర్యాప్తం నోదయాదౌ దినగమసమయోపప్లవేఽప్యున్నతైవ,**
**అత్యంతం యానభిజ్ఞా క్షణమపి తమసా సాకమేకత్ర వస్తుం**
**బ్రధ్నస్యేద్ధా రుచిర్వో రుచిరివ రుచిరస్యాప్తయే వస్తునోఽస్తు॥ 24**

**ప్రతి :** నిశ్శేషా... స్వరూపా : నిశ్శేష= పూర్తిగా (ఏమీమిగలకుండా); ఆశా= దిక్కులను (ఆశలను); అవపూర= పూరించుట అనెడు; ప్రవర= శ్రేష్ఠమైన; గురు= గొప్పవైన; గుణ= గుణాలచేత; శ్లాఘనీయ= కొనియాడదగి న; స్వరూపా= ఆకారంగలది; పర్యాప్తం= సమర్థత అనునది; ఉదయాదౌన= కేవలం ప్రాతఃకాలమందేగాదు (కింతు= మరి); దినగమసమయ= సూర్యాస్తమయ కాలంయొక; ఉపప్లవే అపి= ప్రమాదమందు గూడ (అస్తమించేటప్పుడు గూడ); ఉన్నతైవ= ఔన్నత్యంగలదీ (క్షీణించనిది); యా= ఏదైతే; క్షణమపి= కాసేపైననూ; తపసా సాకం= చీకటితో కలసి (సహా);



అనభిజ్ఞా= తెలియరానిదో (చీకటిని మిగల్చనిదో); బ్రధ్నస్య= సూర్యునియొక్క; ఇద్ధా= స్పష్టమైన (ప్రకాశితమైన); రుచిః= ఆ కాంతి; వః= మీయొక్క; రుచిరస్య= ఇష్టమైన; వస్తునః= పదార్థంయొక్క; ఆప్తయే= ప్రాప్తికోసం; రుచిః ఇవ= కోరికవలె; అస్తు= అగుగాక!

**తా :** అన్ని దిక్కులను ప్రకాశింపజేయడంలో ఆసక్తి కలిగి వుండడమే ఉత్తమ గుణాలతో ప్రశంసనీయమైనట్టియు, ఉదయకాలంలో మాదిరిగానే అస్తమయకాలంలోనూ ఒకేరీతి శోభిల్లునట్టియు) ఒక్క నిమిషంగూడ చీకటి సహవాసం తెలియనట్టి ఆ సూర్యునికాంతి మీ అభీప్సితాలను తీర్చుగాక!

**అలం :** శ్లేష.

**విశే :** ఇందులో కవి శ్లిష్ట పదాలతో చక్కని ఔచిత్యాన్ని పోషించాడు. శ్లేషవల్ల 'సూర్యకాంతి' కోరికలేని అభిరుచిగా వర్ణితమైంది. కోరిక పక్షంలో అర్థం ఇలా ఉంటుంది.

అన్ని ఆశలను నెరవేర్చడంలో అభిరుచి శ్లాఘనీయం. (ప్రధాన స్థానం వహిస్తుంది) అది సంపదలున్నప్పుడే గాక దారిద్ర్య కాలంలోను అధికంగా వుంటుంది. ఒక్కక్షణమైనా తనకిష్టముగాని దానితోకలసి వుండని అభిరుచిలాంటిది సూర్యకాంతి. ఇందులో 'ఆశ' (కోరిక, దిక్కు) 'రుచి' (అభిరుచి, కాంతి) అనే పదాలు శ్లిష్టాలు. ఉదయ, దినగమ సమయ, తమసా అనేవి క్లిష్టాన్వయంతో శ్లేషిస్తాయి.

స్ర. **బిభ్రాణశ్శక్తినూశు ప్రశమితబలవత్తారకౌర్జిత్యగుర్వీం**
**కుర్వాణో లీలయాధ శ్శిఖినమపి లసచ్చంద్ర కాంతావభాసమ్,**
**ఆదద్యా దంధకారే రతిమతిశయినీ మావహ న్వీక్షణానాం**
**బాలో లక్ష్మీ మపారా మపర ఇవగుహోఽహర్పతే రాతపో వః ॥ 25**

**అలం :** సూర్యకాంతిని కుమారస్వామితో పోల్చి చెబుతున్నాడు.

**ప్రతి :** ప్రశమిత.... గుర్వీం : ప్రశమిత= అణచబడిన; బలవత్= బలముగల; తారక= నక్షత్రాల యొక్క (తారకాసురుని యొక్క); ఔర్జిత్య= తేజస్సంబంధమైన; గుర్వీం= గొప్పతనంగల; శక్తిం= లోకప్రకాశన సామర్థ్యమును (శక్తి అనే పేరుగల ఆయుధాన్ని); బిభ్రాణః= ధరించునట్టిది; లసత్... భాసం : లసత్= ఒప్పుచున్న; (చంద్రక+అంత= నెమలిపురుల చివరలచేత అనగా పింఛములందలి కన్నులచేత) చంద్ర[1]+కాంత= బంగారమువలె మనోహరమైన; (స్వర్ణేఽపిభూరిచన్ద్రౌ ద్వౌ అని అమరం) అవభాసం= కాంతిగల (ప్రకాశిస్తున్న అని గుహుని పక్షంలో); శిఖినం అపి= అగ్నిదేవునిగూడ (నెమలిని); లీలయా= విలాసంగా; అధఃకుర్వాణః= అధఃకరిస్తున్నట్టిది వాహనంగా చేసుకున్నట్టి); అంధకారే= చీకటిలో (అంధక+అరేః = అంధకాసురుని శత్రువైన శివునియొక్క) వీక్షణానాం= కమలాలనే కన్నులకు (కన్నులకు); అతిశయినం= గొప్పదైన; రతిం= ధైర్యాన్ని (ప్రీతిని); ఆవహన్= కలుగజేస్తున్నట్టి; అహర్పతేః= దినరాజైన సూర్యునియొక్క; బాలః= లేతదైన; ఆతపః= కాంతి; అపరఃగుహః ఇవ= మరోబాలకుమారస్వామివలె[2]; అపారాం= అంతులేని; లక్ష్మీం= సంపదను; అదధ్యాత్= చేకూర్చుగాక!

**తా :** కుమారస్వామి తారకాసురుని మదమార్చగా సూర్యకాంతి తారకల కాంతి నణచింది. కుమారస్వామి చంద్రకములు (నెమలి పింఛంలోని కన్నులు) కల్గిన నెమలిని వాహనంగా చేసుకోగా సూర్యకాంతి స్వర్ణకాంతి మనోహరమైన (చంద్ర+కాంత+అవభాసం) అగ్నిని అధఃకరించింది. షణ్ముఖుడు అంధకుని శత్రువైన శివుని కన్నులకు ఆనందాన్నిస్తే (అంధక+ అరి) సూర్యకాంతి అంధకారంలో (అంధకారే) పద్మాలనే కళ్ళకు ధైర్యాన్ని (రేపు ఉదయిస్తానులే బెంగ వద్దు అని) ఇస్తుంది. ఈవిధంగా అపర కుమారస్వామిలాంటి బాలసూర్యప్రభ మీకు సంపదలిచ్చుగాక!

**అలం :** శ్లేష.



**విశే :** ఈ శ్లోకంలో విశేషణాలు అన్నీ శ్లేషించాయి. శక్తి, తారక, శిఖి, చంద్రకాంత, అవభాస, అంధకార, వీక్షణ శబ్దాలు శ్లిష్టాలు. వీటిలో చంద్రకాంత, అంధకార శబ్దాలు సభంగశ్లేష కుదాహరణాలు.

**వివ :** 1. "చంద్రస్సుధాంశు కర్పూరకంపిల్ల స్వర్ణవారిషు" (విశ్వకోశం)

2. కుమారస్వామి శివపార్వతుల పుత్రుడు. మహాభారతంలో ఇతని పుట్టుక పలురకాలుగా ఉంది. ఒకచోట ఇతడు అగ్ని, స్వాహాదేవుల బిడ్డ అని వుంది. తర్వాత (6-23-12) దుర్గకి స్వాహాదేవితో అభిన్న వ్యవహారం చెప్పబడింది. అక్కడే (6-23-11) ఆమె స్కందుని తల్లి అని వుంది. కాళిదాసు కుమారస్వామిని పార్వతీ పుత్రుడన్నాడు.

**"అముం పురః పశ్యసి దేవదారుం పుత్రీకృతోఽసౌవృషభ ధ్వజేన ।**
**యో హేమకుంభస్తననిస్సృతానాం స్కందస్య మాతుః పయసాం రసజ్ఞః ॥**
(రఘు2-36)

స్ర. ***జ్యోత్స్నాంశాకర్ష పాండుద్యుతితిమిరమషీ శేషకల్మాషమీష**
**జ్జృంభోద్భూతేన పింగం సరసిజరజసా సంధ్యయా శోణశోచిః,**
**ప్రాతః ప్రారంభకాలే సకలమివ జగచ్చిత్రమున్మీలయంతీ**
**కాంతి స్తీక్ష్ణత్విషోఽక్ష్ణాంముదమువనయతా త్తూలికేవాతులాం వః 26**

**అవ :** సూర్యుణ్ణి చిత్రకారునితో పోలుస్తున్నాడు.

**ప్రతి :** జ్యోస్న... ద్యుతి : జ్యోత్స్నా= వెన్నెలయొక్క; అంశ= లేశముయొక్క (కొద్దిపాటి); ఆకర్ష= స్వీకారముచేత; పాండుద్యుతి= తెల్లని కాంతికలిగి (సూర్యోదయంతో వెన్నెల అదృశ్యం అయ్యే సమయం); తిమిరమషీ= మసివంటి చీకటియొక్క; శేష= మిగిలిన కల్మాషం= నలుపు మరియు ఎరుపు కలిసిన రంగును (సూర్యోదయంతో అంతమవుతూ మిగిలిన చీకటి రంగు కర్బురపు రంగులో వుంటుంది. అంటే నానావర్ణాలు కలిసిన రంగు); ఈషత్= కొద్దిగా; జృంభ= వికసించడంవల్ల; ఉద్భూతేన= లేచిన; సరసిజ రజసా=

పద్మాల పుప్పొడిచేత; పింగం= పింగళవర్ణం కలిగి (గోరోచనం రంగు= పసుపు); ప్రాతః ప్రారంభకాలే= పగలు మొదలయ్యే సమయంలో; సకల= సమస్తమైన; జగత్+చిత్రం= లోకమనే బొమ్మని (వర్ణచిత్రం); ఉన్మీలయన్తీ= ప్రకటిస్తున్న (చిత్రిస్తున్న); తీక్ష్ణత్విషః= చండభానునియొక్క; కాంతిః= తేజస్సు; వః= మీయొక్క; అక్ష్ణాం= కన్నులకు; తూలికా ఇవ= చిత్రకారుని కుంచెమాదిరి; ముదం= సంతోషమును; ఉపనయతాత్= కలిగించుగాక!

**తా :** సూర్యోదయ సమయంలో మిగిలిన వెన్నెల కాంతి, (తెలుపు) చీకటి నలుపు, అరుణోదయపు ఎరుపు, కొద్దిగా వికసించిన కమలములందలి పుప్పొడి పసుపు, ఇవి అన్నీ చిత్రకారుడు చిత్రించు వర్ణాలే. ఇటువంటి రంగుతో లోకచిత్రాన్ని గీస్తూ చిత్రకారుని కుంచెను ప్రదర్శిస్తున్న సూర్యకాంతి మీకు సంతోషాన్నిచ్చుగాక!

**అలం :** ఉపమా.

**విశే :** ఇతర శ్లోకాల్లో సంపదలివ్వడం, పాపాలు పోగొట్టడం వుండగా, ఇందులో సంతోషం కల్గజేయడం విశేషం. కారణం సూర్యకాంతి చిత్రాన్ని అందిస్తున్నది కాబట్టి అది బాహ్యచక్షువులకు ఆనందాన్ని కలిగించడం సహజం. లలితకళల్లో ఒకటైన 'చిత్రలేఖనం' నేత్రేంద్రియానికి ఆనందదాయి. కవికిగల చిత్రలేఖనాభిరుచి కూడ ఇందులో వ్యక్తమైంది.

**వివ :** * శ్రీనాథుని అనువాదం చూడవచ్చు (కాశీ. 1-123).

స్ర. **ఆయాంతీ కిం సుమేరో స్సరణి రరుణితా పాద్మరాగైః పరాగై**
**రాహోస్విత్స్వస్యమాహారజన విరచితా వైజయంతీరథస్య**
**మాంజిష్ఠీ ప్రష్ఠవాహావలివిధుతశిరశ్చామరాళీ ను లోకై**
**రాశంక్యాలోకితైవం సవితు రఘనుదే స్తా త్ప్రభాతప్రభా వః ॥ 27**

**అవ :** సూర్యకాంతి ఒక్కటే పలువిధాలుగా వూహింపబడుతున్నది.



**ప్రతి :** పాద్మరాగైః= (మేరుపర్వతం గుండా వచ్చేటప్పుడు) సూర్యాశ్వముల యొక్క గిట్టలచేత లేపబడిన పద్మరాగ మణుల వర్ణం కలిగిన; పరాగైః= ధూళులచేత; సుమేరోః= మేరుపర్వతం యొక్క; సరణి= మార్గము (దారి); అరుణితా= ఎఱ్ఱదనమును; ఆయాంతీ కిం= పొందినదా ఏమి?; ఆహోస్విత్= లేక (వితర్కము నందు); స్వస్య= తనయొక్క (సూర్యుని); రథస్య= రథానికి కట్టిన; వైజయంతీ= పతాక; మాహారజన= కౌసుంభ వస్త్రముచేత (కుంకుమ పువ్వు వన్నె); విరచితా= నిర్మింపబడినదా ఏమి? ప్రష్ఠ... చామరాళీ : ప్రష్ఠ= శ్రేష్ఠములైన; వాహ= వాహనాలైన; అశ్వాలయొక్క; ఆవళి= పంక్తియొక్క; విధుత= కదల్చబడిన; శిరః= తలలందలి; చామరాళీ= వింజామరల గుంపు (గుఱ్ఱాల తలలపై అలంకారంగా వుండే కుచ్చుల గుత్తులు); మాంజిష్ఠీ= ఎరుపురంగు కలిగినదా ఏమి?; ఏవం= ఈ విధంగా; లోకైః= జనులచేత; ఆశంక్య= సందేహంతో; ఆలోకితా= చూడబడిన; సవితుః= సూర్యునియొక్క; ప్రభాతప్రభా= ప్రాతఃకాల కాంతి; వః= మీయొక్క; అఘనుదే= పాపపరిహరణార్థము; స్తాత్= అగుగాక! (పాపాలు పోగొట్టుగాక!)

**తా :** సూర్యాశ్వాలచేత లేపబడిన పద్మరాగ మణులనే ధూళిచేత నిండి మేరుపర్వతం ఎఱ్ఱబడినదా ఏమి? సూర్యరథానికి కట్టిన పతాక కుంకుమవన్నె వస్త్రముచేత నిర్మింపబడినదా ఏమి? గుఱ్ఱాల తలలపైవున్న కుచ్చులు ఎఱ్ఱనివా ఏమి? అని ఈ విధంగా జనులచేత అనేకవిధాలుగా సంభావింపబడుతున్న బాలసూర్యప్రభ మీ పాపాలను తొలగించుగాక!

**అలం :** ఉల్లేఖం.

స్ర. **ధ్వాంతధ్వంసంవిధత్తే నతపతి రుచిమన్నాతిరూపం వ్యనక్తి**
**న్యక్త్వం నీత్వాపి నక్తం నవితరతితరాంతావదహ్నస్త్విషం యః**
**సప్రాతర్మావిరంసీ దసకలపటిమా పూరయన్యుష్మదాశా**
**మాశాకాశావ కాశావతరణ తరుణప్రక్రమోఽర్కప్రకాశః 28**

ప్రతి : యః= ఏదైతే; ధ్వాంత= చీకటియొక్క; ధ్వంసం= వినాశనాన్ని; విధత్తే= చేయునో (తథాపి); నతపతి= అయినప్పటికీ వేడి కలిగి వుండదో; రుచిమత్= కాంతి గలిగినప్పటికీ; అతిరూపంన వ్యనక్తి= మిక్కిలి స్పష్టమైన రూపాన్ని ప్రకటించదో; నక్తం= రాత్రిని; న్యక్త్వం= తిరస్కార భావాన్ని; నీత్వాఽపి= పొందించిగూడ; అహ్నః తావత్= పగటికిమాత్రం; సవితరతి తరాం= అతిశయమైన; త్విషం= కాంతిని; కలుగజేయదో; ప్రాతః= ఉదయకాలమున; అసకలపటిమా= అంతగా తీక్ష్ణతలేనట్టి; ఆశా... ప్రక్రమః ఆశా= దిక్కులయొక్క; అవకాశ= అంతరాళమున; అవతరణ= అవతరించుట యందు (వెలుగుటయందు); తరుణ= నూత్నమైన; ప్రక్రమః= పరాక్రమము (సామర్థ్యం); కలిగినదో; సః= ఆ; ఆర్కప్రకాశః= సూర్యుని వెలుగు; యుష్మత్= మీయొక్క; ఆశాం= కోర్కెను (ప్రార్థన); పూరయన్= అదేపనిగా (నిరంతరం); నెరవేర్చుతూ; మావిరంసీత్= విశ్రాంతి లేకుండుగాక! (మీ కోరికలు ఎప్పుడూ తీర్చుతూ ఉండుగాక)

**తా :** చీకటి పోయినప్పటికీ వేడివుండదు. కాంతిమంతమే అయినా స్పష్టంగా కన్పించదు. రాత్రిని పారద్రోలినా పగటికి అహమునివ్వదు. (పగలు అన్పించనీదు, గర్వాన్ని కలుగనీదు) దిక్కులు మరియు ఆకాశ అంతరాళాల కేగునట్టి ఆ బాలప్రభ మీ కోరికలు తీర్చడంలో నిమగ్నమగుగాక!

**అలం :** శ్లేష.

**విశే :** ఇందులో మొదటి పాదం శ్లేషతో కూడుతుంది. ఏదైతే అజ్ఞానాన్ని తొలగిస్తుందో అది అంతగా కష్టానివ్వదు. (చీకటిని తొలగించినా వేడిగా వుండదు) అలాగే స్వోత్కర్షని (పగటికి అహంభావాన్ని, పగటితనాన్ని) కలుగనివ్వదు అని శ్లిష్టార్థం.

స్ర. **తీవ్రం నిర్వాణహేతు ర్యదపిచ విపులం యత్ప్రకర్షేణ చాణు**
**ప్రత్యక్షం యత్పరోక్షం యదిహ యదపరం నశ్వరం శాశ్వతంచ,**



**యత్సర్వస్య ప్రసిద్ధం జగతి కతిపయే యోగినో యద్విదంతి**
**జ్యోతిస్తద్ద్విప్రకారం సవితు రవతు వో బాహ్య మాభ్యంతరం చ ॥ 29**

**అవతారిక :** సూర్యకాంతిగల పరస్పర వైరుధ్యం చెప్పబడుతున్నది.

**ప్రతి :** తీవ్రం= వేడిగా వున్నప్పటికీ; యత్‌నిర్వాణహేతుః= ఏది మోక్షకారణమో; విపులమపి= విశాలమైనప్పటికీ; యత్= ఏదైతే; ప్రకర్షేణ= మిక్కిలి (బాగా); అణుచ= అణువుకంటె సూక్ష్మమైనదో; ప్రత్యక్షం= ఎదురుగా కనిపించేదే అయినా; యత్ అప్రత్యక్షం= ఏది కనిపించదో (ఆధ్యాత్మిక భావన); యత్= ఏదైతే; ఇహ= సమీపంలో వుండుకూడ; అపరం= దూరంగా ఉంటుందో; నశ్వరం= నశించు గుణముకలదే అయినా; యత్ శాశ్వతం చ= ఏదైతే స్థిరమైనదో (పోతూ వస్తూ ఉంటుంది); యత్= ఏదైతే; సర్వస్య= అందరికి; ప్రసిద్ధం= తెలిసినదే అయినా; జగతి= లోకంలో; కతిపయే= కొందరు; యోగినః= యోగులు మాత్రమే; యత్‌విదంతి= దేనిని తెలుసుకుంటున్నారో (సిద్ధయోగులకు మాత్రమే సూర్యజ్యోతి సాక్షాత్కారం లభిస్తుంది); తత్= ఆ; ద్విప్రకారం= విరుద్ధస్వభావంచేత రెండు రకాలైన; సవితుః= సూర్యునియొక్క; జ్యోతిః= వెలుగు; వః= మిమ్మల్ని; అవతు= రక్షించుగాక!

**తా :** సూర్యకాంతి చాలా తీక్ష్ణంగా వుంటుంది. అయినా మోక్షప్రదం. విపులంగా కనిపిస్తుంది అయినా అణువులా సూక్ష్మం. పైకి కనిపించినట్లే వుంటుంది కాని కనిపించదు. అందరికీ తెలిసిందే అయినా కొందరు యోగులు మాత్రమే దాన్ని దర్శిస్తారు. ఈవిధంగా బాహ్యాభ్యంతర భేదంగల సూర్యతేజస్సు మిమ్మల్ని బాహ్యాభ్యంతరాలైన ఆపదలనుంచి రక్షించుగాక! (ఆధ్యాత్మిక, ఆధిభౌతిక విపత్తులనుంచి).

**విశే :** ఈ శ్లోకంలో చెప్పబడ్డ వైరుధ్యం సూర్యభగవానునియొక్క ఆధ్యాత్మిక, ఆధిభౌతిక స్వరూప భేద కారణంగా ఏర్పడినటువంటిది. సూర్యుని భౌతిక

స్వరూపం సాధారణ ప్రాణులందరికీ పరిచితం. అదే దీనియొక్క బాహ్యస్వరూపం. సూర్యుని ఆధ్యాత్మిక స్వరూపం యోగాభ్యాసపారీణులైన యోగులకు మాత్రమే సంవేద్యం. అదే దీనియొక్క ఆంతరరూపం. త్రిభువనపాలవ్యాఖ్యలో వ్యాసాది యోగులకు మాత్రమే సూర్యుని అంతస్స్వరూపం తెలుస్తుందని చెప్పబడింది.

స్ర. **రత్నానాం మండనాయ ప్రభవతి నియతోద్దేశలబ్ధావకాశం**
**వహ్నే ర్దార్వాది దగ్ధుం నిజజడిమతయా కర్తుమానందమిందోః,**
**యత్తు త్రైలోక్యభూషా విధిరఘదహనం హ్లాది వృష్ట్యాశు తద్వో**
**బాహుళ్యోత్పాద్యకార్యాధికతరమవతాదేకమేవార్కతేజః ॥ 30**

**ప్రతి :** యత్= ఏదైతే; నియత..... కాశం : నియత= పరిమితమైన; ఉద్దేశ= ప్రదేశమందు (లక్ష్యమందు); లబ్ధ= పొందబడిన; అవకాశం= స్థానం కలిగి (అభిరుచి); రత్నానాం= పద్మరాగాది మణులకు; మండనాయ= అలంకారార్థం; ప్రభవతి= సమర్థమవుతున్నదో (రత్నాల్లో ప్రకాశించి వాటికి కర్ణభూషణత్వాదులను కలుగజేస్తుంది); వహ్నేః= అగ్నికి; దారు+ఆది= కాష్ఠమయారణ్యాలను; దగ్ధుం= దహించడానికి అవుతున్నదో (అగ్నిలోవుండి అడవులను దహిస్తుంది); నిజ= తనయొక్క సహజమైన; జడిమతయా= చల్లదనంచేత; ఇందోః= చంద్రునకు; ఆనందం= ఉల్లాసాన్ని; కర్తుం భవతి= కలిగించుటకు అవుతున్నదో (సూర్యకాంతి పడక చంద్రుడు ప్రకాశించడు; యత్= ఏది; త్రైలోక్యభూషావిధిః= ముల్లోకాలకు ఆభరణాయమానమైనదో; అఘదహనం= పాపధ్వంసకమో; వృష్ట్యా= వర్షంచేత[1]; ఆశు= శీఘ్రంగా; హ్లాది= సంతోషకారియో; బాహుళ్య.... తరమ్ : బాహుళ్య= ఈ విధంగా అనేకమైన; ఉత్పాద్య= కల్పింపదగిన (చేయదగిన); కార్య= ప్రయోజనాల యొక్క; అధికతరం= ఆధిక్యంగల (అనేక ప్రయోజనాలను సాధించే); ఏకంఏవ= ఒక్కటే అయిన; తత్= పైన పేర్కొన్న; అర్కతేజః= సూర్యతేజస్సు; వః= మిమ్మల్ని; అవతాత్= కాపాడుగాక!



**తా :** సూర్యకాంతి పద్మరాగాది మణులతోకూడి వాటికి ఆభరణత్వాన్ని కలుగజేస్తుంది. (అవి కర్ణావతంసాదులైనప్పుడు మాత్రమే). దావానల రూపంలో అరణ్యాలను దగ్ధం చేస్తుంది. స్వశీతలత్వ గుణంచేత చంద్రుని ప్రకాశింపజేస్తుంది. ముల్లోకాలకు ఆభరణాయమానం. పాప విధ్వంసకం. వర్షదాయకం. ఆనందప్రదం. ఇటువంటి బహుళార్థ సాధకమైన అర్క తేజస్సు మిమ్మల్ని కాపాడుగాక!

**అలం :** వ్యతిరేకం.

**విశే :** ఈ శ్లోకాన్ని మరొక విధంగాకూడ వ్యాఖ్యానించవచ్చు. రత్నాది ఆభరణాలు కర్ణ, కంఠాది పరిమిత ప్రదేశాలకు మాత్రమే ఆలంకార్యతను (శోభని) కలుగజేస్తాయి. అగ్ని కట్టెల్ని మాత్రమే దహిస్తుంది. చంద్రుడు చల్లని మంచుబిందువులచేతనే ఆనందకారి అవుతున్నాడు. కాని సూర్యకాంతి మాత్రం తాను ఒకటే అయినా పై మూడు పదార్థాలు పరిమితంగా చేసిన పనుల్ని అంతకంటె విపులంగా చేస్తుంది. సూర్యకాంతి రత్నాల మాదిరిగాగాక ముల్లోకాలకు అలంకారప్రాయం అవుతుంది. అగ్నిలా అరణ్యాలనేగాక పాపధ్వంసంకూడ చేస్తుంది. అలాగే చంద్రుడిలాగాక తాను అపారవర్షం చేత ఆనందకారి అవుతుంది.

**వివ :** 1. సూర్యుడు వర్షప్రదాత అన్న విషయం రామాయణంలోకూడ సూచింపబడింది.

"నవమాసధృతం గర్భం భాస్కరస్యగభస్తిభిః ।
పీత్వారసం సముద్రాణాం ద్యౌః ప్రసూతే రసాయనమ్ ॥

(సూర్యకిరణాల సాయంతో సముద్ర జలపానం చేసిన ఆకాశం నవమాసాలు గర్భం దాల్చి వర్షాకాలంలో వర్షరూపేణ ప్రసవిస్తుంది.)

"ఆదిత్యాజ్జాయతే వృష్టిః... అని శ్రుతి. (సం.భారతం 12-163-11)

ప్ర. మీలచ్చక్షుర్విజిహ్మాశ్రుతి జడరసనం నిఘ్నితఘ్రాణవృత్తీ
స్వవ్యాపారాక్షమత్వక్పరిముషితమనః శ్వాసమాత్రావశేషమ్,
విస్రస్తాంగం పతిత్వా స్వపదపహరతా దశ్రియం వోఽర్కజన్మా
కాలవ్యాళావలీఢం జగదగద ఇవోత్థాపయన్ప్రాక్ప్రతాపః* **31**

**అవ :** సూర్యకాంతిని విషాన్ని హరించే మందుగా చెబుతున్నాడు.

**ప్రతి :** మీలత్= మూసుకుపోతున్న; చక్షుః కళ్ళు కలిగి; విజిహ్మా= మందీభూతమైన (వినబడని); శ్రుతి= చెవులు కలిగి; జడ= మొద్దుబారిన; రసనం= నాలుక కలిగి; నిఘ్నిత= పరాధీనమైన; ఘ్రాణవృత్తి= నాసిక వ్యాపారం కలిగి (ముక్కుకు ఏ వాసన తెలియకపోవడం); స్వ= తన; వ్యాపార= పనియందు; అక్షమ= అసమర్థమైన; త్వక్= చర్మం గలిగి (స్పర్శజ్ఞానం లోపించడం); పరిముషిత= తొలగింపబడిన; మనః= మనసు కలిగి (మనసు భగ్నమై); శ్వాసమాత్రావశేషం= ఊపిరిమాత్రమే నిలిచినట్టి; విస్రస్త= స్వచేష్టలుడిగిన; అంగం= అవయవాలు కలిగి; స్వపత్= పడకమీద; పతిత్వా= పడి; కాలవ్యాళ+అవలీఢం= కాల (నల్లని) మనే నల్లత్రాచుచేత కరవబడిన; జగత్= లోకాన్ని; అగదఇవ= విషాన్ని హరించే మందులాగ; ఉత్థాపయన్= మేలు కొలుపుతున్న (బ్రతికిస్తున్న); అర్కజన్మా= సూర్యునినుంచి పుట్టిన; ప్రాక్ప్రతాపః= నూతనశక్తిగల వేడి (తూర్పుకాంతి); వః= మీయొక్క; ఆశ్రయం= దారిద్ర్యాన్ని; అపహరతాత్= అపహరించుగాక!

**తా :** కాలసర్పంచేత కాటు వేయబడి నిద్రిస్తున్న ప్రపంచంయొక్క విషాన్ని హరించే మందు సూర్యకాంతి. పాముకాటుకు గురైన వ్యక్తి కళ్ళు తెరవడు. వినికిడి జ్ఞానం పోతుంది. రుచి తెలియదు. వాసన అర్థం కాదు. స్పర్శ వుండదు. మనస్సు స్వాధీనంలో వుండదు. శరీరం అస్తవ్యస్తమౌతుంది. కేవలం శ్వాసమాత్రమే పని చేస్తుంది. ఈ విధంగా పడివున్న ప్రపంచాన్ని తన కాంతితో మేల్కొల్పుతున్న సూర్యభగవానుని కిరణాలు మీ దారిద్ర్యాన్ని పోగొట్టుగాక!



**అలం :** ఉపమా.

**వివ :** * శ్రీనాధుని అనువాదం చూడవచ్చు (కాశీ. 1-139).

ప్ర. నిశ్శేషం నై శమంభః ప్రసభమపనుద న్నశ్రులేశానుకారి
స్తోకస్తోకాపనీతారుణరుచిరచిరా దస్తదోషానుసంగః,
దాతా దృష్టిం ప్రసన్నాం త్రిభువననయనస్యాశుయుష్మద్విరుద్ధం
వద్యాద్బ్రధ్నస్యసిద్ధాంజనవిధిరపరః ప్రాక్తనోఽర్చిఃప్రచారః **32**

**అవ :** సూర్యకాంతి సిద్ధాంజనం లాంటిదని శ్లేషద్వారా చెబుతున్నాడు.

**ప్రతి :** అశ్రులేశ+అనుకారి= కన్నీటి బిందువులావున్న; నైశమంభం= మంచుతుంపరలను; ప్రసభం= వేగంగా; నిశ్శేషం= పూర్తిగా; అపనుదన్= తొలగించినదై; స్తోకస్తోక= కొద్దికొద్దిగా; అపనీత= పోగొట్టబడిన; అరుణరుచిః= ఎర్రదనం గలిగి; అచిరాత్= శీఘ్రంగా; అస్త= విడువబడిన; దోష+అనుషంగః= రాత్రి సంపర్కం గలిగి (రాత్రిపోయి) (కామలాది నేత్రదోషాలను పోగొట్టి) త్రిభువన నయనస్య= ముల్లోకాలనే కంటికి; ప్రసన్నం= నిర్మలమైన; దృష్టిం= చూపును; దాతా= ఇస్తున్న; అపరః సిద్ధాంజనవిధిః= సాక్షాత్తు (మరో) కాటుక విధానంవలె (కాటుక కంటికి కాంతినిచ్చుట వలె) వున్న; బ్రధ్నస్య= సూర్యునియొక్క; ప్రాక్తన= ఉదయకాలపు; అర్చిఃప్రచారః= కాంతి ప్రసారము; యుష్మత్= మీయొక్క; విరుద్ధం= అనిష్టాన్ని; ఆశు= వెంటనే (శీఘ్రంగా); వధ్యాత్= పోగొట్టుగాక!

**తా :** కాటుక పెట్టుకోవడంవల్ల కంటినుంచి వచ్చే నీరుపోతుంది. సూర్యకాంతి మంచును హరిస్తుంది. కాటుక కళ్ళ ఎర్రదనాన్ని పోగొడుతుంది. సూర్యోదయంతో సారథియైన అనూరుని అరుణత్వం పలుచబడుతుంది. కళ్ళలోని కామలాది దోషాలను (పిత్త ప్రకోపాదులవలన కలుగు కామెర్ల రోగం) తొలగిస్తే సూర్యకాంతి చీకటిని (దోషం) పోగొడుతుంది. కాటుక

కంటికి ప్రసన్నత కలిగించినట్లే సూర్యకాంతి ముల్లోకాలనే కంటికి ప్రసన్నతనిస్తుంది.

**అలం :** శ్లేష.

**విశే :** ఇందులో అంభః, అరుణ, దోష అనే శబ్దాలు శ్లేషించాయి. కనుక శబ్దశ్లేష. అవయవాల్లో మాత్రమే (క్రియల్లో) శ్లిష్టత ఉంది. కాని అవయవిలో (అంటే కర్తలో) లేదు. ఇటువంటి శ్లేషలే సూర్యశతకంలో అధికంగా కనిపిస్తాయి. తెలుగులో వసుచరిత్రకారుడు, సరసభూపాలీయకర్త, విజయవిలాసకర్త, చంద్రికాపరిణయకర్తలు ఇలాంటి శ్లేషలను ఎక్కువగా వాడారు.

స్ర. **భూత్వా జంభస్యభేత్తుః కకుభి పరిభవారంభభూశ్శుభ్రభానో**
**ర్బిభ్రాణా బభ్రుభావం ప్రసభమభినవాంభోజజృంభా ప్రగల్భా,**
**భూషా భూయిష్ఠశోభా త్రిభువనభవనస్యాస్య వైభాకరీ యా**
**విభ్రాంతిభ్రాజమానా విభవతు విభవోద్భూతయే సా విభావః ॥33**

**ప్రతి :** యా= ఏదైతే; జంభస్యభేత్తుః= జంభాసురుని వధించిన ఇంద్రునియొక్క; కకుభి= దిక్కునందు (తూర్పు); భూత్వా= ఉదయించి; శుభ్రభానోః= తెల్లని కిరణాలుగల చంద్రునియొక్క; పరిభవ= అవమానమందు; ప్రారంభభూః= ఆరంభస్థానం గలిగి (చంద్రుణ్ణి కాంతిహీనుణ్ణిచేసి); బభ్రుభావం= కపిలవర్ణాన్ని (నీలపీత మిశ్రితవర్ణం లేక గోరోచనం రంగు); బిభ్రాణా= ధరించి; ప్రసభం= ప్రకామంగా (లేక బలాత్కారంగా, హఠాత్తుగా; అభినవ+అంభోజ= నూత్నములైన కమలాల యొక్క; జృంభ= వికాసమందలి; ప్రగల్భా= నేర్పు కలిగి; త్రిభువనభవనస్య= ముల్లోకాలనే గృహానికి; భూయిష్ఠశోభా= అధికమైన కాంతి (సొగసు) గల; భూషా= అలంకారమై; భ్రాజమానా= ప్రకాశిస్తున్న; సా= ఆ; వైభాకరీ= సూర్యసంబంధమైన; విభా= కాంతి; వః= మీయొక్క; విభవ+ఉద్భూతయే= ఐశ్వర్య ప్రాప్తికోసం; విభ్రాంతి= నిస్సంశయంగా; విభవతు= సమర్థమగుగాక! (తప్పక ఐశ్వర్యాన్నిచ్చుగాక!)



**తా :** తూర్పుదిక్కున ఉదయించి చంద్రుని కాంతినణచి కుసుంభరాగాన్ని (కుంకుమపువ్వు ఎరుపులేక పసుపు అదే పింగళవర్ణం) దాల్చి కమలాలకి నవీనవికాసాన్ని కలిగించే నేర్పు కలిగి, త్రిభువన భవనాభరణాయమానమైన భానూదనం మీకు ఐశ్వర్యదాయి అగుగాక!

**అలం :** అనుప్రాస. (భకారావృత్తి)

**విశే :** ఈ శ్లోకంలో మయూరుని వర్ణవిన్యాసవైచిత్రి స్పష్టం. భకారంతో ఆడుకున్నాడు మయూరుడు. ఇటువంటి వర్ణవిన్యాసం ఈ గ్రంథంలో ఎక్కువ. అందుకే మూర్తికవి "మయూరుని సువర్ణ కలన" అని మయూరుని కవితాలక్షణాన్ని వెలార్చాడు (నరస. 1-33).

స్ర. **సంసక్తం సిక్తమూలా దభినవభువనోద్యానకౌతూహలిన్యా**
**యామిన్యా కన్యయేవామృతకరకలశావర్జితే నామృతేన,**
**అర్కాలోకః క్రియాద్వో ముదముదయశిరశ్చక్రవాళాలవాలా**
**దుద్యన్బాలప్రవాళప్రతిమరుచిరహఃపాదపప్రాక్ప్రరోహః ॥ 34**

**అవ :** ఉదయిస్తున్న సూర్యకాంతిని పగటి చెట్టు అంకురంలా చెబుతున్నాడు.

**ప్రతి :** అభినవ= నూత్నములైన (చైతన్యవంతాలయిన); భువన+ఉద్యాన= లోకములనే తోటలను (పెంచుటయందు); కౌతూహలిన్యా= కుతూహలంగల; యామిన్యాకన్యయా= రాత్రి అనే కన్యచేత; అమృత... మృతేన : అమృతకర= చంద్రుడనెడి; కలశ= కుండలచేత; ఆవర్జిత= క్షిప్తములైన (ఉంచబడిన); అమృతేన= సుధచేత (మంచుచేత); సంసక్తం= అదేపనిగా (అనవరతం); సిక్తమూలాత్= తడుపబడిన మొదళ్ళుకల; ఉదయ... వాలాత్ : ఉదయ= ఉదయాద్రియొక్క; శిరః= శృంగములయొక్క; (శిఖరాలు);

చక్రవాళ= మండలమనెడి; ఆలవాలాత్= ఆధారప్రదేశంనుంచి (ఉదయాద్రి ఆధారంగా); ఉద్యన్= వెలువడుతున్న (ఉదయిస్తున్న); బాలప్రవాళ= లేత చిగుళ్ళతో; ప్రతిమ= సాటియైన; రుచిః= కాంతిగల; అహఃపాదప= పగలు అనే చెట్టుయొక్క; ప్రాక్‌ప్రరోహః= తొలి అంకురంలాంటి; అర్క+ఆలోకః= సూర్యప్రకాశము; వః= మీకు; ముదం= సంతోషాన్ని; క్రియాత్= కలిగించుగాక!

**తా :** నూతనమైన లోకమనే ఉద్యానవనాన్ని పెంచాలన్న కోరికగల రాత్రి అనే కన్య చంద్రుడనే కుండతో అమృతాన్ని క్రుమ్మరింపగా ఉదయాద్రి శిఖరమండలాన (క్షేత్రం) పుట్టుకొస్తున్న పగటి చెట్టుయొక్క తొలి అంకురంలాంటి బాలభానుకిరణపుంజం మీకు సంతోషాన్నిచ్చుగాక!

**అలం :** ఉపమ, రూపకాలు.

**విశే :** ఇందులో మయూరుడు రూపకాలంకార విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. మయూరుని సృజనాత్మకత పరాకాష్ఠదశలో వుంది. ఉదయిస్తున్న సూర్యకాంతి అప్పుడే మొగ్గతొడుగుతున్న చెట్టుయొక్క ఎర్రదనం. చెట్టు పగలు. ఆ పగటి చెట్టుకు ఆధారభూమి ఉదయాద్రి శిఖరం. చెట్టు పెరగడానికి నీరు చంద్రుడిలోని అమృతం. నీరు పోసిన వ్యక్తి రాత్రి అనే కన్య. ఇక్కడ మొక్కని పెంచడానికి కర్తని కన్యగా చెప్పడం విశేషం. మొక్కలను లలితంగా పెంచి సఫలం చేసేది స్త్రీలు. అందులోనూ కన్యలు (అందుకే శాకుంతలంలో శకుంతలచేత కాళిదాసు చెట్లను పోషింపజేశాడు కణ్వాశ్రమంలో). ఇటువంటి మనోజ్ఞభావాలు సూర్యశతకంలో కోకొల్లలు.

స్ర. **భిన్నం సారుణస్య క్వచిదభినవయా విద్రుమాణాం త్విషేవ**
**త్వంగన్న క్షత్రరత్నద్యుతినికరకరాళాంతరాళం క్వచిచ్చ,**
**నాంతర్ని శ్శేషకృష్ణశ్రియముదధిమివ ధ్వాంతరాశిం పిబన్స్తా**
**దౌర్వఃపూర్వోప్యపూర్వోఽగ్నిరివ భవదఘప్లుష్టయేఽర్కావభాసః 35**



**ప్రతి :** క్వచిత్= కొన్నిచోట్ల; విద్రుమాణాం= పగడాల యొక్క; త్విషాఇవ= కాంతిచేత; అరుణస్య= అనూరునియొక్క; అభినవయా= వినూత్నమైన; భాసా= కాంతిచేత; భిన్నం= భేదింపబడినది (వికలమైన); క్వచిత్‌చ= మరొక ప్రదేశమందు; త్వంగత్= కంపించుచున్న; నక్షత్ర= నక్షత్రాలనెడి; రత్న= రత్నాలయొక్క; ద్యుతి= కాంతియొక్క; నికర= సమూహంచేత; కరాళం= విషమోన్నతమైన (ఎత్తైన); అంతరాళం= మధ్యభాగం గలది (బడబాగ్నితో సముద్రంకూడ కదలబారుతున్న రత్నకాంతి రాశియొక్క విషమోన్నత మధుమత్వం అంటే ఒడ్డుమిట్టనేల నడిమితనాన్ని కలిగి వుంటుంది); అంతః... శ్రియ : అంతః= మధ్యభాగమందు; నిశ్శేష= ఏమీ మిగలని; కృష్ణశ్రియం= నలుపు శోభలేనట్టి (కొద్దిగా అసిత శోభతో వున్నట్టి) (సముద్రపక్షంలో బయటకువచ్చిన ఆదిశేషు, కృష్ణ, లక్ష్మీదేవులు కానట్టి అనగా వారు లోపలేవున్నట్టి శేష+కృష్ణ+శ్రియం అని విభాగం); ధ్వాంతరాశిం= చీకటి సమూహాన్ని; ఉదధింఇవ= సముద్రాన్నివలె; పిబన్= త్రాగుతూ (హరించడం); అపూర్వ= మరొకటైన; పూర్వఃఅపి= ప్రాచీనమైనట్టి; ఔర్వః అగ్నిః ఇవ= బడబాగ్నిలాంటి; అర్క+అవభాసః= సూర్యకాంతి; భవత్= మీ యొక్క; అఘప్లుష్టయే= పాపధ్వంసంకోసం; స్తాత్= అగుగాక! (పాపాలను దహించివేయుగాక!)

**తా :** చీకటిరాశి సముద్రంవంటిది. సూర్యకాంతి బడబాగ్నిలాంటిది. సాగరంలో బడబాగ్ని పుట్టినప్పటి లక్షణాలు చీకటికికూడా చెప్పబడ్డాయి. సముద్రంలోని పగడాలకాంతి అప్పుడే ఉదయిస్తున్న అరుణకాంతి (అనూరుడి రంగు). బడబాగ్నివల్ల కల్లోలితమైన రత్న కాంతి నక్షత్రాలది. బడబాగ్నివున్న సాగరగర్భంలో (మధ్యలో) ఆదిశేషుడు, నారాయణ, లక్ష్ములుంటారు. అటువంటి నల్లదనం చీకటిది. అటువంటి చీకటి కడలిని పోటుపెడుతున్న బడబాగ్నిలాంటి ఈ సూర్యకాంతి మీ పాపాలను దహించుగాక!

**అలం :** ఉపమ, శ్లేషలు.

స్ర. గంధర్వైర్గద్యపద్యవ్యతికరితవచో హృద్యమాతోద్యవాద్యై
రాద్యైర్యో నారదాద్యై ర్మునిభి రభినుతో వేదవేద్యైర్విభిద్య,
ఆసాద్యాపద్యతే యం పునరపిచ జగద్యౌవనం సద్య ఉద్య
న్నుద్ద్యోతోద్యోతితద్యౌర్ద్యతుదివసకృతోఽసావవద్యానివోఽద్య. 36

**అవ :** గంధర్వాదులచేత శ్లాఘనీయమైన సూర్యకాంతిని వర్ణిస్తున్నాడు.

**ప్రతి :** యః= ఏదైతే; గద్యపద్య= గద్యపద్యాలచేత; వ్యతికరిత= మిశ్రమమైన; వచోహృద్యం= వాఙ్మనోహరంగా (మనోహరమైన వాక్కులచేత); ఆతోద్యవాద్యైః[1]= చతుర్విధాలయిన వీణ, తాళం, మృదంగం, వేణువులాంటి వాద్యాలు గల; గంధర్వైః= గంధర్వులచేతను; వేదవేద్యైః= వేదములచేత తెలియదగిన; అద్యైః= పురాతనులగు; నారదాద్యైః= నారదుడు మొదలగు; మునిభిః= మునులచేతను; విభిద్య= వేర్వేరుగా (ఆయారీతులు); అభినుతః= కొనియాడబడినదో; యం= దేనిని; ఆసాద్య= పొంది; జగత్= లోకము; పునరపి= విశేషమైన; యౌవనం= తారుణ్యాన్ని (మనోజ్ఞత); సద్యః= వెంటనే; ఆపద్యతే= పొందుతున్నదో; ద్యోతితద్యౌః= ప్రకాశితమైన అంతరిక్షంగల (స్వర్గం); దివసకృత్= దినకరుడైన సూర్యునియొక్క; అసౌ= ఈ; ఉద్యోతః= ప్రకాశము; అద్య= ఇపుడు; వః= మీయొక్క; అవద్యాని= పాపాలను; ద్యతు= ఖండించుగాక! (పాపాలు పోగొట్టుగాక!)

**తా :** ఎవరి వెలుగైతే వీణాదివాద్య సహితంగా, గద్యపద్య మిశ్రిత మనోహరంగా గంధర్వాదులచేతను, పురాతనులు వేదవేద్యులైన నారదాది మహర్షులచేతను గానం చేయబడుతున్నదో; ఏ వెలుగు సోకిన ప్రపంచానికి నూతనయౌవనం కల్గుతుందో అట్టి సూర్యుని ప్రాతఃకాలకాంతి మీ కలుషాలను కడిగివేయుగాక!

**అలం :** అనుప్రాసం. ('ద్య' వర్ణావృత్తి)



**వివ :** 1. భారతదేశంలో ప్రాచీన కాలంనుంచి సంగీతానికి ప్రాధాన్యం వుంది. పాటతో సంగీతవాద్యాలను గూడ జోడించి పాడితేనే అది ఎదుటవారిని ప్రసన్నులను చేస్తుంది. అందుకే ఇక్కడ వాద్యాలు చెప్పబడ్డాయి. తత, వితత, ఆనద్ధ, సుషిరాలను ఆతోద్యాలంటారు. తతమంటే వీణ, కిన్నెర, సైరంధ్రిలాంటి తంత్రీవాద్యాలు. వితతమంటే తాళంలాంటి లోహవాద్యాలు. ఆనద్ధమంటే డోలు, మృదంగంలాంటి చర్మవాద్యాలు. సుషిరమంటే శంఖం, కాహళ, వేణువులాంటి ముఖవాద్యాలు.

"తతం వీణాదికంవాద్యం ఆనద్ధం మురజాదికం, వంశాదికంతు సుషిరం కాంస్య తాలాదికం ఘనం చతుర్విధమిదం వాద్యం వాదిత్రాతోద్య నామకం" అని అమరం.

స్ర. ఆవానైశ్చంద్రకాంతై శ్చ్యుతతిమిరతయా తానవాత్తారకాణా
మేణాంకాలోకపాదుపహతతమసా మోషధీనాం లయేన,
ఆరాదుత్రేక్ష్యమాణా క్షణముదయతటాంతర్హితస్యాహిమాంశో
రాభా ప్రాభాతికీవోఽవతు నతు నితరాం తావదావిర్భవంతీ. 37

**ప్రతి :** ఆవానైః= ఎండిపోతున్న (స్రవించడం మానడంచేత); చంద్రకాంతైః= చంద్రకాంత మణులచేత (చంద్రుడస్తమించుతున్నాడు); చ్యుత= తొలగిపోయిన; తిమిరతయా= చీకటిచేత (రాత్రి అయిపోయింది); తారకాణాం= నక్షత్రాల యొక్క; తానవాత్= కృశించడంవల్ల (కాంతిహీనత); ఏణాంక= చంద్రునియొక్క; ఆలోక= దర్శన; లోపాత్= లేకపోవడంవల్ల; ఉపహత= కోల్పోయిన; తమసాం= చీకటి కలిగిన; (మహసాం= కాంతిగల అని పాఠాంతర పక్షార్థం) ఓషధీనాం= ఓషధీలతలయొక్క; లయేన= విలీనంచేత (చీకటిపోగానే ఓషధీలతలు మాయమౌతాయి); ఆరాత్= దూరంనుంచి; ఉత్రేక్షమాణా= ఊహింపబడుతూ; నతావత్ ఆవిర్భవంతీ= స్పష్టంగా కనబడనటువంటి; క్షణం= క్షణకాలం; ఉదయతట= ఉదయాద్రి అంచున; అంతర్హితస్య= దాగియున్న; అహిమాంశోః= ఉష్ణకిరణుడైన

సూర్యునియొక్క; ప్రాభాతికీ= ప్రభాతకాలపు; ఆభా= కాంతి; వః= మిమ్మల్ని; అవతు= రక్షించుగాక!

**తా :** సూర్యోదయం స్పష్టంగా తోచడం లేదు. అయినా శుష్కించుచున్న చంద్రకాంత మణులనుబట్టి, వీడిపోతున్న చీకటినిబట్టి; ఒక్కొక్కటే అంతర్ధానమౌతున్న చుక్కలనుబట్టి, కాంతిహీనమౌతున్న ఓషధీలతలనుబట్టి ఉదయాద్రి అంచున పొంచివస్తున్న సూర్యోదయకాంతి స్పష్టమౌతున్నది. అటువంటి ప్రాభాతకాంతి మిమ్ము కాపాడుగాక!

**అలం :** దీపకం.

**విశే :** ఏణాంకశబ్ద ప్రయోగం విశేషం. చంద్రునిలో నల్లనిమచ్చ నల్లని జింకకు సంకేతం. సహజంగా ఆవిధంగానే తోస్తుంది చూచేవాళ్ళకు. 'చంద్రా'ర్థంలో 'ఏణాంక' శబ్దప్రయోగం ప్రాచీన గ్రంథాల్లో అంటే భారతాదుల్లో కన్పించడంలేదని పరిశోధకుల అభిప్రాయం. తర్వాతనే ఇది వాడుకలోకివచ్చి వుంటుంది. ఇటువంటిదే 'శశాంక' ప్రయోగంగూడ. అలాగే చంద్రుణ్ణి 'ఓషధీపతి' అనడం పరిశీలనార్హం. చంద్రుడు ఓషధీలతలకు లేక వనస్పతులకు నాథుడనడంలోని నిజాన్ని నిరూపించడం కష్టమే అయినా పుష్పించే కొన్ని వృక్షాలు, లతలు మాత్రం చంద్రుడు అస్తమించగానే ముడుచుకుపోతాయని కొందరి అభిప్రాయం. బహుశా ఈ దృష్టితోనే కవులు 'ఓషధీపతి' అని వ్యవహరిస్తుంటారు.

"యాత్యేకతోఽస్తశిఖరం పతిరోషధీనాం" అని కాళిదాసు. (శాకున్తలం (4-2)

స్ర. **సానౌసానౌ దయే నారుణితదళపునర్యౌవనానాం వనానా**
**మాలీమాలీఢపూర్వా పరిహృతకుహరోపాంతనిమ్నాతనిమ్నా,**
**భా వోఽభావోపశాంతిం దిశతు దినపతేర్భాసమానాసమానా**
**రాజీ రాజీవరేణో స్సమసమయముదేతీవ యస్యా వయస్యా. 38**



**ప్రతి :** యస్యాః= దేనికైతే; సమసమయం= ఏకకాలంలో; ఉదేతి= వెలువడుతున్న; రాజీవరేణోః= పద్మరాగంయొక్క (పుప్పొడి); రాజీ= పంక్తి; వయస్యా ఇవ= సఖివలె (చెలికత్తె); సమానా= తుల్యమో; ఏదైతే; అరుణిత... వనానాం : అరుణిత= సూర్యోదయ కారణంగా ఎఱ్ఱబడిన; దళ= రేకులచేత; పునః= విశేషంగా; యౌవనానాం= తారుణ్యాన్ని పొందిన; వనానాం= అడవులయొక్క; ఆలీం= పంక్తిని; నన ఆలీఢపూర్వా= ముందుగానే స్పృశించినదో (ముందుగా స్పృశించిన అడవులుకలదో); ఏదైతే; ఔదయే= ఉదయ పర్వత సంబంధమైన; సానౌ= చరియలందు; తనిమ్నా= తనయొక్క సూక్ష్మతచేత; పరిహృత... నిమ్నా : పరిహృత= పరిహరింపబడిన; కుహర+ఉపాంత= రంధ్రాలయొక్క ప్రాంతములందలి; నిమ్నా= అగాథాలు కలిగినదో; దినపతేః= పగటి నాథుడైన సూర్యునియొక్క; భాసమానా= ప్రకాశిస్తున్న; సా= ఆ; భా= కాంతి; వః= మీకు; అభావ+ఉపశాంతిం= దారిద్ర్యోపశమనాన్ని; దిశతు= ప్రసాదించుగాక!

**తా :** స్నేహితురాలితో సమానమైన పద్మరాగ పంక్తికలిగి (సూర్యోదయంతో కమలాలు వికసించి పుప్పొడి కన్పిస్తుంది) అందలి అరుణత్వంతో (ఎర్రదనం) నవయౌవనాన్ని పొందినట్లున్న చెట్లను ముందుగా తాకి (పూలు పూచిన చెట్లు కొత్తకాంతితో కళకళలాడుతూ వుంటాయి) ఉదయాద్రి శిఖరంమీద తనయొక్క సూక్ష్మత కారణంగా పర్వత కుహరాల్లోని అగాథత్వాన్ని పారద్రోలేటటువంటి (అంతటా చొచ్చుకొనిపోయే) ప్రాభాతకాంతి మీ దారిద్ర్యాన్ని తొలగించుగాక!

**విశే :** ఈ శ్లోకంలో ప్రతిపాదంలో ఆద్యంతాల్లో ఒకే పదం రెండుసార్లు ఆవృతమై చమత్కారాన్నిచ్చింది. ఇటువంటి పదప్రయోగ వైచిత్రి మయూరుని సహజగుణం. ఈ విన్యాసం తెలుగులో రామరాజభూషణ, చేమకూర, సురభిమాధవరాయల కావ్యాల్లో తరచుగా కనిపిస్తుంది.

స్ర. ఉజ్జృంభాంభోరుహాణాం ప్రభవతి పయసాం యా శ్రియైనోష్ణతాయై
పుష్ణా త్యాలోకమాత్రం నతుదిశతిదృశ్యమానా విఘాతమ్,
పూర్వాద్రేరేవ పూర్వం దివమను చ పునః పావనీ దిఙ్ముఖానా
మేనాం స్త్యైనీ విభా సా నుదతు నుతిపదైకాస్పదం ప్రాక్త నీవః 39

**ప్రతి :** యా= ఏదైతే; ఉజ్జృంభ= వికసించిన; అంభోరుహాణాం= జలరుహాలు (పద్మాలు) కలిగిన; పయసాం= నీటియొక్క; శ్రియై= శోభకోసం; ప్రభవతి= సమర్థమగుచున్నదో; ఉష్ణతాయై= వేడికోసం; న= కావడం లేదో (సరసులకు శోభ చేకూరుస్తుందే గాని తాపాన్నివ్వదు); ఏదైతే; దృశాం= చూపులకు; ఆలోకమాత్రం= ప్రకాశాన్ని మాత్రం; పుష్ణాతి= కలుగజేయునో; దృశ్యమానా= చూడబడుతున్నదై; విఘాతం= బాధను; నతుదిశతు= కలిగించడంలేదో (కంటికి వెలుగునిస్తుందే గాని మంటనివ్వదు); పూర్వం= ముందుగా; పూర్వాద్రేః ఏవ= ఉదయ పర్వతానికిన్నీ; అను= తర్వాత; దివం= అంతరిక్షాన్నీ; పునశ్చ= ఆ తర్వాత; దిఙ్ముఖానాం= దిక్కులయొక్క ముఖాలకు; పావనీ= పవిత్రత నిస్తున్నదో; సా= అటువంటి; నుతిపద+ఏకాస్పదం= స్తోత్రమునకు ప్రధాన అర్హతగలిగిన; ప్రాక్తనీ= ప్రభాతకాలపు; ఐనీ= ఇన (సూర్య) సంబంధమైన; విభా= దీప్తి (వెలుగు); వః= మీయొక్క; ఏనాంసి= పాపాలను; నుదతు= తొలగించుగాక!

**తా :** ఏ సూర్యుని వెలుగైతే వికసిస్తున్న కమలములున్న సరసులకు శోభనిచ్చి వేడి కలుగజేయదో, కనులకు ప్రకాశాన్నిచ్చి మంట కలుగనివ్వదో (చురుకు మంటలు), మొదట ఉదయాద్రికి పిదప అంతరిక్షానికి, తర్వాత దిగంతాలకు పవిత్రత కలుగజేయు స్తోత్రపదైక స్థానమైన అట్టి బాలభానుతేజము మీ పాపాలను పోగొట్టుగాక!

స్ర. వాచాం వాచస్పతే రప్యచలభిదుచితాచార్యకాణాం ప్రపంచై
ర్వైరించానాం తథోచ్చారితరుచిమదృచాం చాననానాం చతుర్ణామ్,



ఉచ్యేతార్చాసువాచ్యచ్యుతిశుచి చరితం యస్య నోచ్చైర్వివిచ్య
ప్రాచ్యం వర్చ శ్చకాసచ్చిరముపచినుతాత్తస్య చండార్చిషో వః 40

**ప్రతి :** అచలభిత్= పర్వతభేదియైన ఇంద్రునకు; ఉచిత= యోగ్యమైన; ఆచార్యకాణాం= గురుత్వంగల; వాచస్పతేః= వాక్కుల కధిపతియైన బృహస్పతియొక్క; వాచాం= వాక్కుల యొక్క; ప్రపంచైః= విస్తారములచేతను (ఆధిక్యం); మరియు : తథా= అట్లు; ఉచ్చారిత= ఉచ్చరింపబడిన (పాపాలను పోగొట్టడంలో సమర్థములైన); రుచిమత్= మనోహరములయిన; ఋచాం= ఋక్కులు కలిగిన; వైరించానాం= బ్రహ్మసంబంధమైన; చతుర్ణాం ఆననాంచ= నాలుగు ముఖాలయొక్క; ప్రపంచైః= విస్తారములచేత; యస్య= ఎవరియొక్క; వాచ్యచ్యుతి= నిర్దుష్టతచేత; శుచిః= శుభ్రమైన; చరితం= అనుష్ఠానం; అర్చాసు= పూజాసమయంలందు; ఉచ్చైః= మిక్కిలి; వివిచ్య= విడమరచి (విపులంగా); నఉచ్యేత= పల్కుటకు శక్తిచాలదో (బృహస్పతి విరించులకు గూడ చెప్పసాధ్యంగాని అనంతత్వం కల్గింది భానూదయం అని ఉద్దేశం); చండార్చిషః= తీక్ష్ణకిరణుడైన; తస్య= ఆ సూర్యునియొక్క; చకాసత్= ప్రకాశిస్తున్న; ప్రాచ్యం= తూర్పుదిక్ సంబంధమైన (ప్రాచీనమైన); వర్చః= వెలుగు; వః= మిమ్మల్ని; చిరం= చిరకాలం; ఉపచినుతాత్= వృద్ధి పొందించుగాక!

**తా :** దేనియొక్క పవిత్రచరిత్రం పూజాసమయంలందు ఇంద్రునికి ఆచార్యకత్వం వహించు బృహస్పతికీ, చతుర్ముఖుడైన బ్రహ్మకుసైతం వర్ణింపసాధ్యం కాదో అటువంటి చండభానుడైన సూర్యునియొక్క తేజస్సు మీకు శాశ్వతమైన అభివృద్ధిని కలిగించుగాక!

**అలం :** అనుప్రాస. ('చ'కారావృత్తి)

స్ర. మూర్ధ్న్యద్రేర్ధాతురాగస్తరుషుకిసలయో విద్రుమౌఘ స్సముద్రే
దిఙ్మాతంగోత్తమాంగే ష్వభినవనిహిత స్సాంద్రసిందూరరేణుః,

**సీమ్ని వ్యోమ్నశ్చ హేమ్నస్సురశిఖరిభువోజాయతే యః ప్రకాశః,**
**శోణిమ్నాసౌ ఖరాంశోరుషసి దిశతు వ శ్శర్మ శోభైకదేశః. 41**

**ప్రతి :** అద్రేః= ఉదయాద్రియొక్క; మూర్ధ్ని= శిఖరమందు; ధాతురాగః= కావిరంగును; తరుషు= చెట్లయందు; కిసలయరాగః= చిగురుటాకుల రంగును; సముద్రే= సముద్రమందు; విద్రుమ+ఓఘః= పగడాలగుంపు రంగును (ఎరుపు); దిఙ్మాతంగ= దిగ్గజాలయొక్క; ఉత్తమాంగేషు= శిరసులందు (కుంభస్థలాలమీద); అభినవ= నూతనంగా; నిహిత= ఉంచబడిన; సాంద్ర= దట్టమైన; సిందూర రేణుః= చెందిరపు ధూళిని (ఎఱువు); వ్యోమ్నఃసీమ్ని= ఆకాశపు పొలిమేరయందు (గగనం); సురశిఖరిభువః= మేరుపర్వత భూమియొక్క; హేమ్నశ్చ= సువర్ణకాంతుల; ప్రకాశః= శోభయుకలిగి; శోణిమ్నా= రక్తవర్ణముతో; యః= ఏదైతే; ఉషసి= ప్రాతఃకాలమందు; జాయతే= ఉదయిస్తుందో; ఖరాంశోః= తీక్ష్ణకిరణుడైన సూర్యుని యొక్క; శోభ+ఏకదేశః= శోభలోని ఒక భాగమైన; అసౌ= ఈ; ప్రకాశః= వెలుగు; వః= మీకు; శర్మ= సుఖాన్ని; దిశతు= ప్రసాదించుగాక! (ఇచ్చుగాక!)

**తా :** ఉదయపర్వత శిఖరములందు జేగురురంగు, వృక్షములందు చిగురుటాకులరంగు, సముద్రములందు పగడాలవన్నె; దిగ్గజాల కుంభస్థలాల్లో చెందిరపువన్నె, గగనంలో మేరుపర్వతపు సువర్ణచ్ఛాయలు కలిగి ఏదైతే రక్తవర్ణముతో ఉషఃకాలమున పుడుతున్నదో అటువంటి శోభలోని అంశమాత్రపు అరుణకాంతి మీకు సుఖమిచ్చుగాక!

**విశే :** సూర్యకాంతికి ఆశ్రయభేదం వున్నప్పటికీ స్వరూపభేదం లేదు.

ప్ర. **అస్తాద్రీశోత్తమాంగే శ్రితశశిని తమఃకాలకూటే నిపీతే**
**యాతే వ్యక్తిం పురస్తాదరుణకిసలయే ప్రత్యుషఃపారిజాతే,**
**ఉద్యన్త్యారక్తపీతాంబరవిశదతరోదీక్షితా తీక్ష్ణభానో**
**ర్లక్ష్మీర్లక్ష్మీరివాస్తు స్ఫుటకమలపుటోపాశ్రయా శ్రేయసే వః. 42**



**అవ :** సూర్యశోభ లక్ష్మీదేవిలాంటిదని చెబుతున్నాడు.

**ప్రతి :** అస్తాద్రి+ఈశ+ఉత్తమాంగే= అస్తాద్రియను శివుని శిరస్సుపై; శ్రిత= అధిష్ఠించిన; శశిని= చంద్రుడు; తమఃకాల కూటే= కాలకూట విషంలాంటి చీకటిని; నిపీతే= మింగగా (చీకటి మాయమైనది. శివుటు కాలకూట విషాన్ని మింగినవిధంగా అస్తాద్రియందు చంద్రుడు చీకటిని మింగాడు); అరుణకిసలయే= అరుణుడను చిగురుటాకు కలిగి; ప్రత్యుషః పారిజాతే= ఉషఃకాలమనే పారిజాతవృక్షము; పురస్తాత్= ముందుగా; వ్యక్తం= స్పష్టతను; యాతే= పొందగా; ఆరక్తపీత= కొద్దిగా ఎరుపు పసుపు రంగులతో; అంబర= ఆకాశమందు విశదతర= అతివిస్తారముగా; ఉద్వీక్షితా= చూడబడినదై; (అరక్త= అనురక్తుడైన, పీతాంబర : శ్రీ మహావిష్ణువు చేత); విశదతర= స్పష్టంగా; ఉద్వీక్షితా : చూడబడినదని లక్ష్మీపక్షం) పురస్తాత్ తూర్పు= దిక్కునుండి; ఉద్యన్తీ= పుట్టుచున్న; స్ఫుట= వికసించిన; కమలపుట+ ఆశ్రయా= కమలదళములు ఆశ్రయము కలిగి (కమలవికాసము కమల నివాసము); తీక్ష్ణభానోః= చండకిరణుడైన సూర్యునియొక్క; లక్ష్మీః= శోభ; లక్ష్మీఃఇవ= ఆ లక్ష్మీదేవిలాగ; వః= మీయొక్క; శ్రేయసే= మంచికోసం; అస్తు= అగుగాక!

**తా :** తలపైని చంద్రుడుగల అస్తాచలమను ఈశ్వరుడు చీకటి అనే విషాన్ని మ్రింగగా లేక అస్తాద్రియనే ఈశ్వరుని తలపైన ఉన్న కారణంగా చంద్రుడు కాలకూట విషంలాంటి చీకటిని మింగగా; ఉషఃకాలమనే పారిజాతవృక్షం అరుణుడనే (అనూరుడు) చిగురుటాకు వన్నె ప్రదర్శించగా; కొద్దిగా ఎరుపు పసుపువన్నె గల్గి చూడబడిన (అనురక్తుడైన విష్ణువుచేతవలె) వికసిత కమలదళాశ్రితయైన భానునికాంతిలక్ష్మి మీకు శ్రేయస్సులొసగుగాక!

**అలం :** రూపకానుప్రాణిత శ్లేష, ఉపమ.

**విశే :** ఇక్కడ లక్ష్మీదేవికి సూర్యకాంతికి రూపకానుప్రాణితశ్లేషతో సాదృశ్యం చెప్పాడు కవి. క్షీరసాగరమథనంలో చంద్రుడు పుట్టగానే శివుడు తలపువ్వులా

సింగారించుకున్నాడు. హాలాహలం పుట్టగానే లోకోపకారార్థం కంఠంలో దాచుకున్నాడు. తర్వాత పారిజాతం కిసలయాలతో పుట్టుకొచ్చింది. తర్వాత లక్ష్మీదేవి పుట్టగా ఆమెకోసం మహావిష్ణువు నిరీక్షించాడు. ఆ సమయంలో ఆమె వికసించిన కమలాన్ని ఆశ్రయించింది. ఇదే క్రమం సూర్యకాంతి పక్షాన వస్తుంది. ఆ పక్షంలో శివుడు అస్తాద్రి. సూర్యోదయంతో చంద్రుడస్తమిస్తాడు. అంటే అస్తాద్రికి చేరుకుంటాడు. విషము చీకటి. భానూదయంతో అస్తాద్రి గుహలలో దాగివుంటుంది చీకటి. పారిజాతం ఉషఃఖాలం. పారిజాతానికి పూచిన కిసలయాలు ఉషస్సులో మొదటగా కన్పించే అరుణుని ఎఱ్ఱదనం. సూర్యోదయంకాగానే అది కొద్దిగా ఎరుపు, పచ్చవర్ణాలతో వున్న ఆకాశంలో స్పష్టంగా చూడబడుతుంది. ఇక్కడ అస్తాద్రీశ, తమఃకాలకూట, అరుణకిసలయ, ప్రత్యుషఃపారిజాత, ఆరక్త పీతాంబర శబ్దాలు రూపకానుప్రాణిత శ్లిష్టాలు. అందులోని అరుణ, ఆరక్తపీతాంబరాలు మరింత చమత్కారజనకాలు.

శ్ర. **నోదన్వాఞ్జన్మభూమి ర్న తదుదరభువో బాంధవాః కౌస్తుభాద్యాః**
**పాణౌ పద్మం న యస్యా నచ నరకరిపూరస్థలీ వాసవేశ్మ,**
**తేజోరూపాపరైవ త్రిషు భువనతలే ష్వాదధానావ్యవస్థాం**
**సా శ్రీః శ్రేయాంసి దిశ్యా దశిశిరమహసో మండలాగ్రోద్గతా వః॥ 43**

**అవ :** సూర్యకాంతి లక్ష్మి శ్రీలక్ష్మికంటె విలక్షణమైన దంటున్నాడు.

**ప్రతి :** యస్యాః= దేనికైతే; ఉదన్వాన్= సముద్రము; జన్మభూమిః= జన్మస్థలము; న= కాదో; తత్+ఉదరభవః= ఆ సముద్ర గర్భంలో పుట్టిన; కౌస్తుభ+ఆద్యాః అపి= కౌస్తుభాదిహారాలుకూడ; బాంధవాః న= బంధువులుకావో; పాణౌ= చేతియందు; పద్మం న= కమలములేదో; నరకరిపు= నరకాసురునికి శత్రువైన; విష్ణువుయొక్క ఉరఃస్థలీ= వక్షఃస్థలము; వాసవేశ్మ= నివాసగృహము; నచ= కానేకాదు; త్రిషుభువనతలేషు= ముల్లోకాల్లో; వ్యవస్థాం= స్థితిని; ఆదదానా= కలిగివున్నట్టి; అపరా ఏవ= మరొకటైనట్టి (విలక్షణమైన); తేజోరూపా= కాంతిస్వభావంగల; అశిశిరమహసః= తీక్ష్ణ కాంతిగల సూర్యునియొక్క; మండలాగ్ర+ఉద్గతా= మండల ప్రాంతమున ఉదయించిన; సా= ఆ; శ్రీ= సూర్యకాంతి లక్ష్మీ; వః= మీకు; శ్రేయాంసి= శుభాలను; దిశ్యాత్= కల్గించుగాక! (ఇచ్చుగాక!)



**తా :** సూర్యుని కాంతిలక్ష్మి, లక్ష్మీదేవికంటె విలక్షణమైనది. సముద్రజననం, కౌస్తుభాదుల ధారణం, కమలస్వీకారం, విష్ణువక్షఃస్థల నివాసం కాంతిలక్ష్మికి లేవు. అయినప్పటికీ లక్ష్మీదేవికిలేని ముల్లోకస్థితి కాంతిలక్ష్మికి వుంది. అటువంటి కాంతిలక్ష్మి మీకు శుభాలను ప్రసాదించుగాక!

**అలం :** వ్యతిరేకం.

**విశే :** ఎన్ని అండదండలున్నా లక్ష్మీదేవికిలేని ఉత్కృష్టత (ముల్లోక స్థితి) ఏమీ అండలేని సూర్యకాంతికున్నదంటూ కవి వ్యతిరేకాలంకారంలో చమత్కరించాడు.

***ఇంతటితో 'బాలప్రభ'తో కూడిన 'ప్రభావర్ణనం' ముగిసింది.***

* * *

# అశ్వవర్ణనమ్

స్ర. రక్షంత్వక్షుణ్ణహేమోపలపటల మలం లాఘవాదుత్పతంతః
పాతంగాః పంగ్వవజ్ఞాజితపవనజవా వాజిన స్తే జగంతి,
యేషాం వీతాన్యచిహ్నోన్నయ మపి వహతాం మార్గమాఖ్యా తిమేరా
వుద్యన్నుద్దామదీప్తిద్యుమణి మణిశిలావేదికా జాతవేదాః. 44

**అవ :** సూర్యునియొక్క అశ్వాలు ఏడు. వాటిని ఆరు శ్లోకాల్లో వర్ణిస్తున్నాడు.

**ప్రతి :** లాఘవాత్ : లఘుత్వంవలన (చిన్నవికావడంవల్ల లేక దూకడంలోని నేర్పువల్ల); అక్షుణ్ణ= చూర్ణితంకాని (బాగా నలిగిపోని); హేమ+ఉపల= బంగారుశిలల యొక్క; పటలం= సమూహము కలిగి; అలం= మిక్కిలి; ఉత్పతంతః= దూకుతున్నటువంటివి (దూకడం వలన అనికూడ); పంగు= కుంటివాడైన అనూరునియొక్క; అవజ్ఞ= ఎగతాళిచేత (హేళనచే రోషంవచ్చి); జిత= జయింపబడిన; పవన జవాః= వాయువేగం కల్గినటువంటివి[1]; వీత= పోగొట్టబడిన; అన్య చిహ్న= ఇతర చిహ్నాలయొక్క; ఉన్నయమపి= మార్గము కలిగినప్పటికీ (వేరేదారి గుర్తులేవీ లేవని భావం); ఉద్యన్= పైకి వెడలుతున్న (నిర్గమించడం); ఉద్దామదీప్తిః= ప్రాజ్య ప్రకాశముగల (గొప్ప వెలుగు); ద్యుమణి మణి= సూర్యకాంతి మణులయొక్క; శిలావేదికాః= రాతి తిన్నెలందలి; జాతవేదాః[2]= అగ్నికాంతులు; యేషాం= ఏ; వహతాం= వాహనాలకు; మేరౌ= మేరుపర్వతమందు; మార్గం= దారిని; ఆఖ్యాతి= చెబుతున్నదో (దారిచూపుతున్నదో); తే= ఆ; పాతంగాః= సూర్య సంబంధమైన; వాజినః= గుఱ్ఱాలు; జగంతి= లోకాలను; రక్షంతు= రక్షించుగాక!

**తా :** బాగా చిన్నవి కావడంవల్ల బంగారుశిలలు నలిగిపోని రీతిలో ప్రయాణిస్తూ అనూరునిచే హేళన చేయబడి వాయువేగంతో దూకుతూ పర్వతంమీద వేరేదారి లేకపోయినప్పటికీ, (వేగంలో తెలియకపోవడం)



సూర్యుని వేడికిరణాలు శిలలందలి అగ్ని మేరుపర్వతంమీద దారి చూపుతుండగా ప్రయాణం చేస్తున్న సూర్యాశ్వాలు మిమ్మల్ని కాపాడుగాక!

**వివ :** 1. నీకు కాళ్లులేవు నీవేం పరుగెత్తుతావు అని గాలిని ఎగతాలి చేసినట్టి, లేక అనూరుణ్ణి (పక్షిజాతి కదా) అవమానంచేసే గాలిని జయించినట్టి అనికూడ చెప్పుకోవచ్చు.

2. జాతవేదస్ అంటే అగ్ని. వేదాలు అగ్నికోసమే పుట్టాయి. అందుకే అగ్నికి ఆ పేరు వచ్చిందని భారతంలో చెప్పబడింది.

పావనాత్పావకశ్చాసి వహనాద్ధవ్యవాహనః

"వేదా స్త్వదర్థం జాతావై జాతవేదస్ తతో హి అసి". భారతం 2-31-42

స్ర. ప్లుష్టాః పృష్ఠేఽంశుపాతై రతినికటతయా దత్తదాహాతిరేకై
రేకాహాక్రాంత కృత్స్నత్రిదివపథపృథుశ్వాసశోషాః శ్రమేణ,
తీవ్రోదన్యాస్త్వరంతా మహితవిహతయే సప్తయస్సప్తసప్తే
రభ్యాశాకాశగంగాజలసరళగళావాఙ్నతాగ్రాననా వః. 45

**ప్రతి :** అతినికటతయా= మిక్కిలి దగ్గరగా వుండడంచేత; దత్తదాహ+అతిరేకైః= ఇవ్వబడిన తాపాధిక్యం గలిగిన (తాపాన్ని కలిగించే); అంశుపాతైః= కిరణ ప్రసారాలచేత; పృష్ఠే= వీపుమీద; ప్లుష్టాః= దగ్ధములైనట్టివై; శ్రమేణ= శ్రమచేత; ఏక+అహ= ఒక్క రోజులోనే; ఆక్రాంత= ఆక్రమింపబడిన; కృత్స్న= పరిపూర్ణమైన; త్రిదివపథ= ఆకాశమార్గముకలిగి; పృథుశ్వాస= గొప్ప ఊపిరిచేత (రొప్పడంచేత); శోషాః= అలసట చెందినవీ; తీవ్ర+ఉదన్యాః= మిక్కిలి దప్పికగొన్నవై; అభ్యాశ= బాగా దగ్గరగావున్న; ఆకాశగంగాజల= ఆకాశగంగయొక్క నీటియందు; సరళ= ఋజువైన; గళ= మెడలచేత; ఆవాఙ్నత= అధోగతములయిన (క్రిందికి వంచబడిన); అగ్ర+ఆననాః= ముఖాగ్రములు కలిగినవీ అయిన (దప్పికతో గంగలో మెడలు దించినవి); సప్తసప్తేః= సూర్యునియొక్క; సప్తయః= గుఱ్ఱాలు; వః= మీయొక్క; అహిత=

పాపాలయొక్క విహతయే= ధ్వంసంకోసం; త్వరంతాం= వేగిరపడుగాక! (వెంటనే మీ పాపాలు పోగొట్టుగాక!)

**తా :** మిక్కిలి తాపాన్ని కలుగజేయు సూర్యకిరణాలు వీపుకి బాగా దగ్గరగా వుండడంచేతను, ఒక్కరోజులోనే ఆకాశమంతా ప్రయాణం చేయవలసి రావడంవల్లా, అలసట కలిగి దప్పికతో ఆకాశ గంగాజలంకోసం ముట్టెలు వంచిన సూర్యాశ్వాలు మీ పాపాలు తొలగించుగాక!

స్ర. **మత్వాన్యాన్పార్శ్వతోఽశ్వాన్ స్ఫటికమణిదృషద్దృష్టదేహాద్రవంతీ**
**వ్యస్తేఽహన్యస్తసంధ్యేయమితి మృదుపదా పద్మరాగోపలేషు,**
**సాదృశ్యా దృశ్యమూర్తి ర్మరకతకటకే క్లిష్టసూతా సుమేరో**
**ర్మూర్ధన్యావృత్తిలబ్ధద్రుతగతిరవతా ద్బ్రధ్నవాహావళి ర్వః. 46**

**ప్రతి :** సుమేరోఃమూర్ధని= మేరుపర్వత శిఖరంమీద; స్ఫటిక మణి= స్ఫటిక మణులతోకూడిన; దృషత్= రాళ్ళయందు; దృష్ట= చూడబడిన; దేహా= శరీరాలు కలదీ (స్ఫటిక మణులందు ప్రతిఫలిస్తుంది కాబట్టి); పార్శ్వతః= అటు ఇటు; అన్యాన్ అశ్వాన్= ఇతర గుఱ్ఱాలుగా; మత్వా= తలచి; రోషంతో; ద్రవంతీ= పరుగెత్తుతున్నట్టియూ; పద్మరాగ+ఉపలేషు= పద్మరాగ మణులున్న ప్రదేశాల్లో; అహని వ్యస్తే= సాయంత్రంకాగా; అస్త= అస్తమించిన; సంధ్యా= సంధ్యయైనది; ఇతి= అని; మృదుపదా= మందగించిన వదవిన్యాసం కలిగినదియూ అప్పుడే సాయంత్రం అయిందా అని); మరకతకటకే= మరకత (ఆకుపచ్చని మణులు) ప్రదేశాల్లో; సాదృశ్య= సమానవర్ణంచేత (గుఱ్ఱాలు గూడ పచ్చగా వుంటాయి); అదృశ్యమూర్తిః= కన్పించని ఆకారం గల్గి (రంగులో రంగు కలిసిపోవడం వల్ల); క్లిష్ట= కష్టపెట్టబడిన; సూతా= సారథియైన అనూరుడు కల్గినదియూ అయిన; ఆవృత్తి= పునఃపునః అభ్యాసంచేత; లబ్ధ= పొందబడిన; ద్రుతగతిః= శీఘ్రగమనం కలిగిన; బ్రధ్నవాహావళిః= సూర్యాశ్వములపంక్తి; వః= మిమ్మల్ని; అవతాత్= కాపాడుగాక!



**తా :** సూర్యునియొక్క గుఱ్ఱాలు మేరు పర్వతంమీదుగా ప్రయాణించేటప్పుడు అక్కడున్న తెల్లటి స్ఫటికాల్లో ప్రతిఫలించిన తమ నీడలను చూచి వాటిని వేరే గుర్రాలుగా భావించడం జరిగి రోషంతో బాగా దూకుతున్నాయి. అలాగే ఎర్రని పద్మరాగ మణులున్నచోట అప్పుడే సాయంసంధ్యయైనదా అని నడక మందగిస్తున్నాయి. ఆకుపచ్చని మరకత ప్రదేశాల్లో వీటి ఆకారం కన్పించక అనూరుడు యిబ్బంది పడుతున్నాడు. అయినా అలవాటు ప్రకారం వేగంగా దూసుకుపోతున్న ఈ సూర్యుని గుర్రాలు మిమ్మల్ని కాపాడుగాక!

స్ర. **హేలాలోలం వహంతీ విషధరదమనస్యాగ్రజేనావకృష్టా**
**స్వర్వాహిన్యా స్సుదూరం జనితజవజయా స్యందనస్య స్యదేన**
**నిర్వ్యాజం తాపమానే హరితరుచినిజస్ఫీతఫేనాహితశ్రీ**
**రశ్రేయాంస్యశ్వపఙ్క్తిశ్శమయతు యమునేవాపరా తాపనీవః 47**

**ప్రతి :** విషధరదమనస్య= నాగుల మదమణచిన గరుత్మంతుని యొక్క (కృష్ణునియొక్క, కాళియమర్దనుడు); అగ్రజేన= సోదరుడైన అనూరునిచేత (బలరామునిచేత); అవకృష్టా= పగ్గాలు లాగబడినదై (బలవంతంగా నాగలిచేత దారితీయబడినదై); హేలాలోలం= విలాసచంచలముగా; వహంతీ= వెళ్ళుతున్నట్టియు; స్యందనస్య= రథంయొక్క; స్యదేన= వేగంచేత; స్వర్వాహిన్యాః= గంగానది యొక్క; సుదూరం= పూర్తిగా; జనితజవజయా= చేయబడిన వేగంయొక్క తిరస్కారం కల్గినదీ (గంగీనదిని వేగముచేత చాలా దూరం అధిగమించినట్టి); నిర్వ్యాజం= నిష్కపటముగా (యథార్థంగా); తాపమానే= తపింపజేయబడుతుండగా (అలసటచేత ఏర్పడిన); నిజ= తనదైన; హరితరుచి= పచ్చని రంగునందు; స్ఫీత= వెలువడిన (ముఖం నుంచి); ఫేన= నురుగుచేత; అహిత= చేయబడిన (ఏర్పడిన); శ్రీః= శోభ కల్గినదీ; అపరాయమునాఇవ= మరొక యమునవంటి; తాపనీ= సూర్యునియొక్క; అశ్వపంక్తిః= గుర్రాల వరుస; వః= మీయొక్క; అశ్రేయాంసి= అశుభాలను; శమయతు= ఉపశమింపజేయుగాక!

**తా :** యమున బలరామునిచేత బృందావనం వైపునకు తీసుకురాబడింది[1]. గుర్రాల వరుస అనూరునిచేత పగ్గాలు లాగబడింది. పచ్చని నురుగుతోటి యమున గంగానదిని వేగంలో మించిపోయినట్లే ఇదికూడ నురుగులు కక్కుతూ రథవేగంచేత ఆకాశగంగని అధిగమించింది. ఈ విధంగా అపర యమునలాంటి సూర్యాశ్వపంక్తి మీ అశుభాలను తొలగించుగాక!

**అలం :** శ్లేష, ఉపమ.

**వివ :** 1. బలరాముడు ఒకసారి తాగి మత్తువదిలించుకోడానికి స్నానం చేద్దామని దూరంగా కనిపిస్తున్న యమునానదిని దగ్గరకు రమ్మన్నాడు. యమున రాలేదు. కోపంతో తన నాగలిచేత పాయతీసి దాన్ని బృందావనంవైపు బలవంతంగా మళ్ళించాడు అని విష్ణుపురాణం.

శ్ర. **మార్గోపాంతే సుమేరో ర్నువతికృతనతౌ నాకధామ్నాం నికాయే**
**వీక్ష్య వ్రీడావతీనాం ప్రతికుహరముఖం కిన్నరీణాం ముఖాని,**
**సూతేఽసూయత్యపీషజ్జడగతి వహతాం కంధరాగ్రైర్వలద్భి**
**ర్వాహానాం వ్యస్యతాద్వ స్సమమసమహరేర్హేషితం కల్మషాణి. 48**

**ప్రతి :** సుమేరోః= మేరుపర్వతంయొక్క; మార్గ+ఉపాంతే= మార్గసమీపంలో; కృతనతౌ= నమస్కారంచేస్తున్న; నాకధామ్నాం= స్వర్గవాసులైన దేవతలయొక్క; నికాయే= సమూహము; నువతి= పొగుడుతుండగా (అశ్వాలు వస్తున్నప్పుడు మార్గమధ్యంలో దేవతలు పొగుడుతున్నారు); ప్రతికహరముఖం= పర్వతగుహ ప్రవేశద్వారాల్లో నిలుచుండి చూస్తున్న; వ్రీడావతీనాం= సిగ్గరులయిన; కిన్నరీణాం= అశ్వముఖులయిన కాంతలయొక్క; ముఖాని= వదనాలను; వీక్ష్య= చూచి; సూతే= సారధి అసూరుడు; అసూయత్యపి= కోప్పడినప్పటికీ; వలద్భిః= మరల్చిన; కంధరాగ్రైః= మెడల అంచులుగల; ఉషత్= కొద్దిపాటి; జడగతి= మందగమనంతో; వహతాం= నడుస్తున్న; అసమ హరేః= విషమాశ్వుడైన (ఏడుసంఖ్యతో) సూర్యునియొక్క; వాహానాం= గుర్రాలయొక్క;



హేషితం= శబ్దవిన్యాస్ (సకిలింపు); వః= మీయొక్క; కల్మషాణి= కలుషాలను; సమం= ఏకకాలంలో (ఒకేసారి); వ్యస్యతాత్= తొలగించుగాక!

**తా :** సూర్యుడి గుర్రాలు మేరుపర్వతంగుండా ప్రయాణించేటప్పుడు దేవతలు ప్రణామాలు చేస్తూ స్తోత్రం చేస్తారు. కిన్నెరస్త్రీలు సూర్యోదయాన్ని చూడాలన్న కోరికతో సిగ్గుతో పర్వతగుహాగ్రములందు నిలబడి చూస్తుంటారు. వారిని చూచి మందగమనంతో నడుస్తున్న గుర్రాలు అనూరుడు ఎంత అదిలించినా లాభం లేకపోయింది. అటువంటి గుర్రాలు మీ పాపాలు పోగొట్టుగాక!

**విశే :** సూర్యశతకం స్తోత్రకావ్యం. అందువల్ల ఇందులో శృంగారం ఉండడానికి అవకాశం లేదు. కాని మయూరుడు ఇక్కడ శృంగారపరమైన చమత్కారం చేయడం గమనార్హం. సూర్యుడు వచ్చేటప్పుడు దేవతలంతా నమస్కారం చేస్తుంటే వాళ్ళతోపాటు వచ్చిన కిన్నెర స్త్రీలు పర్వతగుహల చాటున అంతఃపురకాంతల మాదిరిగా పొంచివుండి సూర్యాశ్వాలను చూస్తున్నారు (కిన్నరులంటే అశ్వముఖ జాతి). వాళ్ళనుచూస్తూ సూర్యుని గుర్రాలు మెడలు పక్కకు తిప్పి బలవంతంగా అంటే ఇష్టంలేక పోలేకపోలేక పోతున్నాయి. ఇదంతా చూచి అనూరుడికి కోపంవచ్చి అదిలించాడు. అయినా లాభంలేదట. సహజమైన సన్నివేశానికి రూపకల్పన చేశాడు మయూరుడు.

శ్ర. **ధున్వంతో నీరదాళీర్నిజరుచిహరితాః పార్శ్వయోః పక్షతుల్యా**
**స్తాలూత్తానైః ఖలీనైః ఖచితముఖరుచ శ్చ్యోతతా లోహితేన,**
**ఉడ్డీయేవ వ్రజంతో వియతి జవవశా దర్కవాహాః క్రియాసుః**
**క్షేమం హేమాద్రిహృద్య ద్రుమశిఖరశిరశ్శ్రేణిశాఖాశుకావః ॥ 49**

**అవ :** సూర్యాశ్వాలు పచ్చగా వుంటాయి కాబట్టి చిలుకలతో పోలుస్తున్నాడు.

**ప్రతి :** పార్శ్వయోః= వచ్చేటప్పుడు ప్రక్కలందు (ప్రసరించిన); నిజరుచి= తమ కాంతిచేత; హరితాః= పచ్చబడినట్టి; పక్షతుల్యాః= పక్షి రెక్కలలాంటి;

నీరదాళీః= మేఘపంక్తిని; ధున్వంతః= కదిలించుతున్నవియూ; తాలూత్తానైః= దవడ వెలుపల (పైపైన) వున్నట్టి; ఖలీనైః= కళ్ళెములచేత; చ్యోతతా= స్రవిస్తున్న; లోహితేన= రక్తంచేత; ఖచితముఖరుచః= తాపబడిన ముఖశోభ కల్గినవియూ (ఎర్రని ముఖాలు లేక ముక్కులు); వియతి= ఆకాశమందు; జవవశాత్= వేగంవలన; ఉడ్డీయఇవ= ఎగరడంవలె; వ్రజంతః= సాగిపోతున్నట్టివియూ అయిన; హేమ+అద్రి= మేరు పర్వతమనెడి; హృద్య= మనోహరమైన; ద్రుమ= చెట్లయొక్క; శిఖరశిరశ్రేణి= శిఖరాగ్రముల పంక్తి అనెడి; శాఖాః= కొమ్మలు గలిగిన; శుకాః= చిలుకలులాంటి; అర్కవాహాః= సూర్యుని వాహనాలైన గుర్రాలు; వః= మీకు; క్షేమం= కుశలము; క్రియాసుః= చేయుగాక!

**తా :** చిలుకలు తమ పచ్చని రెక్కలు విదల్చుకొని ఎర్రని ముక్కులతో ఒక్కసారిగా ఆకాశంలోకి ఎగురుతాయి. చెట్ల నాశ్రయిస్తాయి. అదేవిధంగా గుర్రాలు తమ కాంతిపడి పచ్చనయిన కదులుతున్న మేఘాలనే రెక్కలను తాల్చాయి. కళ్ళెములు కదిలి రక్తంకారి ముఖాలు ఎర్రబడి చిలుక ముక్కుల్లా తయారయ్యాయి. మేరుపర్వత శిఖరాగ్రం అనే చెట్టుకొమ్మమీద ఆశ్రయాన్ని పొందిన సూర్యాశ్వాలనెడి చిలుకలు మీకు క్షేమాన్ని కలుగజేయుగాక!

**అలం :** రూపకానుప్రాణిత, ఉపమ.

***ఇంతటితో 'బాలప్రభ' తో కూడిన 'అశ్వవర్ణణం' ముగిసింది.***

* * *

# అనూరువర్ణనమ్

**స్ర. ప్రాతశ్శైలాగ్రరంగే రజనియవనికాపాయసంలక్ష్యలక్ష్మీ
ర్విక్షిప్యాపూర్వపుష్పాంజలి ముడునికరం సూత్రధారాయమాణః,
యామేష్వంకేష్వివాహ్నః కృతరుచిషు చతుర్ష్వేవ లబ్ధప్రతిష్ఠా
మవ్యాత్ప్రస్తావయన్వో జగదటనమహానాటికాం సూర్యసూతః. 50**

**అవ :** ఇకనుంచి పన్నెండు శ్లోకాల్లో సారథివర్ణన చేస్తున్నాడు. సూర్యోదయ నాటకానికి సూత్రధారిత్వం చెప్పబడుతున్నది.

**ప్రతి :** ప్రాతఃశైలాగ్రరంగే= ఉదయాద్రిఖరమనే రంగస్థలంమీద; రజని= చీకటి అనెడి; యవనికాపాయ= తెరతొలగించిన కారణంగా; సంలక్ష్య= చూడదగిన; లక్ష్మీః= శోభ కలిగినట్టి; ఉడునికరం= నక్షత్రరాశిని; అపూర్వ పుష్పాంజలిం= అనిదంపూర్వమైన పూలదోసిలిగా; విక్షిప్య= సమర్పించి; సూత్రధారాయమాణః= సూత్రధారిత్వం నెరపుతున్నట్టి; కృతరుచిషు= కాంతిమంతములయిన; అహ్నః యామేషు= పగటిజాములను; చతుర్షు అంకేషు ఏవ= నాలుగు అంశములందు మాత్రమే; లబ్ధప్రతిష్ఠా= ఉన్నతస్థితి కలిగిన; జగత్+అటన= లోకసంచారమనెడి; మహానాటికాం= గొప్ప నాటకాన్ని; ప్రస్తావయన్= ప్రారంభిస్తున్నట్టి; సూర్యసూతః= సూర్యసారథి అనూరుడు; వః= మిమ్మల్ని; అవ్యాత్= రక్షించుగాక!

**తా :** అనూరుడు సూర్యోదయుల అనే నాటకాన్ని ప్రారంభించు సూత్రధారునిలా వున్నాడు. తూర్పుపర్వత శిఖరమనే రంగస్థలం మీద చీకటి అనే తెర తొలగించగానే నక్షత్ర వికీర్ణమనే (చెల్లాచెదురు) పుష్పాంజలిని సమర్పించి నాలుగు జాములనే నాలుగు అంకాల్లో ప్రస్తావన చేస్తున్న సూత్రధారుడైన సూర్యసారథి అనూరుడు మిమ్మల్ని కాపాడుగాక!

**అలం :** ఉపమ, రూపకం.

ప్ర. ఆక్రాంత్యావాహ్యమానంపశుమివహరిణావాహకోఽగ్ర్యోహరీణాం
భ్రామ్యంతరం పక్షపాతాజ్జగతి సమరుచి స్సర్వకర్మైకసాక్షీ,
శత్రుం నేత్రశ్రుతీనా మవజయతివయో జ్యేష్ఠభావే సమేఽపి
స్థేమ్నాంధామ్నాంనిధిర్య స్సభవదఘనుదే నూతనస్త్వాదనూరుః 51

**అవ :** గరుత్మంతునికంటె అనూరుడికున్న గొప్పతనాన్ని చెబుతున్నాడు.

**ప్రతి :** హరిణా= మహావిష్ణువుచేత; ఆక్రాంత్య= బలాత్కారంగా; పశుంఇవ= జంతువువలె; ఆవాహ్యమానం= వాహనంగా చేయబడుతున్న వానిని (గరుడుణ్ణి); హరీణాం= గుర్రాలకు; అగ్ర్యః= నాయకుడైన; వాహకః= రథానికి ముందు కూర్చుండే చోదకుడుగాను (ఎవడో); జగతి= లోకంలో; పక్షపాతాత్= పక్షపాతవైఖరితో (రెక్కలు దించి కాలునేలమోపుట, ఒకరియెడ అభిమానం చూపుట); భ్రామ్యంతం= తిరుగుతున్నవానిని; సమరుచిః= సమదృష్టికలిగిన; సర్వకర్మ+ఏకఃసాక్షీ= సమస్త కర్మలకు ప్రధాన సాక్షిగాను (ఎవరో) (అంతే నిష్పక్షపాతంచేత పక్షపాతిని (గరుడుణ్ణి) అవమానించడం) వయోజ్యేష్ఠభావే= వయసుచేత పెద్దరికమున (పక్షులందు పెద్దరికము గరుత్మంతునికి); సమే అపి= తుల్యమే అయినా; యః= ఎవరైతే; నేత్రశ్రుతీనాం= కన్నులే చెవులుగాగల పాములకు; శత్రుం= శత్రువైన గరుత్మంతుని; అపజయతి= ఓడిస్తున్నాడో; సః= ఆ; స్థేమ్నాం= స్థిరమైన; ధామ్నాం= కాంతులకు; నిధి= గనియైన; నూతనః= కొత్తవాడైన (ఉదయకాలపు); అనూరుః= అనూరుడు; భవత్= మీయొక్క; అఘనుదే= పాపహరణార్థము; స్తాత్= అగుగాక!

**తా :** గరుత్మంతుడు ఒక హరికి (విష్ణువు) వాహనంకాగా తాను వాహనాలైన అనేక హరులకు (గుర్రాలకు) చోదకుడు కావడంవల్లనూ, పక్షపాతంగల (రెక్కలతో నేలకుదిగడం) గరుత్మంతునికంటె అందరియెడ సమభావం గలవాడు కాబట్టి అనూరుడే అధికుడు. వయోజ్యేష్ఠభావం మాత్రం ఇద్దరికీ సమానం. ఈ విధంగా గొప్పవాడైన అనూరుడు మీ పాపాలను తొలగించుగాక!



**అలం :** వ్యతిరేకం, శ్లేషానుప్రాణితం.

**విశే :** ఇందులో "హరి, పక్షపాత వయోజ్యేష్ఠ" శబ్దాలు శ్లిష్టాలు. అన్నీ అభంగశ్లేషలో ఉన్నాయి. అయితే ఎక్కువ చమత్కారం మాత్రం 'వయో' దగ్గరవుంది. 'వి' అంటే పక్షి దాని బహువచనం 'వయః' 'వయోజ్యేష్ఠ' అంటే పక్షులలో పెద్ద. 'వి' అనేది ఇకారాన్త పుంలింగం. వయతి తృణాదినా నీడం ఇతి విః అని వ్యుత్పత్తి. అంటే గడ్డిగాదంచేత గూడు కట్టుకునేది అని అర్థం. 'వేఞ్' తంతు సంతానే ధాతువు. రెండవ పక్షంలో వయసాజ్యేష్ఠః వయసుచేత పెద్ద. అనూరుడు గరుడుడికంటె ముందు పుట్టాడు కదా. కనుక షష్ఠీ, తృతీయలతో శ్లేష సాధింపబడింది.

ప్ర. దత్తార్ఘైర్దూరనమ్రైర్వియతి వినయతో వీక్షితస్సిద్ధసాధ్యై
స్సానాథ్యంసారథిర్వ స్సదశశతరుచే స్సాతిరేకం కరోతు,
ఆపీయ ప్రాతరేవ ప్రతతహిమపయ స్స్యందినీ రిందుభానూ
ర్యః కాష్ఠాదీపనోఽగ్రే జడిత ఇవ భృశం సేవతే పృష్ఠతోఽర్కమ్ 52

**ప్రతి :** వియతి= ఆకాశమందు; దత్త+అర్ఘైః= పూజాద్రవ్యములిచ్చి; దూరనమ్రైః= దూరంగా వినమ్రులై; సిద్ధసాధ్యైః= సిద్ధాది దేవగణాలచేత; వినయతః= వినయంగా; వీక్షితః= చూడబడినవాడై; ప్రాతర్ ఏవ= ప్రాతః కాలమందే; ప్రతతహిమపయస్యందినీ= నిరంతరం మంచుకురుస్తున్న; ఇందుభామాః= చంద్రకిరణాలను; ఆపీయ= బాగా తాగి; భృశం= మిక్కిలి; జడితః ఇవ= శీతార్తునివలె (చలిపీడితుడు); అగ్రే= ముందుభాగంలో; కాష్ఠాదీపనః= దిక్కులను వెలిగించినవాడై (కట్టెలను వెలిగించడం); పృష్ఠతః= వెనుకవైపు; అర్కం= సూర్యుణ్ణి; యః= ఎవరైతే; సేవతే= సేవిస్తున్నాడో; సః= ఆ; సదశశతరుచేః= సహస్రకిరణుడయిన సూర్యునియొక్క; సారథిః= సారథియైన అనూరుడు; వః= మీయొక్క లేక మీకు; సానాథ్యం= సనాథత్వాన్ని (రక్షణను); సాతిరేకం= మిక్కిలి ఉత్సాహంతో; కరోతు= చేయుగాక!

**తా :** ఆకాశంలో అర్ఘ్యాదులతోవచ్చి వినమ్రులయిన సిద్ధాదుల చేత దూరమునుంచే చూడబడి ప్రభాతకాలంలో స్రవించుతున్న మంచుకిరణాలను ముందుగా త్రాగి ఆకారణంగా ఏర్పడిన శీతలత్వాన్ని (చలిబాధ) పోగొట్టుకోవడానికి వెనుకవైపు సూర్యుణ్ణి సేవిస్తున్న అనూరుడు మిమ్మల్ని రక్షించుగాక!

**అలం :** శ్లేష.

**విశే :** ఇక్కడ అనూరుణ్ణి శీతల పీడితునిగా పోల్చి 'కాష్ఠాదీపన' అనే విశేషణాన్ని శ్లేషతో వాడాడు కవి. కాష్ఠశబ్దం స్త్రీలింగంలో 'దిక్కు'ని నపుంసకంలో 'కట్టె'ని చెబుతుంది. కాష్ఠోత్కర్షేస్థితౌ దిశి, దిశస్తుకకు భః కాష్ఠా ఆశాశ్చ హరితశ్చతాః' అని, 'కాష్ఠందారు' అని అమరం) చలిపీడితుడు ఎదురుగా అగ్నిని, వెనుకభాగంలో సూర్యుణ్ణి సేవించాలని శాస్త్రాలు చెబుతున్నాయి. (అందుకే చలిమంటలు వేసేటప్పుడు ముందుభాగం అగ్నికి, వెనుకభాగం సూర్యుడికి వుండేలా కూర్చుంటారేమో) "పృష్ఠతోఽర్కం నిషేవేత జఠరేణహుతాశనం" (బహుశా ఇక్కడ అగ్నియాగాగ్ని కావచ్చు) అనూరుడు హిమబిందువులుతాగి చలి ఎక్కువై ఎదురుగా కాష్ఠాదీపనంతో (దిక్కులను వెలిగించి) వెనుకభాగంలో సూర్యుణ్ణి సేవించి శోభిల్లాడని తాత్పర్యం.

స్ర. **ముంచన్రశ్మీన్దినాదౌ దినగమసమయే సంహరంశ్చ స్వతంత్ర**
**స్తోత్రప్రఖ్యాతవీర్యోఽవిరత హరిపదాక్రాంతిబద్ధాభియోగః,**
**కాలోత్కర్షాల్లఘుత్వం ప్రసభమధిపతౌ యోజయ న్యో ద్విజానాం**
**సేవాప్రీతేన పూష్ణా స్వసమఇవ కృతస్త్రాయతాంసోఽరుణోవః 53**

**అవ :** అనూరుడు సూర్యుడితో పోల్చబడుతున్నాడు.

**ప్రతి :** దినాదౌ= దినప్రారంభ కాలంలో (ఉదయంపూట); రశ్మీన్= గుర్రాల పగ్గాలను; ముంచన్= సడలిస్తూ (ప్రసరింపజేస్తూ); దినగమనమయే= సాయంకాలాన; సంహరన్చ= లాగిపట్టి (అస్తమింపజేస్తూ); స్వతంత్రః= స్వేచ్ఛ కలిగి (స్వైరియై); తోత్రప్రఖ్యాత వీర్యః= గుర్రాలను కొరడాలతో తోలుటయందు బలముకలిగి; స్తోత్ర ప్రఖ్యాతవీర్యః= వేదోక్త మంత్రాలచేత ప్రఖ్యాత బలము కలవాడై అని సూర్యపక్షంలో); అవిరత= ఎడతెగని; హరిపద= గుర్రాల పదవిన్యాసముయొక్క (ఆకాశము యొక్క); ఆక్రాంతి= విక్షేపమందు; బద్ధ= బలమైన; అభియోగః= ఆదరముకల్గి (ఎప్పుడూ ఆకాశాన్ని ఆక్రమించుటయందు ఆసక్తి గలిగి అని సూర్యాన్వయం); కాలోత్కర్షాత్= ముందు పుట్టడంవలన (ఉదయకాలము గొప్పది కావడంవలన); ద్విజానాం అధిపతౌ= పక్షులకు అధినాథుడైన గరుత్మంతునియందు (నక్షత్రాధిపతియైన చంద్రునియందు అని సూర్య); ప్రసభం= మిక్కిలి; లఘుత్వం= చిన్నతనాన్ని (న్యూనతాభావం); యోజయన్= ప్రదర్శిస్తూ; యః= ఎవరైతే; సేవాప్రీతేన= తన సేవచేత సంతుష్టుడైన; పూష్ణా= సూర్యునిచేత; స్వసమఇవ= తనకు (సూర్యునికి) సమానమైనవానిగా; కృతః= చేయబడినాడో; సః= ఆ; అరుణః= అనూరుడు; వః= మిమ్మల్ని; త్రాయతాం= కాపాడుగాక!



**తా :** సూర్యుడు ఉదయకాలంలో తన కిరణాలను ప్రసరింపజేసినట్లే అనూరుడు పగ్గాలను (రశ్మీన్) సడలిస్తాడు. సూర్యుడు సాయంత్రం కిరణాలను ఉపసంహరించుకున్నట్లే అనూరుడు పగ్గాలను లాగిపడతాడు. సూర్యుడు వేదోక్త మంత్ర ప్రసిద్ధబలుడు కాగా అనూరుడు రథచోదన కర్మయందు (ప్రాజనకర్మ) నిపుణుడు. సూర్యుడు మాదిరిగా అనూరుడు కూడ హరిపద ఆక్రమణమున (విక్షేపము లేక విన్యాసము) చతురుడు సూర్యుడు ఉదయించి చంద్రుని ధిక్కరించినట్లే తాను ముందుపుట్టి గరుత్మంతునికి చిన్నతనాన్ని కలుగజేశాడు. ఈ విధంగా అన్నివిధాల సూర్యునితో సమానుడైన అనూరుడు మిమ్మల్ని రక్షించుగాక!

**అలం :** శ్లేషామప్రాణితోపమ (రశ్మి, హరిపద (తోత్ర) స్తోత్ర ప్రఖ్యాత వీర్యత్వము, అధఃకృత ద్విజాధిపతిత్వం శ్లిష్టాలు).

స్ర. శాతశ్శ్యామాలతాయాః పరశురివ తమోఽరణ్య వహ్నేరివార్చిః
ప్రాచ్యేవాగ్రే గ్రహీతుం గ్రహకుముదవనం ద్రాగుదస్తాగ్రహస్తః,
ఐక్యం భిందన్ద్యుభూమ్యో రవధిరివ విధాతేవ విశ్వప్రబోధం
వాహానాం వో వినేతా వ్యపనయతు విపన్నామ ధామాధిపస్య॥* 54

**ప్రతి :** శ్యామాలతాయాః= రాత్రి అనెడి తీగెకు; శాతః= వాడియైన; పరశుః ఇవ= గండ్రగొడ్డలిలాగ; తమోఽరణ్యవహ్నేః= చీకటియనెడి దావాగ్నియొక్క; అర్చిఃఇవ= మంటలాగ; ప్రాచి+అగ్రే= తూర్పు దిక్కునందలి; గ్రహకుముదవనం= గ్రహములనెడి కలువల సమూహాన్ని; గ్రహీతుం= స్వీకరించడానికి (అందుకోవడం లేక మ్రింగడం); ద్రాక్= శీఘ్రంగా; ఉదస్త= చాపబడిన (విక్షిప్తమైన); అగ్రహస్తఃఇవ= చేతిమొనలాగ; ద్యుభూమ్యోః= స్వర్గ భూలోకాలకు; ఐక్యం= ఏకత్వాన్ని; భిందన్= భేదించుతున్న (ఎడబాటు కలిగిస్తూ); అవధిఃఇవ= హద్దులాగవుండి; లోకప్రబోధం= ప్రపంచానికి మేలుకొలుపును చేస్తున్న (అధ్యాహార్యం); విధాతాఇవ= బ్రహ్మలాంటివాడైన; ధామ+అధిపస్య= కాంతినిధియైన సూర్యుని యొక్క; వాహానాం= గుర్రముల యొక్క; వినేతా= నాయకుడు (చోదకుడైన అనూరుడు); వః= మీయొక్క; విపత్+నామ= ఆపదలనే వాటిని; వ్యపనయతు= తొలగించుగాక!

**తా :** అనూరుడు రాత్రి అనే లతకు గండ్రగొడ్డలి. చీకటి అడవికి దావాగ్ని. ఉదయదిక్కున గ్రహములనెడి కలువ లందుకొనుటకు సాచిన చేయి. ఇలా గగనాలను వేరుచేసే సరిహద్దు. సుప్తలోకానికి జాగృతిని కలిగించే విధాత. అటువంటి అనూరుడు మీ ఆపదలను తొలగించుగాక!

**అలం :** ఉత్ప్రేక్ష, రూపకాలు.

* శ్రీనాథుని అనువాదం చూడవచ్చు (కాశీ. 1-121)

స్ర. పౌరస్త్యస్తోయదర్తోః పవనఇవ పత త్పావకస్యేవ ధూమో
విశ్వస్యేవాదిసర్గః ప్రణవ ఇవ పరం పావనో వేదరాశేః,



సంధ్యానృత్తోత్సవేచ్ఛో రివ మదనరిపోర్నందినాందీ నినాదః
సౌరస్యాగ్రే సుఖం వో వితరతు వినతానందనః స్యందనస్య॥ 55

**ప్రతి :** తోయద+ఋతోః= వర్షర్తువునకు; పౌరస్త్య= ముందుగా కనిపించు; పవనఃఇవ= గాలివంటివాడు (వర్షాగమనాన్ని గాలి సూచించేవిధంగా అనూరుడు సూర్యోదయాన్ని సూచిస్తాడు); పతత్+పావనస్య= యజ్ఞమందు ప్రవిష్టమగు అగ్నికి (ముందు కనిపించు); ధూమఃఇవ= పొగవంటివాడు (అరణి అగ్నిని మథించునప్పుడు పొగ అగ్నిని సూచిస్తుంది అట్లే సూర్యోదయానికి ధూమంలా తాను ముందు కనిపించి దర్శపౌర్ణమాసాదుల చేత యజమానిని అంటే యజ్ఞం చేసేవానిని ప్రవర్తింపజేస్తాడని ఆంతర్యం); విశ్వస్య= ప్రపంచానికి; ఆదిసర్గఃఇవ= తొలి సృష్టివంటివాడు (ప్రపంచానికి పాంచభౌతికసృష్టి ఎలాగో సూర్యోదయానికి అనూరుడు అలాగ); వేదరాశేః = వేద చతుష్టయానికి (కొందరి మతంలో వేదత్రయి); పరంపావనః= మిక్కిలి పవిత్రమైన; ప్రణవఃఇవ= ఓంకారంవంటివాడు (వేదమంత్రాలు ఓంకారంతో ప్రారంభమైనట్లే సూర్యోదయం అనూరునితో అవుతుంది); సంధ్యా+నృత్య+ ఉత్సవ+ఇచ్ఛోః= సంధ్యకాగానే నాట్యమందు ఉత్సాహంగల; మదనరిపోః = శివునికి; నందినాందీనినాదఃఇవ= నాందీవాక్యం పలుకు నందీశ్వరుని మృదంగనాదం లాంటివాడున్ను అయిన (సాయంత్రం కాగానే తాండవశీలియైన శివుడు నందీశ్వరుని నాందితో ఉపక్రమిస్తాడు); సౌరస్య= సూర్యునియొక్క; స్యందనస్య= రథముయొక్క; అగ్రే= ముందుకూర్చున్న; వినతానందనః= వినతాదేవి కుమారుడైన అనూరుడు (వినతాదేవికి ఆనందాన్నిచ్చే అనూరుడు); వః= మీకు; సుఖం= ఆనందాన్ని; వితరతు= కలిగించుగాక!

**తా :** అనూరుడు వర్షాగమనాన్ని సూచించే వాయువు అగ్నిని సూచించే ధూమము. లోకానికి తొలి సృష్టి. (జలం) వేదాలకు ఓంకారం. శివుని నాట్యానికి నందీనాదం. అటువంటి అనూరుడు మీకు సంతోషాన్నిచ్చుగాక!

**అలం :** ఉపమా, ఉల్లేఖాలు.

**స్ర.** **పర్యాప్తం తప్తచామీకరకటకతటే శ్లిష్టశీతేతరాంశా**
**వాసీదత్స్యందనాశ్వానుకృతిమరకతే పద్మరాగాయమాణః,**
**యస్సోత్కర్షాం విభూషాం కురుతఇవ కులక్ష్మాభృదీశస్య మేరో**
**రేనాంస్యహ్నాయదూరం గమయతుసగురుఃకాద్రవేయద్విషోవః 56**

**ప్రతి :** ఆసీదత్= దూకుతున్న; స్యందన= రథానికి పూన్చిన; అశ్వ+అనుకృతి= గుర్రాల ప్రతిబింబము అనెడి; మరకతే= మరకతముగల (ఆకుపచ్చని రత్నవిశేషం); శ్లిష్ట= కూడుకొనిన; శీత+ఇతర+అంశౌ= ఉష్ణకిరణుడైన సూర్యునితో నిండిన; తప్తచామీకరకటకతటే= కాల్చిన బంగారపు వన్నెగల చరియల ప్రదేశమునందు; పర్యాప్తం= అధికంగా (మిక్కిలి); పద్మరాగాయమాణః= పద్మరాగ మణిలా భాసిస్తూ (గుర్రాలు, మరకతాలు, సూర్యకిరణాలు సోకిన మేరు పర్వతచరియలు బంగారం, అనూరుడు పద్మరాగమణి అని తాత్పర్యం); యః= ఎవరైతే; కులక్ష్మాభృత్+ఈశస్య= కులపర్వతాల కధిపతియైన; మేరోః= మేరు పర్వతానికి; సోత్కర్షాం= అతిశయమైన; విభూషాం= ఆభరణత్వాన్ని (అలంకారత్వాన్ని); కురుతః ఇవ= చేయుచున్న వానివలెవున్నాడో; కాద్రవేయద్విషః= నాగులకు విరోధియైన గరుత్మంతునికంటె; గురుః= పెద్దవాడైన; సః= ఆ అనూరుడు; వః= మీయొక్క; ఏనాంసి= పాపాలను; అహ్నాయ= శీఘ్రంగా; దూరం గమయతు= దూరంగా తొలగించుగాక!

**తా :** రథానికి పూన్చిన ఆకుపచ్చని గుర్రాలనెడి మరకతాలందు, సూర్యకిరణ సంతప్త సువర్ణ సానువులందు తన ఎర్రదనంచేత పద్మరాగమణిలా భాసిస్తూ మేరుపర్వతానికి ఆభరణాయమానమైన గరుడభ్రాత అనూరుడు మీ పాపాలు పోగొట్టుగాక!

**అలం :** ఉత్ప్రేక్ష.



**స్ర.** **నీత్వాశ్వాన్ తృప్తకక్ష్యా ఇవ నియమవశం వేత్రకల్పప్రతోద**
**స్తూర్ణం ధ్వాంతస్యరాశా వితరజన ఇవోత్సారితే దూరభాజి,**
**పూర్వం ప్రష్ఠోరథస్య క్షితిభృదధిపతీ న్దర్శయం స్త్రాయతాద్వ**
**స్త్రైలోక్యాస్థానదానోద్యతదివసపతేః ప్రాక్ప్రతీహారపాలః. 57**

**అవ :** అనూరుడు రాజుకు ముందు నడిచే ప్రతీహారిలా చెప్పబడుతున్నాడు.

**ప్రతి :** వేత్రకల్ప= దండముతో సమానమైన (ప్రతీహారి చేతిలోని పెద్దకర్ర); ప్రతోదః= గుర్రాలనుతోలు బెత్తముకలిగి; సప్త ఆశ్వాన్= ఏడుగుర్రాలను; సప్తకక్ష్యాఃఇవ= ఏడుపహారాలవలె; నియమవశం= నియమబద్ధంగా; నీత్వా= నడిపించి (పొంది, దాటించి); ధ్వాంతస్యరాశౌ= చీకటి సమూహము; ఇతరజనఃఇవ= అంతఃపురేతర వ్యక్తులువలె; దూరభాజి= దూరముగా వుండునట్లుగా; తూర్ణం= వేగంగా; ఉత్సారితే= తొలగింపబడగా (అడ్డుతొలగునట్లుచేసి); క్షితిభృత్+అధిపతీన్= మేరుపర్వతాది సప్తకుల పర్వతాలను (ప్రభువులను); దర్శయన్= చూపిస్తూ; త్రైలోక్య+ఆస్థానధాన= ముల్లోకాలనే సభా ప్రవేశమొనర్చుటకు; ఉద్యతః= ఉద్యుక్తుడైన; దివసపతేః= సూర్యుని యొక్క; రథస్యపూర్వం= రథముయొక్క ముందు; ప్రష్ఠ= ఆసీనుడైన (అగ్రగామి); ప్రాక్ప్రతీహారపాలః= మహాప్రతీహారియైన; అనూరుడు; వః= మిమ్మల్ని; త్రాయతాం= కాపాడుగాక!

**తా :** ఏవిధంగా ఒక రాజు సభామంటపాన్ని ప్రవేశించబోయే ముందు వేత్రధారియైన ప్రతీహారిముందు నడుస్తూ ముందరి ద్వారాలను అధిగమింపజేస్తూ, ఎదురుగా జనాల్ని అడ్డుతొలగమని హెచ్చరికలు చేస్తూ సభాప్రవేశం చేయిస్తాడో, అలాగే అనూరుడు గుర్రాలుతోలే బెత్తాన్ని చేతబూని అశ్వాలనే ఏడుకక్ష్యలనుదాటిస్తూ చీకటిని తొలగించుకుంటూ సప్తకుల పర్వతదర్శనం చేయిస్తూ సూర్యుడనే రాజుని త్రైలోక్య సభామంటప ప్రవేశం చేయిస్తున్నాడు. అటువంటి అనూరుడు మిమ్మల్ని కాపాడుగాక!

**అలం :** ఉపమా, శ్లేషలు.

**స్ర. పాశానాశా న్తపాలా దరుణ! వరుణతో మాగ్రహీః ప్రగ్రహార్థం**
**తృష్ణాం కృష్ణస్య చక్రే జహిహి నహి రథో యాతి మే నైకచక్రః,**
**యోక్తుం యుగ్యంకిముచ్చైశ్శ్రవసమభిలషస్యష్టమం వృత్రశత్రో**
**స్త్యక్తాన్యాపేక్షవిశ్వోపకృతిరితి రవిశ్శాస్తి యం సోఽవతాద్వః*॥ 58**

**అవ :** ఎటువంటి సహాయం ఇతరులను అడగవద్దని అనూరుణ్ణి సూర్యుడు హెచ్చరిస్తున్నాడు.

**ప్రతి :** అరుణ!= ఓ అనూరుడా!; ప్రగ్రహార్థం= పగ్గాలకోసం; ఆశాన్తపాలాత్= పశ్చిమ దిక్పాలకుడైన; వరుణతః= వరుణదేవుని (నుండి) వలన; పాశాన్[1]= తాళ్ళను; మాగ్రహీః= స్వీకరించవద్దు; ఏకచక్రః= (రథానికి) ఒక్క చక్రమేవున్న; మే= నాయొక్క; రథః= రథము; నయాతి= నడవడంలేదు అనునది; నమి= లేదుకదా! (అంటే నడుస్తుందికదా) అందువలన; కృష్ణస్యచక్రే= కృష్ణుని చక్రమైన సుదర్శనమందు; తృష్ణాం= ఆశను; జహిహి= మానుకో!; యుగ్యం= పూన్చడానికి అర్హతలుగల; వృత్రశత్రోః= వృత్రాసురుని విరోధియైన ఇంద్రునియొక్క; ఉచ్చైశ్శ్రవసం= ఉచ్చైశ్శ్రవసమనే (పెద్దచెవులుగల) గుర్రాన్ని; అష్టమం= ఎనిమిదవదాన్నిగా; యోక్తుం= పూన్చడానికి; అభిలషసికిం= కోరుతున్నావా ఏమి?(కోరవద్దు); ఇతి= అని ఈ విధంగా; త్యక్త= విడిచిపెట్టబడిన; అన్య+అపేక్ష= ఇతర సహాయం గల్గి; విశ్వ+ఉపకృతిః= లోకోపకారం కలిగిన (అసహాయశూరుడై లోకోపకారం చేస్తున్న); రవిః= సూర్యుడు; యం= ఎవరినైతే; శాస్తి= ఆదేశిస్తున్నాడో; సః= ఆ అనూరుడు; వః అవతాత్= మిమ్మల్ని రక్షించుగాక!

**తా :** పగ్గాలకొరకు వరుణున్ని అడగవద్దు. రథానికి వున్నది ఒక చక్రమేకదా నడవడం కష్టం అనే వుద్దేశంతో కృష్ణుణ్ణి సుదర్శనం అడగవద్దు. ఎందుకంటే నా రథం నడుస్తున్నది కదా! ఎనిమిదవ గుర్రంగా వణికిస్తుందని ఇంద్రుడి



గుర్రాన్ని అడగవద్దు అని ఈ విధంగా నిరపేక్షంగా లోకోపకారం చేస్తున్న సూర్యుడు ఎవరినైతే ఆదేశిస్తున్నాడో ఆ అనూరుడు మిమ్మల్ని కాపాడుగాక.

**వివ :** * ఈ శ్లోకం చౌఖంబా, నిర్ణయసాగర్ ముద్రణల్లో 59వదిగా వున్నది.

1. వరుణుని ప్రధాన ఆయుధం పాశం. "వరుణస్యపాశాత్" (ఋగ్వే.10–85–24) వరుణుడు ఈ దండాన్ని పాపులమీద ప్రయోగిస్తాడట. "వరుణేన యథా పాశైర్బద్ధ ఏవాభిదృశ్యతే" (మనుస్మృతి 9–307)

**స్ర. వజ్రిఙ్జ్ఞాతం వికాసీక్షణకమలవనం భాసి నాభాసి వహ్నే!**
**తాతంనత్వాశ్వపార్శ్వా న్న యయమ మహిషంరాక్షసాః వీక్షితాస్థ,**
**సప్తీన్ సించ ప్రచేతః పవన! భజ జపం విత్తవేదితస్త్వం**
**వందే శర్వేతి జల్పన్ప్రతిదిశమధిపాన్పాతు పూష్ణోగ్రణీర్వః. 59**

**అవ :** అనూరుడు అష్టదిక్పాలకులను పలువిధాల పరామర్శిస్తున్నాడు.

**ప్రతి :** హేవజ్రిన్= ఓ ఇంద్రా!; ఈక్షణకమలవనం= నీ చూపులనెడి పద్మసమూహము; వికాసి= మేల్కొన్నది; వహ్నే= ఓ అగ్నీ!; ఆభాసి= నీవు ఏ విధంగా ప్రకాశిస్తావో (సహజకాంతితో); నభాసి= ఆ విధంగా ఇపుడు ప్రకాశించడంలేదా!; యమ!= ఓ యముడా!; తాతంనత్వా= నీ తండ్రియగు సూర్యుడికి నమస్కరించి; మహిషం= నీ వాహనాన్ని; అశ్వపార్శ్వాత్ నయ= గుర్రాలకు దూరంగా తీసుకుపో;(లేకపోతే వాటి సహజవైరంవల్ల బెదరవచ్చు)[1]; రాక్షసాః= ఓ రాక్షసులారా!; వీక్షితాఃస్థః= మీరు నా ప్రభువుచేత చూడబడ్డారులే! (భరోసా లేక ఓదార్పు); ప్రచేతః= ఓ వరుణదేవా! సప్తీన్= నా గుర్రాలను; సించ= తడుపుము (సేదతీర్చు); పవన= ఓ వాయుదేవా!; జపం= వేగాన్ని; భజ= పొందుము (నీకంటే నా గుర్రాలే వేగంగా పోతున్నాయి); విత్తపా= ఓ కుబేరా! (ధనాధిపతి); త్వం= నీవు; అవేదితః= నా స్వామికి నివేదింపబడ్డావులే!; శర్వ= ఓ ఈశాన! (ఈశ్వరా); వందే= నమస్కరిస్తున్నాను[2]; ఇతి= అని; ప్రతిదిశమధిపాన్= సకల దిక్పాలకులను;

జల్పన్= పల్కరిస్తున్న; పూష్ణః అగ్రణీః= సూర్యునికి ముందున్న; అనూరుడు; వఃపాతు= మిమ్మల్ని కాపాడుగాక!

**తా :** ఓ ఇంద్రా! నీ చూపులనే కమలాలు వికసించాయి. అగ్ని! నీ కాంతి తగ్గిందా ఏమి? యమా! నీ మహిషాన్ని పక్కకుతప్పించు. రాక్షసులారా! మిమ్మల్ని నా ప్రభువు చూశాడులే (దేవతలంటే తక్కువ జాతియైనా దిక్పాలకత్వ నియామకంచేత ఆ గౌరవం ఇవ్వబడింది) వరుణా! నా గుర్రాలను కదుగు. వాయూ! వేగాన్ని పుంజుకో. కుబేరా! నాస్వామి గమనించాడులే. శివా! నమస్కారం అని అష్టదిక్పాలకులను కుశల ప్రశ్నలు వేస్తున్న అనూరుడు మిమ్మల్ని కాపాడుగాక!

**వివ :** 1. "గోవ్యాఘ్రః, గజసింహ, మశ్వమహిషం, శ్వైణంచ, బభ్రూరగే" అని ఆ యా జంతువులకు సహజవైరం ప్రసిద్ధం. (ముహూర్తచింతామణి)

2. "ఆదిత్యం చ శివంవిద్యాచ్ఛివమాదిత్యరూపిణం। ఉభయోరన్తరంనాస్తి ఆదిత్యస్య శివస్యచ।" అని శ్రుతివచనం. అందుకే శివునకు అరుణాంజలి.

శ్ల. **నో మూర్ఛాచ్ఛిన్నవాంఛ శ్రమవివశవపుర్నైవ నాప్యాస్యశోషీ**
**పాన్థః పథ్యేతరాణి క్షపయతు భవతాం భాస్వతోஉగ్రేసరస్సః**
**యస్సంశ్రిత్య త్రిలోకీమటతి పటుతరైస్తప్యమానో మయూఖై**
**రారాదారామరేఖామివ హరితమణిశ్యామలా మశ్వపఙ్క్తిమ్. 60**

**అవ :** నిరంతరయానంవల్ల కలిగిన అలసటను అనూరుడు ఎలా తీర్చుకుంటున్నాడో చెబుతున్నాడు.

**ప్రతి :** మూర్ఛా= మోహముచేత; ఛిన్న= పోగొట్టబడిన; (అపనీతమైన); వాంఛః= కోరికగలవాడు; న= కాక; శ్రమవివశవపుః= అలసటచేత స్వాధీనంతప్పిన శరీరముగలవాడు; న= కాక; ఆస్యశోషీ అపి= ముఖము వడబడినవాడును; న= కాక; యః= ఎవరైతే; పటుతరైః= బాగా తీక్ష్ణములయిన; మయూఖైః= సూర్యకిరణాలచేత; తప్యమానః= తపింపజేయబడుతున్నవాడై; ఆరాత్= సమీపమందలి; ఆరామరేఖామివ= ఉపవనపంక్తివంటి (పచ్చదనంసామ్యం); మరిత మణిశ్యామలాం= పచ్చనిమణులవలె శ్యామలవర్ణంగల; అశ్వ పంక్తిం= గుర్రాలగుంపును; సంశ్రిత్య= ఆశ్రయించి; త్రిలోకీం= ముల్లోకాలను; అటతి= తిరుగుతున్నాడో; సః= ఆ; భాస్వతః= సూర్యునికి; అగ్రేసరః= ముందుకూర్చున్న; పాంథః= భాటసారి అనెడి అనూరుడు; భవతాం= మీయొక్క; పథ్య+ఇతరాణి= అశుభాలను; క్షపయతు= తొలగించుగాక!

**తా :** నిరంతరమూ ముల్లోకాలు సంచరిస్తున్నా అనూరుడనే బాటసారి మోహంచేత నీరసపడలేదు. పడిపోలేదు. ముఖం ఎండిపోలేదు. అయినా అతిసన్నిహితంగావున్న కారణంచేత సూర్యకిరణ సంతప్తుడై పచ్చనిగుర్రాలనే ఉద్యానవనంచెంత సేదతీర్చుకుంటున్న అనూరుడు మీ అశుభాలను తొలగించుగాక!

**అలం :** రూపకం

**వివ :** నిరంతరం ప్రయాణంచేసే బాటసారి అలసటతో పచ్చినిచెట్ల కింద ఎలా సేదతీర్చుకుంటున్నాడో అలాగే అనూరుడుకూడా ప్రయాణంలో ఏబాధలు లేకపోయినా సూర్యకిరణాలు బాగాదగ్గరగా వుండడం వల్ల కలిగిన వేడిని వేగంగా ప్రయాణిస్తూ గమ్యాన్ని త్వరగా అందించే పచ్చని గుర్రాలనే ఉద్యానవనం చెంత తొలగించుకుంటున్నాడని కవి అభిప్రాయం.

శ్ల. **సీదన్తో న్తర్నిమజ్జజ్జడఖురముసలా స్సైకతే నాకనద్యాః**
**స్కందంతః కందరాళీః కనకశిఖరిణో మేఖలాసు స్ఖలన్తః,**
**దూరం దూర్వాస్థలోత్కా మరకతదృషది స్థాస్నవోయన్నయాతాః**
**పూష్ణోஉశ్వాః పూరయన్త్య స్తదవతు జవనైర్హుంకృతేనాగ్రగోనః 61**

**అవ :** జాతిసహజ కారణాలతో నడకమందగించిన గుర్రాలను అదిలిస్తున్న అనూరుని హుంకారాన్ని చెబుతున్నాడు.

**ప్రతి :** నాకనద్యాః= స్వర్గనదియైన గంగానదియొక్క; సైకతే= ఇసుకతిన్నెలో; అంతర్నిమజ్జత్= లోపల చిక్కుకున్న కారణంగా; జడ= మందగించిన; ఖుర= గిట్టలనెడి; ముసలాః= రోకళ్ళు గలిగి; సీదన్తః= బలహీనములయినవియూ; కందరాళీః= శిఖరాలను; స్కందంతః= ఎగిరి గంతులో దూకుతున్నవై; కనకశిఖరిణః మేఖలాసుః= మేరుపర్వత గుహలందు; స్ఖలంతః= నునుపుచేత జారిపడుతున్నవియూ; దూరం= ఎక్కువగా; దూర్వాస్థల+ఉత్కాః= గరిక భూములందు ఆసక్తిగలవై; మరకతదృషది= మరకత శిలాప్రదేశములందు; స్థాస్నవః= నిలబడినవై; యత్= ఏ ప్రదేశమునుంచి; అశ్వాః= గుర్రాలు; న యతాః= కదలడంలేదో[1]; తత్= ఆ ప్రదేశమునుండి; హుంకృతేన= 'హుం' అనే ధ్వనిచేతనే; జవసైః= వేగాన్నిపొందిన; తైః= ఆ గుర్రాలచేత; పూరయస్= పూరించుచున్న (మిగిలిన ప్రాంతాలకు దూకిస్తున్న); పూష్ణః అగ్రగః= సూర్యునికి ముందుకూర్చున్న; అనూరుడు; వః అవతు= మిమ్మల్ని రక్షించుగాక!

**తా :** సూర్యుని రథం ఆకాశమార్గంగుండా ప్రయాణించేటప్పుడు గంగానదియొక్క ఇసుకలో చిక్కుకున్న రోకళ్ళవంటి కాలిగిట్టలతో అలసిపోయి, పర్వతశిఖరాలుదాటి, మేరుపర్వతంపైన జారిపడుతూ, మరకత శిలాప్రదేశాల్లో పచ్చగడ్డి అని భ్రమించి నిలబడి ఏ ప్రదేశాలకైతే గుర్రాలు పోవడానికి వెనుకాడుతున్నాయో ఆ ప్రదేశాలకు తన హుంకారంచేత గుర్రాలను దూకిస్తున్న అనూరుడు మిమ్మల్ని కాపాడుగాక!

**వివ :** ఎద్దులుగాని, గుర్రాలుగాని పక్కన పచ్చగడ్డి చూస్తే ఆగిపోవడం సహజం. ఇక్కడ మయూరుని లోకవృత్త పరిశీలనం స్పష్టం.

***ఇంతటితో 'బాలప్రభ'తో కూడిన "అనూరువర్ణనం" ముగిసింది.***

* * *

# రథవర్ణనమ్

**స్ర. పీనోరః ప్రేరితాభ్రై శ్చరముఖురపుటాగ్రస్థితైః ప్రాతరద్రా**
**వాదీర్ఘా గైరుదస్తో హరిభిరపగతాసంగనిశ్శబ్దచక్రః,**
**ఉత్తానానూరుమూర్ధా వనతిహఠభవద్విప్రతీపప్రణామః**
**ప్రాహ్ణే శ్రేయో విధత్తాం సమితురవతర న్వ్యోమవీథీం రథోవః*62**

**అవ :** ఇకనుంచి పదకొండు శ్లోకాల్లో రథవర్ణనం చేస్తున్నాడు. రథం వేగంగా ప్రయాణిస్తున్నపుడు వెల్లికిలాపడ్డ అనూరుడు సూర్యుడికి వెనక్కి వంగి నమస్కరించేలా వుందని ప్రారంభిస్తున్నాడు.

**ప్రతి :** ప్రాతర్+అద్రౌ= ఉదయాద్రిమీద; పీన+ఉరః= బలసిన రొమ్ముచేత; ప్రేరిత= నెట్టబడిన (త్రోయబడిన); అభ్రైః= మేఘాలుకలిగి; చరమపుట+ అగ్రస్థితైః= వెనుకకాలి గిట్టలతో కదలడానికి సిద్ధంగావున్న; అదీర్ఘాంగైః= సాచిన శరీరంగల; హరిభిః= గుర్రాల చేత; ఉదస్త= ఎగజిమ్మబడినదై (ఒక్క ఉదుటున లాగబడడం); అపగతాసంగః= ప్రతిబంధకంలేనిదై (అడ్డంకులు లేపోవడంవల్ల); నిశ్శబ్దచక్రః= శబ్దహీనమైన చక్రాలుగలదై; ఉత్తాన= వెల్లకిలాపడిన; అనూరు= అరుణునియొక్క; మూర్ధా+అవనతి= శిరసు వంగడం వలన; హఠభవత్= ఆకస్మికంగా కలుగుతున్న; విప్రతీపః= విపరీతమైన; ప్రణామః= నమస్కారం కలదియైన; ప్రాహ్ణే= ప్రాతఃకాలన; వ్యోమవీథీం= ఆకాశమార్గమున; అవతరన్= అవతరిస్తున్న; సవితుః= సూర్యునియొక్క; రథః= రథము; వః= మీకు; శ్రేయః= శ్రేయస్సును (శుభాన్ని); విధత్తాం= కలిగించుగాక!

**తా :** మేరుపర్వతమందు వెనకకాలి గిట్టలతో కదలడానికి సిద్ధంగావుండి బలిసిన రొమ్ములచేత మబ్బులను పక్కకునెట్టి గుర్రాలు ఒక్క ఊపుతో రథాన్ని లాగినప్పటికీ అడ్డం ఏమీలేని కారణంగా చక్రం కదిలినపుడు మోత ఏమీరాలేదు. అయినా ఆ ఊపులో ముందు కూర్చున్న అసూరుడు వెల్లకిలా

వెనక్కిపడ్డప్పుడు అది ఎలావుందంటే సూర్యునికి వెనక్కివంగి విపరీత ప్రణామం చేసినట్లుంది. అటువంటి వేగంతో ప్రారంభమైన సూర్యరథం మీకు శుభాన్ని చేకూర్చుగాక!

**విశే :** ప్రారంభంలో ఇటువంటి భావమున్న శ్లోకం వుండడం ఔచిత్యశోభితం. లోకంలో ఏదైనా వాహనం బయలుదేరేముందు ఒక ఊపురావడం (నేటి కార్లు, రైళ్ళకుకూడ తప్పడంలేదుకదా) ఆ ఊపులో ముందుకూర్చున్న వ్యక్తి కదలడం సహజం. మయూరుని కల్పనా పటిమకు, లోకవృత్తపరిశీలనానికి ఇది మంచి ఉదాహరణ కాగలదు.

**వివ :** * శ్రీనాథుని అనువాదం వుంది (కాశీ. 1-126).

స్ర. **ధ్వాంతౌఘధ్వంసదీక్షానిధి గురువహతా ప్రాక్సహస్రం కరాణా**
**మర్యమ్ణా యో గరీయః పదమతులముపానీయతా ధ్యాసనేన,**
**సశ్రాంతానాం నితాంతం భరమిన మరుతామక్షమాణాం విసోఢుం**
**స్కంధాత్స్కంధం వ్రజన్వోవృజినవిహతయేభాస్వతస్స్యందనోఽస్తు* 63**

**అవ :** సప్తవాయువులు భుజాలు మార్చుకొని మోస్తున్న రథాన్ని చెబుతున్నాడు.

**ప్రతి :** ప్రాక్= మొదటగా; యః= ఏదైతే; ధ్వాంత+ఓఘ= చీకటి సమూహముయొక్క; ధ్వంస= నాశనమనెడి; దీక్ష[1]= హనికయొక్క; విధి= బాధ్యతయందు; గురు= సమర్థములయిన (శక్తిగల); కరాణాం సహస్రం= వేయికిరణాలను; వహతా= తాల్చిన; అర్యమ్ణా= సూర్యుడు; అధ్యాసనేన= కూర్చోవడంచేత; అతులం= సాటిలేని; గరీయఃపదం= గౌరవస్థానాన్ని లేక అతిభారాన్ని; ఉపానీయత= పొందబడినదో(దై); నితాంతం= మిక్కిలి; శ్రాంతానాం= అలసట చెంది(న); భరం= బరువుని; విసోఢుం= (రథాన్ని) మోయడానికి; అక్షమాణాం ఇవ= ఓపికలేనివాటిలావున్న (శక్తిచాలని); మరుతాం= వాయువులయొక్క (ఈ వాయువులను దాటుకుంటూనే



సూర్యభగవానుడు మేరుప్రదక్షిణం చేస్తుంటాడని ఆగమవిదులంటారు); స్కంధాత్స్కంధం= భుజంనుంచి భుజం; వ్రజన్= పొందుతున్న (మారుతున్న); సః= ఆ; భాస్వతః= సూర్యునియొక్క; స్యందనః= రథము; వః= మీయొక్క; వృజిన విహతయే= పాపనాశనముకోసం; అస్తు= అగుగాక!

**తా :** చీకటిని పారద్రోలడం అనే గురుతరమైన దీక్షాభారంగల సూర్యభగవానుడి బరువుతో మరింత భారంపొందిన (గౌరవస్థానాన్ని పొందిన) రథాన్ని మోయలేకా అన్నట్లు వాయువులు ఒకదాని భుజం నుంచి మరొకటి మార్చుకుంటున్నాయి. ఆ విధంగా భుజాలు మార్చబడుతున్న రథము మీ పాపాలను పోగొట్టుగాక!

**అలం :** ఉత్ప్రేక్ష.

**వివ :** * శ్రీనాథుని అనువాదం వుంది (కాశీ. 1-132).

1. ఏ విధంగా ఒక బాలుడు (బ్రాహ్మణ) యౌవనంలో ప్రవేశించేటప్పుడు అతనికి యజ్ఞోపవీతసంస్కారరూపప్రారంభకర్మ అవసరమో అదే విధంగా సూర్యకిరణాలకుగూడ దినారంభసమయంలో (ఇది యౌవనం లాంటిది); అంధకారధ్వంసమనే దీక్ష అవసరమైనదని కవి భావన.

స్ర. **యోక్త్రీభూతాన్రథస్య గ్రసితుమివ పురో దందశూకాన్దధానో**
**ద్వేధావ్యస్తాంబువాహావళివిహితబృహత్పక్షవిక్షేపశోభః,**
**సావిత్రస్స్యందనోఽసౌ నిరతిశయగతిప్రీణితానూరురేనః**
**క్షేపీయో యో గరుత్మానివ హరతుహరీచ్ఛావిధేయప్రచారః ॥ 64**

**అవ :** రథం గరుత్మంతునిలావుందని చెబుతున్నాడు.

**ప్రతి :** పురః= ముందుగా; గ్రసితుమివ= మింగడానికో అన్నట్లు; యుగస్య= బండికాడికి; యోక్త్రీభూతాన్= పగ్గములుగావున్న; దందశూకాన్= సర్పాలను; దధానః= ధరించినట్టిదీ (రథానికి కట్టిన పగ్గాలు పాములని ప్రసిద్ధి)[1]; ద్వేధా=

రెండుపాయలుగా; వ్యస్త= చీల్చబడిన; అంబువాహావళి= మేఘపంక్తిచేత; విహిత= చేయబడిన; బృహత్= గొప్పది అగు; వక్ష= రెక్కలయొక్క; విక్షేప= విన్యాసపు; శోభః= శోభకల్గినది (మబ్బుల పాయలేరెక్కలుగా మారాయి); నిరతి శయగతి= అతిశయంలేని గమనంచేత; ప్రీణిత= తృప్తి పెట్టబడిన; అనూరుః= సారథి కల్గినట్టి (సోదరుడు); హరి+ఇచ్ఛావిధేయ= అశ్వాల మనసుకు అధీనమైన (మహావిష్ణువు బుద్ధికిలోబడిన); ప్రచార= గమనంగల; క్షేపీయః= వేగవంతమైన; గరుత్మాన్ ఇవ= గరుత్మంతునిలాంటి; అసౌ= ఈ; సావిత్రః= సూర్యసంబంధమైన; స్యందనః= రథము; వః= మీయొక్క; ఏనః= పాపాన్ని; హరతు= హరించుగాక!

**తా :** గరుత్మంతుడు పాములను మింగడాని కుద్యుక్తుడైనట్లే రథంకూడ కాడికికట్టిన పగ్గాలరూపంలో వున్న పాములను మింగడానికి సన్నద్ధమైనట్లున్నది. గరుత్మంతునికి రెక్కలున్నట్లే రథంకూడ తన వేగంచేత పాయలుగా చీలిన మబ్బులగుంపు అనే రెక్కలుకలిగి వుంది. గరుత్మంతుడు తన వేగంచేత సోదరుడైన అనూరుణ్ణి తృప్తిపరచినట్లే రథం తన సారథియైన అనూరుణ్ణి సంతోషపెట్టింది. గరుత్మంతుడు హరికిలోబడి (విష్ణువు) నడచినట్లే రథంకూడా హరులకు (గుర్రాలకు) లోబడి నడుస్తున్నది. ఈ విధంగా అపర గరుత్మంతుడిలావున్న రథం మీ పాపాన్ని తొలగించుగాక!

**అలం :** ఉపమ, ఉత్ప్రేక్ష, శ్లేషలు.

**వివ :** 1. విష్ణుపురాణం ప్రకారం పాములు సూర్యుడి రథాన్ని లాగుతాయి.

"వహంతి సన్నగాః ... ... ... ..."

ప్ర. **ఏకాహే వైవ దీర్ఘాం త్రిభు వనప దవీం లంఘయ న్యో లఘిష్ఠః**
**పృష్ఠే మేరోర్గరీయా న్దలితమణిదృష త్త్వింషి పింషఞ్ఛిరాంసి,**
**విశ్వస్యేవోపరిష్టా దపిచ పునరథస్తాదివాస్తాద్రిమూర్ధ్ని**
**బ్రధ్నస్యావ్యాత్సఏవం దురధిగమపరిస్పందనః స్యందనో వః. 65**



**అవ :** రథంయొక్క శరీరచలనం అంతుబట్టదంటున్నాడు.

**ప్రతి :** యః= ఏదైతే; ఏక+అహేనైవ= ఒక్క రోజులోనే (ఒక్కపూటలోనే అని వుద్దేశం); దీర్ఘాం= విశాలమైన; త్రిభువనపదవీం= ముల్లోకాలనే మార్గాన్ని; లంఘయన్= దాటుతూ; లఘిష్ఠః= అల్పమైనదో; పృష్ఠే= వెనుకవైపు; మేరోః= మేరుపర్వతంయొక్క; దళిత= ముక్కలయిన; మణిదృషత్= మణిరాళ్ళచేత; త్వింషి= కాంతిమయమైన; శిరాంసి= శిఖరాలను; పింషన్= చూర్ణంచేస్తూ; గరీయాన్= గొప్పదో; విశ్వస్య= ప్రపంచంయొక్క; ఉపరిష్టాత్ అపి= పై భాగములో కన్పిస్తూకూడ; పునః= మరల అంతలోనే; అస్తాద్రిమూర్ధ్ని= అస్తాచల శిఖరమందు; అధస్తాత్= క్రింది భాగానికి వచ్చిందో; ఏవం= ఈ విధంగా; దురధిగమ పరిస్పందనః= అంతుబట్టని ప్రవృత్తిగల (నడకగల); సః= ఆ; బ్రధ్నస్య= సూర్యునియొక్క; స్యందనః= రథము; వః= మిమ్మల్ని; అవ్యాత్= రక్షించుగాక!

**తా :** రథము ఒక్క పగటిలోనే విశాలమైన త్రిలోకమార్గాన్ని ప్రయాణిస్తున్నప్పటికీ తానుమాత్రం చిన్నది. మేరుపర్వత శిఖరం మీద రాళ్ళను చూర్ణంచేయడంలో మాత్రం పెద్దది. ఆకాశంపై భాగాన కన్పించిన రథం అంతలోనే అస్తాద్రికి చేరుకొని క్రిందగా ఉన్నట్లు కన్పిస్తుంది. ఈ విధంగా అగమ్యగోచరమైన ప్రవృత్తి (ప్రచారం, నడక) సూర్యరథం మిమ్మల్ని కాపాడుగాక!

**విశే :** పరమాత్మస్వరూపం మాదిరిగానే రథంకూడ ఆశ్రయ భేదాన్నిబట్టి రూపవైవిధ్యం కలిగి దురవగాహమైన తత్వంతో భాసిస్తున్నదని మయూరుడి ఉద్దేశం కావచ్చు.

ప్ర. **ధూర్ధ్వస్తాగ్ర్యగ్రహాణి ధ్వజపటపవనాందోళితేందూని దూరం**
**రాహౌ గ్రాసాభిలాషాదనుసరతి పునర్దత్తచక్రవ్యథాని,**
**శ్రాంతాశ్వశ్వాసహేలా ధుకవిబుధధునీ నిర్ఝరాంభాంసి భద్రం**
**దేయాసు ర్వో దవీయో దివి దివసపతేస్స్యందన ప్రస్థితాని;* 66**

**అవ :** తన ప్రయాణంలో రథంచేస్తున్న ఘనకార్యాలను చెబుతున్నాడు.

**ప్రతి :** ధూః= తనయొక్క (రథం) బరువుచేత; ధ్వస్త= ధ్వంసం చేయబడిన; అగ్ర్యగ్రహాణి= కుజుడు మొ॥ గ్రహాలుకలిగినట్టి; ధ్వజపట= కేతనంగా గలిగిన వస్త్రముయొక్క; పవన= గాలిచేత; ఆందోళిత= ఆందోళపరచబడిన (కలవరం); ఇందూని= చంద్రుడు కలిగినట్టి; దూరం= మిక్కిలి; గ్రాస+అభిలాషాత్= మింగాలన్న కోరికతో; రాహౌ= రాహువు (చీకటికి పర్యాయార్థంలో); అనుసరతి= అనుసరిస్తుండగా; పునః= మరల; దత్త= ఇవ్వబడిన; చక్రవ్యథాని= చక్రభయం కలిగినట్టి [1] (రాహువు వేంబడించేటప్పుడు చక్రంచేత భయపెట్టి); శ్రాంత= అలసిపోయిన; అశ్వ= గుర్రాలయొక్క; శ్వాస= నిట్టూర్పులయొక్క; హేలా= విలాసంచేత; ధుత= కంపితమైన; విబుధధునీ= ఆకాశగంగయొక్క; నిర్ఝర+అంభాంసి= సెలయేటి (ప్రవాహపు) నీరు కలిగినట్టి; దివి= గగనమందు; దవీయః= మిక్కిలి దూరంగావున్న; దివసపతేః= సూర్యునియొక్క; స్యందన ప్రస్థికాని= రథంయొక్క నడవడులు; వః= మీకు; భద్రం= శుభాన్ని; దేయాసుః= ఇచ్చుగాక!

**తా :** తనబరువుచేత ధ్వంసంచేయబడిన గ్రహాలుకలిగి, జెండాగా కట్టిన వస్త్రంయొక్క వేగమైన గాలిచేత కంపించిపోయిన చంద్రుడు గలిగి, మింగాలన్న కోరికతో వెంబడిస్తున్న రాహువును చక్రంచేత భయపెట్టి గుర్రాల నిట్టూర్పులచేత కల్లోలపరచబడిన గంగాప్రవాహం కలిగి సాగిపోతున్న రథగమనాలు మీకు శుభాన్ని ప్రసాదించుగాక!

**వివ :** * శ్రీనాథుని అనువాదం వుంది (కాశీ. 1-127).

1. అమృతపాన సమయంలో విష్ణు సుదర్శనంచేత తలతెగిపోయిన రాహువు అందుకు కారణమైన సూర్యుణ్ణి మింగాలని వెంటబడుతుంటే రథం తన చక్రంచేత భయపెడుతున్నది. అంటే ఆ చక్రం విష్ణుచక్రంలా వుందని అందుకే రాహువు భయపడుతున్నాడని కవిభావన.



స్ర. **అక్షే రక్షాం నిబధ్య ప్రతిసరవలయై ర్యోజయంత్యో యుగాగ్రం**
**ధూస్స్తంభే దత్తధూపాః ప్రహితసుమనసో గోచరే కూబరస్య,**
**చర్చాం చక్రే దధత్యో మలయజరజసా సిద్ధవధ్వ స్త్రిసంధ్యం**
**వందంతే యం ద్యుమార్గే సనుదతుదురితాన్యంశుమత్స్యందనో వః 67**

**అవ :** సిద్ధాది దేవస్త్రీలచేత పూజింపబడుతున్న రథాన్ని వర్ణిస్తున్నాడు.

**ప్రతి :** అక్షే= ఇరుసునందు; రక్షాం= రక్షాబంధనాన్ని; నిబధ్య= కట్టి; యుగాగ్రం= బండికాడిమానును; ప్రతిసరవలయైః= కంకణ విశేషాలచేత; యోజయంత్యః= అలంకరించినవారై; ధూఃస్తంభే= రథ అగ్రభాగమందు; దత్తధూపాః= ధూపం వేసినవారై; కూబరస్య గోచరే= సారథికూర్చుండు ప్రదేశమందు (తొట్టి); ప్రహితసుమనసః= పూలుజల్లినవారై; చక్రే= చక్రమందు; మలయజరజసా= చందనపు పొడితో (రసం అనికూడ); చర్చాం= పూతను; దధత్య= ఇచ్చినవారై; సిద్ధవధ్వః= సిద్ధజాతి స్త్రీలు; త్రిసంధ్యం= ముప్పూటలా; యం= దేని (క్రి)నైతే; ద్యుమార్గే= ఆకాశమందు; వందంతే= నమస్కరిస్తున్నారో; సః= ఆ; అంశుమత్ స్యందనః= సూర్యరథము; వః= మీయొక్క; దురితాని= పాపాలను; నుదతు= తొలగించుగాక!

**తా :** అక్షానికి రక్షాసూత్రంకట్టి కాడికి కంకణాలుకట్టి బండిపోలుకు పొగపెట్టి, తొట్టిలో పూలుజల్లి నిత్యం సిద్ధస్త్రీలు సేవలుచేస్తున్న సవితృస్యందనం మీ దురితాలను తొలగించుగాక!

**విశే :** ఇందులో మయూరుని లోకజ్ఞత కొనియాడదగినది. ఏరువాక సాగినప్పుడుగాని బళ్ళమీద ఏదైనా జాతరకు లేక పుణ్యక్షేత్రాలకు పోయేటప్పుడుగాని, కొత్తగా కొన్న వాహనాలను (మోటారుబండ్లతో సహా) ప్రారంభించేటప్పుడుగాని స్త్రీలు ఎదురుగావచ్చి దిష్టితీసి పసుపు పూసి పూలుజల్లి కొబ్బరికాయకొట్టి పూజించడం భారతీయ సంప్రదాయం. అదేపద్ధతి సూర్యరథానికి ఆపాదింపబడింది.

స్ర. ఉత్కీర్ణ స్వర్ణరేణుద్రుతఖురదళితా పార్శ్వయోశ్శశ్వదశ్వై
రశ్రాంతభ్రాంతచక్రక్రమనిఖిలమిల న్నేమినిమ్నా భరేణ
మేరోర్మూర్ధన్యఘం వో విఘటయతు రవే రేతవీథీ రథస్య
స్వోష్మోదక్తాంబురిక్త ప్రకటితపులినోద్ధూసరా స్వర్ధునీవ. 68

**అవ :** రథంయొక్క మార్గం గంగానదిలావుందని చెబుతున్నాడు.

**ప్రతి :** అశ్వైః= గుర్రాలచేత; శశ్వత్= మాటిమాటికి; పార్శ్వయోః= రెండుప్రక్కల; ఉత్కీర్ణ= పైకి చిమ్మబడిన; స్వర్ణరేణు= బంగారుధూళిగల; ద్రుత= వాడియైన; ఖుర= గిట్టలచేత; దళితా= చీల్చబడినట్టిదియూ; భరేణ= బరువుచేత (ముందుబరువు); అశ్రాంత= అనవరతం(ఎల్లప్పుడు); భ్రాంత= తిరుగుటగల; చక్ర= చక్రంయొక్క; క్రమ= ఆక్రమణంచేతగల; నిఖిల= సమగ్రంగా; మిలత్= కూడుతున్న; నేమి= అందుచేత (చక్రం అంచు); నిమ్నా= అవనతతమైనట్టిదియూ (బరువుతో బండివుంటే చక్రం అంచు నేలమీద గాడిని స్పష్టం చేస్తుంది); మేరోః= మేరుపర్వతంయొక్క; మూర్ధ్ని= శిఖరంమీద; స్వ= తనయొక్క; ఊష్మ= వేడిచేత; ఉదక్త= ఆకర్షింపబడిన; అంబురిక్త= నీటి శూన్యతచేత (నీరు ఇంకడం); ప్రకటిత= స్పష్టమైన; పులిన= ఇసుకతిన్నెలయొక్క; ఉద్ధూసరా= పాండువర్ణం కలదియైన; స్వర్ధునీవ= గంగానదిలాంటి; రవేః= సూర్యునియొక్క; రథస్య= రథముయొక్క; ఏకవీథీ= ప్రధాన (ఒకే) మార్గం; వః= మీయొక్క; అఘం= పాపాల్ని; విఘటయతు= పోగొట్టుగాక!

**తా :** రెండుపక్కలా గుర్రాలయొక్క బంగారు ధూళినిలేపగల గిట్టలచేత చీల్చబడినదీ; ఎప్పుడూ తిరుగుతన్న చక్రభారపుటంచుచేత కుంగినట్టిదీ, తన వేడిమిచేత ఇంకిపోయిన నీరుకలిగి స్పష్టము చేయబడిన ఇసుకరేణువులచేత పాండువర్ణము గలిగి గంగానదిలా వున్న సూర్యరథ ప్రధాన (ఏకైక) మార్గము మీ పాపాన్ని పోగొట్టుగాక!

**అలం :** శ్లేష



**విశే :** చివరి రెండు పాదాలు గంగానదికి కూడ అన్వయిస్తాయి. వేగంగా పరుగెత్తుతున్న గుర్రాల గిట్టలచేత లేచిన ధూళి గంగానదికి ఇరుపక్కల వుంటుంది. అలాగే రథగమనజనిత ఉష్ణ కారణంగా ఆవిరైపోయిన నీరుకలిగి ఇసుక బయటపడి పాండువర్ణంతో నది ప్రకాశిస్తుంది. ఈ రెండు విశేషణాలు రథమార్గానికి, నదికీ అన్వయించడం శ్లేషద్వారా సాధ్యం.

స్ర. నంతుం నాకాలయానా మనిశమువయతాం పద్ధతిః పఙ్క్తిరేవ
క్షోదో నక్షత్రరాశే రకృశరయమిళచ్చక్రపిష్టస్య ధూళిః
హేషా హ్రాదో హరీణాం సురశిఖరిదరీః పూరయన్నే మినాదో
యస్యావ్యాత్త్రిప్రభానో స్సదివిభువి యథావ్యక్తచిహ్నోరథోవః 69

**అవ :** అంతరిక్షంలో ప్రయాణిస్తున్న రథానికి భూలోకప్రయాణ తుల్యత ఆపాదింపబడుతున్నది.

**ప్రతి :** అనిశం= ఎల్లప్పుడూ; నంతుం= నమస్కరించుటకు; ఉవయతాం= వస్తున్న; నాక+ఆలయానాం= స్వర్గవాసులైన దేవతల యొక్క; పంక్తిః ఏవ= వరుసయే; పద్ధతిః= మార్గము; అకృశరయ= అమితవేగముచేత; మిళత్= సంసక్తమైన (తగుల్కొన్న); చక్రపిష్టస్య= చక్రపు అంచుకింద నలిగిన; నక్షత్రరాశేః= నక్షత్ర సమూహముయొక్క; క్షోదః= చూర్ణము; ధూళిః= దుమ్ము; సురశిఖరి దరీః= మేరుపర్వత గుహలను; పూరయన్= పూరిస్తున్న; హరీణాం= సూర్యాశ్వాలయొక్క; హేషాహ్రాదః= సకిలింపుధ్వని; నేమినాదః= చక్రపు అంచుచేస్తున్న శబ్దములు; యస్య= ఏ రథాని కైతే; దివి= స్వర్గమందును; భువియథా= భూమ్మీదలాగ కలవో; వ్యక్తచిహ్నః= స్పష్టమైన పై లక్షణాలుగల; సః= ఆ; భానోః= సూర్యునియొక్క; రథః= రథము; వః= మిమ్మల్ని; అవ్యాత్= రక్షించుగాక!

**తా :** స్వర్లోక ప్రయాణంచేస్తున్న సూర్యరథానికి భూమ్మీద వెళ్తున్న రథానికి మాదిరిగా లక్షణాలు ఉన్నాయి. భూమిమీద రథానికున్న మార్గంలాంటిది

సూర్యరథానికి నమస్కరిస్తున్న దేవతల పంక్తి. నేలమీద చక్రం కిందనలిగి లేచిన దుమ్ము అంతరిక్షంలో నక్షత్ర చూర్ణం భూమీ్మద చక్రధ్వని ఆకాశంలో సూర్యాశ్వాల సకిలింపు ధ్వని. అటువంటి సూర్యరథము మిమ్మల్ని కాపాడుగాక!

**అలం :** ఉపమ.

ప్ర. **నిస్పంధానాం విమానావళివితతదివారి దేవబృందారకాణాం**
**బృందైరానందసాంద్రోద్యమమపి వహతాం విందతాం వందితుం నో**
**మందాకిన్యామమందః పులినభృతి మృదుర్మందరే మందిరాభే**
**మందారై ర్మండితారం దధదరి దినకృత్స్యందనస్స్తాన్ముదేవః 70**

**అవ :** వేగంగా పోతున్న రథం దేవతల పూజలందుకోవడాన్ని చెబుతున్నాడు.

**ప్రతి :** విమానావళి= పుష్పకాది విమానాలతో; వితత= నిండిన; దివాం= ఆకాశముగల్గి; నిఃస్పందనాం= అలసటకల్గియు; సాంద్రోద్యమం= హర్షాతిరేకముతో; వహతాం= పరుగెత్తుతూ; విందతాం అపి= ఆసన్నులైనప్పటికీ; దేవబృందారకాణాం బృందైః= దేవముఖ్యుల యొక్క సమూహాలచేత; వందితుం= నమస్కరించుటకు; న= వీలుకాలేదు; అయినప్పటికీ; పులినభృతి= ఇసుకమయమ్మైన; మందాకిన్యాం= గంగాతీరమందు; అమందః= శీఘ్రగమనం కల్గిననూ; మందిర+అభే= నగర సదృశమైన (మందిరానికి ఔపచారికంగా నగర మనే అర్థం గ్రహించాలని త్రిభువనపాలవ్యాఖ్య); మందరే= మందర పర్వత ప్రాంతమందు; మృదుః= మందగమనంకల్గి; దేవబృందముచేత; మందారైః= మందారపుష్పాలచేత; మండిత= అలంకరింపబడిన; అరం= చక్రపు ఆకులుగలిగిన; అరి= చక్రాన్ని; దధత్= ధరిస్తున్న; దినకృత్స్యందనః= సూర్యునిరథము; న= మీయొక్క; ముదే= సంతోషంకోసం; స్తాత్= అగుగాక!

**తా :** సూర్యుణ్ణి స్తోత్రం చేయడానికివచ్చిన దేవతల విమానాలతో ఆకాశం నిండిపోయింది. ఎంత అలసటచెందినా ఉత్సాహంగా పరుగెత్తుతున్న



దేవతలకు సమీపంలోనే రథం ఉన్నప్పటికి వేగాతిశయ కారణంగా నమస్కరించడానికి వీలులేకపోయింది. గంగా తీరంలోని ఇసుకలో సైతం వేగంగా నడిచిన రథం మంధర పర్వతప్రాంతంలో మందగించి మొత్తంమీద దేవబృందంచేత మందార పుష్పాలచేత పూజలందుకున్నది. అటువంటి రథం మీకు సంతోషాన్నిచ్చుగాక!

**అలం :** అనుప్రాసం. ('ంద' వర్ణావృత్తి)

**వివ :** సహజంగా లోకంలో బండిచక్రం ఇసుకలో ఇరుక్కుపోయి చదరమైన నగరవీథుల్లో వేగంగా దూకుతుంది. సూర్యరథ చక్రం అలాగాక ఇసుకతిన్నెలో వేగంగా నడిచి నగరసదృశమైన మందర పర్వతప్రాంతంలో మాత్రం మందగించింది. అందుకు కారణం పర్వతానికి వుండే మలుపులు, ఎత్తుపల్లాలు రథగమనాన్ని అడ్డగించడమే. అంటే సూర్యకాంతి ఇసుకతిన్నె సమతలంగా, స్పష్టంగా వుంటుంది కాబట్టి వేగంగా ప్రసరించి నగరాల్లో మాదిరిగా సౌధాలలాంటి పర్వత గుహల్లో గుండా ఆలస్యంగా ప్రసరిస్తున్నదని చమత్కారం.

ప్ర. **చక్రీ చక్రారపఙ్క్తిం హరిరచన హరీన్ ధూర్జటిర్ధూర్ధ్వజాంతా**
**నక్షం నక్షత్రనాథోఽరుణమపి వరుణః కూబరాగ్రం కుబేరః,**
**రంహస్సంఘస్సురాణాం జగదువకృతయే నిత్యయుక్తస్య యస్య**
**స్తౌతి ప్రతిప్రసన్నోఽన్వహమహిమరుచేస్సోఽవతాత్స్యందనో వః. 71**

**అవ :** రథంలోని ఏ భాగాలను ఏ దేవతలు పూజిస్తున్నారో చెబుతున్నాడు.

**ప్రతి :** జగత్+ఉపకృతయే= లోకోపకారార్థం; నిత్యయుక్తస్య= ఎప్పుడూ తన పనిలో నిమగ్నమైన; యస్య= దేనియొక్క; చక్రార పంక్తిం= చక్రపు ఆకులవరుసను; చక్రీ= విష్ణువు; హరీన్= గుర్రాలను; హరిః అపిచ= ఇంద్రుడున్నూ (హరియైనా హరులను పూజించాల్సిందే); ధూర్ధ్వజ+ అంతాన్= రథముయొక్క ముందుదిక్కును చూపు పతాకాగ్రాలను; ధూర్జటిః= శివుడున్నూ; అక్షం= ఇరుసును; నక్షత్రనాథః= చంద్రుడున్నూ; అరుణం=

అనూరుని; వరుణఃఅపి= వరుణుడున్నూ; కూబరం= బండినొగను (పోలు); కుబేరః= కుబేరుడున్నూ; రంహః= వేగాన్ని; సురాణాం సంఘః= దేవతా సమూహమూ; స్తౌతి= స్తుతించుతున్నారో; అహిమరుచేః= వేడికిరణాలుగల సూర్యునియొక్క; ప్రీతిప్రసన్నః= ప్రేమచేత సంతుష్టమైన; సః= ఆ రథము; వః= మిమ్మల్ని; అను+అహం= ఎల్లప్పుడు; అవతాత్= రక్షించుగాక!

**తా :** లోకోపకారంకోసం నిరంతరయానం చేస్తున్న సూర్యరథంయొక్క చక్రపు ఆకులు విష్ణువుచేత, గుర్రాలు ఇంద్రునిచేత, పతాకాగ్రము శివునిచేత, ఇరుసు చంద్రునిచేత, సారథియైన అనూరుడు వరుణునిచేత, బండినొగ కుబేరునిచేత పూజింపబడుతున్నాయి. అటువంటి సూర్య సంతుష్టమైన రథముమిమ్మల్ని ఎల్లప్పుడూ కాపాడుగాక.

**విశే :** ఈ శ్లోకం మమ్మటుడి కావ్యప్రకాశలో ఇవ్వబడింది. (680వ శ్లోకం) (1965 పూనా–పుట. 770) అందులో అనుప్రాసలోని ప్రసిద్ధి విరోధదోషాని కుదాహరణంగా వుంది. ఇక్కడ మయూరుడు తన ప్రతిభచేత యమకాన్ని చక్కగా పోషించాడు. దేవతలు తమ పేర్లలోని సామ్యాలను (శాబ్దిక) బట్టి రథంలోని భాగాలను పూజించినట్లు చమత్కరింపబడింది.

ప్ర. **నేత్రా హీనేన మూలే విహితపరికర స్సిద్ధసాధ్యై ర్మరుద్భిః**
**పాదోపాంతేస్తుతోఽ లం బలిహరిరభసా కర్షణాద్బద్ధవేగః,**
**భ్రామ్య న్వ్యోమాంబురాశా వశిశిరకిరణస్యందనస్సంతతం వో**
**దిశ్యాల్లక్ష్మీమతుల్యా మతులితమహిమేవావరో మందరాద్రిః. 72**

**అవ :** రథం మందరపర్వతం లాంటిదని చెబుతున్నాడు.

**ప్రతి :** నేత్రాహీనేన= అంగవికలత్వంచేత అల్పుడైన నాయకునిచేత; (నేత్ర+అహి+ఇనేన= కవ్వపుతాడైన సర్పరాజుచేత అని మందరపక్షం); మూలే= ముందుభాగాన (అథోభాగన); విహితపరి కరిః= కృతోత్సాహము కల్గినదీ (కృత పరివేష్టనము కలిగినది); పాద+ఉపాంతే= చక్రసమీపంలో (పర్యతసమీప భూమిచెంత); సిద్ధసాధ్యైః= సిద్ధసాధ్య దేవవిశేషాలచేత



(రెంటనూసమానం); మరుద్భిః= వాయువులచేత (దేవతలచేత); అలం= మిక్కిలి; స్తుతః= పొగడబడినదీ; బలిహరి= శక్తివంతాలయిన గుర్రాలయొక్క (బలి, ఇంద్రులయొక్క); రభసాకర్షణాత్= ఉత్కంఠతోకూడి లాగడంవలన; బద్ధ= పొందిన; వేగః= వేగముకలదీ అయిన; వ్యోమ+అంబురాశౌ= ఆకాశమనెడి సముద్రమందు; భ్రామ్యత్= తిరుగుతున్న; అతులితమహిమా= అసమాన ప్రభావంగల; అపరమందరాద్రిః= మరో మందర పర్వతంలాంటి; అశిశిరకిరణ= సూర్యునియొక్క; స్యందనః= రథము; వః= మీకు; సంతతం= ఎల్లప్పుడూ; అతుల్యాం= సాటిలేని; లక్ష్మీం= సంపదను; దిశ్యాత్= ఇచ్చుగాక!

**తా :** క్షీరసాగర మథనంలో మందరపర్వతాన్ని చిలకడానికి త్రాడులా ఉపయోగించబడ్డ వాసుకిలా రథాన్ని తోలడానికి అనూరుడున్నాడు. పర్వతానికి చెంత నిలబడి దేవాదులు స్తోత్రం చేసినట్లే రథాన్నికూడ స్తోత్రం చేస్తున్నారు. బలిచక్రవర్తి, ఇంద్రులులాగడం చేత పర్వతంవేగం అందుకున్నట్లు బలవంతమైన గుర్రాలవల్ల రథం వేగం అందుకున్నది. ఈ విధంగా ఆకాశమనే సముద్రంలో మందరపర్వతంలా తిరుగుతున్న రథం మీకు సంపదలిచ్చుగాక!

**అలం :** శ్లేష, ఉపమ, రూపకాలు,

**విశే :** ఇందులో శ్లేష విశేషంగా పోషింపబడింది. నేత్ర+అహీ నేన అన్నప్పుడు నేత్రశబ్దానికి కవ్వపుత్రాడని అర్థం. "నేత్రం మథిగుణే వస్త్రే తరుమూలే విలోచనే" అని విశ్వకోశం. మంథానం మందరం కృత్వా నేత్రం కృత్వాచవాసుకిం" అని పురాణవచనం. నేత్రభూతో అహీనః అని శాకపార్థివాది సమాసం కాని నేత్రంత తదహీనశ్చ అని కర్మధారయంగాని చెప్పుకోవచ్చు. నేత్ర+హీనేన; నేత్ర+అహీనేన అనుచోట సభంగాభంగ శ్లేష. మరుత్, బలిహరి, పాద, శబ్దాల్లో అభంగశ్లేష.

***ఇంతటితో 'బాలప్రభ'తో కూడిన "రథవర్ణనం" ముగిసింది.***

# మండలవర్ణనమ్

**స్ర. యజ్జ్యాయో బీజమహ్నా మపహతతిమిరం చక్షుషా మంజనం య**
**ద్ద్వారం యన్ముక్తిభాజాం యదఖిలభువనజ్యోతిషామేకమోకః**
**యద్వృష్ట్యం బోనిధానం ధరణిరససుధాపానపాత్రం మహద్య**
**ద్దిశ్యాదీశస్య భాసాం తదవికలమలం మంగళం మండలం వః. 73**

**అవ :** ఇకనుంచి ఎనిమిది శ్లోకాల్లో మండలాన్ని వర్ణిస్తున్నాడు. సూర్య మండలముయొక్క అనేక రూపత్వాన్ని చెబుతున్నాడు.

**ప్రతి :** యత్= ఏదైతే; అహ్నాం= దినములకు (పగళ్లకు); జ్యాయః= ప్రశస్తమైన; బీజం= కారణమో; యత్= ఏది; చక్షుషాం= కళ్లకు; అపహతతిమిరం= అంధకారమనే దోషాన్ని పోగొట్టిన; అంజనం= కాటుకయో; యత్= ఏది; ముక్తిభాజాం= మోక్షాన్ని పొందు యోగులకు; ద్వారం= వాకిలియో; యత్= ఏది; భువనజ్యోతిషాం= ముల్లోకాల్లోని వెలుగులకు; ఏకం= ప్రధానమైన; ఓకః= స్థానమో; యత్= ఏది; వృష్టి= వర్షకారణంగా; అంభోనిధానం= నీటికాధారమో; యత్= ఏది; ధరణి= భూమియందలి; రస= నీరు అనెడి; సుధా= అమృతానికి; మహత్= గొప్ప; పానపాత్రం= తాగెడి పాత్రికయో (నీటిని పీల్చడం); తత్= అటువంటి; భాసాం ఈశస్య= కాంతినిధియైన సూర్యునియొక్క; మండలం= మండలము (ప్రకాశించు వలయం); వః= మీకు; అవికలం= పరిపూర్ణమైన; మంగళం= శుభాన్ని; అలం= మిక్కిలి; దిశ్యాత్= ఇచ్చుగాక!

**తా :** ఏది పగటికి బీజమో, ఏది కంటికి కాటుకలా దోషహారియో, ఏది ముల్లోకాలకు వెలుగునిస్తుందో, ఏది నీటికి ఆధారమో, ఏది భూమియందలి నీరనే అమృతపానానికి చషకమో (గ్లాసులాంటి పాత్రమో) అటువంటి సూర్యమండలం మీకు శుభాన్నిచ్చుగాక!



**స్ర. వేలావర్ధిష్ణు సింధోః వయ ఇవ ఖమివార్ధోద్గతాగ్ర్యగ్రహోడు**
**స్తోకోద్భిన్నస్వచిహ్నా ప్రసవమివమధోరాస్యమస్యన్మనాంసి,**
**ప్రాతః పూష్ణోఽ శుభాని ప్రశమయతు శిరశ్శేఖరీభూతమద్రేః**
**పౌరస్త్యస్యోద్గభస్తి స్తిమితతమతమఃఖండనంమండలం వః. 74**

**అవ :** సూర్యమండలం ఒక్కొక్క గుణాన్నిబట్టి ఒక్కొక్క విధంగా భాసిస్తుందంటున్నాడు.

**ప్రతి :** వేలావర్ధిష్ణు= సమయాన్నిబట్టి పెరిగే స్వభావంగల (చెలియలికట్టను అధిగమించే); సింధోః పయః ఇవ= సముద్రపు నీరు వలె; అర్ధ+ఉద్గత+ అగ్ర్యగ్రహ+ఉడు= కొద్దిగా మాత్రమే కన్పించు ప్రధాన గ్రహ, నక్షత్రాలుగల; ఖంఇవ= ఆకాశంలాగ; స్తోక+ఉద్భిన్న= కొద్దిగా విప్పారిన (వెలువడిన); స్వ= తనయొక్క; చిహ్న ప్రసవం= లక్షణాల పుట్టుకగల్గి (కొద్దిగా వికసించిన తన లక్షణమైన పూలుకలిగి); మనాంసి= మనసులను; అస్యన్= హరించు; మధోః ఆస్యమివ= మధుమాసారంభంలాగ వుండి; ఉద్గభస్తి= కిరణావిర్భావంచేత; స్తిమిత తమ= బాగా ఆర్ద్రమైన; తమఃఖండనం= చీకటినాశంగల్గి; ప్రాతః= ప్రాతఃకాలములో; పౌరస్త్యస్య+అద్రేః= మేరుపర్వతానికి లేక ఉదయాద్రికి; శిరః శేఖరీభూతం= శిరోభూషణ సదృశమైన; పూష్ణఃమండలం= సూర్యమండలము; వః= మీయొక్క; అశుభాని= అప్రియాలను; ప్రశమయతు= ఉపశమింపజేయుగాక!

**తా :** ఉదయకాలమందు గాఢమైన చీకటినిపోగొట్టి సమయం ప్రకారం ఒకపద్ధతిలో వృద్ధిని ప్రదర్శించే సముద్రజలం మాదిరిగాను, తూర్పు దిక్కునందలి నక్షత్రాదులన్నింటిని కాంతిహీనంచేసే ఆకాశం మాదిరిగాను, తన అంతర్గుణంవల్ల కొద్దిగా మాత్రమే ఉదయించి అప్పుడే వికసిస్తున్న పూలతో మనసుహరించే మధుమాసారంభం మాదిరిగాను వుండి మేరుపర్వతానికి ఆభరణాయమానమైన సూర్యమండలం మీ అప్రియాలను తగ్గించుగాక!

**అలం :** శ్లేష, ఉల్లేఖాలు, మరియు ఉపమ.

ప్ర. **ప్రత్యుప్తస్తప్త హేమోజ్జ్వలరుచిరచలః పద్మరాగేణ యేన**
**జ్యాయః కింజల్కపుంజం యదలికులశితేరంబరేందీవరస్య,**
**కాలవ్యాళసచిహ్నం మహితతమమహో మూర్ధ్నిరత్నం మహద్య**
**ద్దీప్తాంశోః ప్రాతరవ్యా త్తదవికలజగన్మండనం మండలం వః. 75**

**అవ :** సూర్యమండలంయొక్క బహురూపత్వం చెబుతున్నాడు.

**ప్రతి :** యేన= ఏరవిమండలమనే; పద్మరాగేణ= పద్మరాగమణి కాంతిసముహముచేత; తప్త= కాల్చబడిన; హేమ+ఉజ్జ్వలరుచిః= బంగారములా ప్రకాశించే కాంతిగల; అచలః= మేరుపర్వతం; ప్రత్యుప్తః= తాపబడినదో; యత్= ఏది; అళికులశితేః= తుమ్మెదల గుంపులా నల్లవైన; అంబర+ఇందీవరస్య= ఆకాశమనే నల్లకలువకు (యొక్క); జ్యాయః= శ్రేష్ఠమైన; కింజల్కపుంజం= పుప్పొడి ధూళియో;(పద్మరాగకేసరపంక్తి); యత్= ఏది; కాలవ్యాళస్య= కాలమనే నల్లత్రాచుయొక్క; చిహ్నం= గురుతైన మణియో; అలాగే, అహఃమూర్ధ్ని= పగలు అనే తలమీది; మహితతమం= పూజింపబడిన; మహత్= గొప్పదైన; రత్నం= రత్నమో; తత్= ఆ; జగత్+మండనం= లోకాభరణమైన; దీప్త+అంశోః= సూర్యునియొక్క; ప్రాతః= ఉదయకాలమందలి; మండలం= మండలము; వః= మిమ్మల్ని; అవికలం= సంపూర్ణంగా; అవ్యాత్= కాపాడుగాక!

**తా :** ఏ రవిమండలమనే పద్మరాగమణిచేత బంగారుకొండ తాపబడినదో, ఏది ఆకాశమనే కలువయొక్క పుప్పొడి రాశియో, ఏది కాలసర్పానికి చిహ్నమైన శిరోరత్నమో; పగటితలమీది అనర్ఘరత్నమో అట్టి రవిమండలము మిమ్మల్ని రక్షించుగాక!

ప్ర. **కస్త్రాతా తారకాణాం పతతి తనురవశ్యాయబిందుర్యథేందు**
**ర్నిద్రాణా దృక్స్మరారే రురసి మురరిపోః కౌస్తుభో నోద్గభస్తిః,**



**వహ్నేస్సాపహ్నవైన ద్యుతిరుదయగతే యత్రతన్మండలం వో**
**మార్తాండియం పునీతా ద్దివిభువి చ తమాంసీవ ముష్ణన్మహాంసి. 76**

**అవ :** సూర్యమండలం కన్పించగానే తేజస్సులన్నీ (లోకంలోని) బలహీనమైనట్లు చెబుతున్నాడు.

**ప్రతి :** యత్ర ఉదయగతే= ఏది ఉదయించగానే; తనుః= అల్పుడైన; ఇందుః = చంద్రుడు; అవశ్యాయబిందుః యథా= మంచు బిందువులాగ; పతతి= అదృశ్యమవుతుండగా; తారకాణాం= నక్షత్రాలకు ఇక; త్రాతా= రక్షకుడు; క= ఎవడు?; స్మరారేః= మన్మథ విరోధియైన శివునియొక్క; దృక్= నేత్రము (చూపు); నిద్రాణా= కాంతిహీనమైనది (నిద్రపోతున్నది); మురరిపోః= విష్ణువుయొక్క; కౌస్తుభః= కౌస్తుభమణి; న ఉద్గభస్తిః= కాంతిమంతముకాదు; వహ్నేః= అగ్నియొక్క; ద్యుతిః= కాంతి; సాపహ్నవాఏవ= అపలాపముతోనే కూడినట్టిది (మోసముతో ఉన్నదేకాని యథార్థంకాదు); దివిభువిచ= స్వర్గభూలోకాల్లోని; మహాంసి= తేజస్సులనుకూడ; తమాంసి ఇవ= చీకట్లలాగ; ముష్టన్= ధ్వంసంచేయు; తత్= ఆ; మార్తాండీయం మండలం= సూర్యమండలము; వః= మిమ్మల్ని; పునీతాత్= పవిత్రము చేయుగాక!

**తా :** సూర్యమండలం కనిపించగానే స్వర్గమర్త్యలోకాల్లోని తేజస్సులన్నీ కాంతి కోల్పోతున్నాయి. చంద్రుడు అస్తమించగానే నక్షత్రాల గతి చెప్పనక్కరలేదు. శివుని మూడవకన్ను నిద్రకుపక్రమించింది. అగ్నికాంతి యథార్థంకాదు. హరికౌస్తుభం వెలవెలా పోతున్నది. అటువంటి సూర్యమండలం మిమ్మల్ని పవిత్రపరచుగాక.

ప్ర. **యత్ప్రాచ్యాం ప్రాక్చకాస్తి ప్రభవతిచయతః ప్రాచ్యసావుజ్జిహానా**
**దిద్ధం మధ్యేయదహ్నో భవతి తతరుచా యేనచోత్సాద్యతేఽహః,**
**యత్పర్యాయేణ లోకా స్రుతవతి జగతాం యచ్చతద్వో**
**విశ్వానుగ్రాహివిశ్వం సృజదపి చ రవేర్మండలం ముక్తయేఽస్తు. 77**

**అవ :** సూర్యమండలం ఆధేయమేగాదు ఆధారముకూడ అంటున్నాడు.

**ప్రతి :** యత్= ఏమండలము; ప్రాక్= మొదట; ప్రాచ్యాం= తూర్పుదిశయందు; చకాస్తి= ఉదయించునో; యత్ ఉజ్జిహానాత్= ఏది ఉదయించడంవలన; అసౌ= ఇది; ప్రాచీప్రభవతి= తూర్పు అని వ్యవహరింపబడుతున్నదో (తూర్పు వ్యవహారకారణం మండలం అని భావం); యత్= ఏది; అహ్నః= పగటియొక్క; మధ్యే= మధ్యలో; ఇద్ధంభవతి= ప్రకాశించునో; యేనతతరుచా= దేనివిశాలమైన కాంతిచేత; అతః ఉత్పాద్యతే చ= పగలుపుడుతున్నదో; యత్= ఏది; పర్యాయేణ= క్రమంగా; లోకాన్= లోకాలను; ప్రతపతి= మిక్కిలి తప్పింపజేస్తున్నదో (అవతి చ పాఠాంతరాన, రక్షించునో అని); యత్= ఏది; జగతాం= లోకాలకు; జీవితం= ప్రాణాధారమో[1]; యత్= ఏది; విశ్వం= ప్రపంచాన్ని; సృజత్ అపి= సృష్టించినా; విశ్వ+అనుగ్రాహి= లోకాన్ని అనుగ్రహిస్తున్నదో; తత్= ఆ; రవేః మండలం= సూర్యమండలము; వః= మీయొక్క; ముక్తయే= మోక్షంకొరకు; అస్తు= అగుగాక!

**తా :** ఏది తూర్పున ఉదయించినా 'తూర్పు' వ్యవహారానికి కారణమో, ఏది పగటిలో ప్రకాశించినా పగటికిహేతువో, ఏది లోకాలను తపింపజేసినా (బాధ పెట్టడం) లోకానికి ప్రాణసదృశమో ఏదివిశ్వాన్ని సృష్టించి అనుగ్రహిస్తుందో ఆ సూర్యమండలం మీకు మోక్షాన్ని కలుగజేయుగాక!

వివ : 1. **"ఆదిత్యాజ్జాయతే వృష్టి ర్వృష్టేరన్నం తతఃప్రజాః ।
ప్రజా సౌఖ్యాచ్చ దేవానాం పరాతృప్తిరితి" శ్రుతిః ॥**
(త్రిభువనపాల వ్యాఖ్యాధారంగా)

శ్ర. **శుష్యంత్యూధానుకారా మకరవసతయో మారవీణాం స్థలీనాం
యేనోత్తప్తాస్స్ఫుటంతో ఝుడితితిలతులాంయాంత్యగేంద్రాయుగాంతే
తచ్చండాంశోరకాండ త్రిభువన దహనాశంకయా ధామకృత్స్నం
సంహృత్యాలోకమాత్రం ప్రలఘు విదధత స్తాన్ముదే మండలంవః 78**



**అవ :** సూర్యమండలానికిగల కారుణ్యబుద్ధిని ప్రదర్శిస్తున్నాడు.

**ప్రతి :** యుగాంతే= ప్రళయకాలమందు; యేక= ఏరవిమండలముచేత; ఉత్తప్తాః= కాల్చబడినవై; మకరవసతయః= మొసళ్ళకు నెలవులైన సరస్సులు (సాగరాలు); మారవీణాం స్థలీనాం= చౌటి (చవుటి) నేలలయొక్క లేక మరుభూములయొక్క; ఊధ+అనుకారాః= సాదృశ్యాన్ని పొందినవై; శుష్యంతి ఎండిపోతున్నాయో (ఇంకిపోయి ఎడారుల్లా కన్పించడం); అగ+ఇంద్రాః= కులపర్వతాలు; ఝుట్+ఇతి= ఝుట్ అను ధ్వనిచేస్తూ; స్ఫుటంతః= పేలాలవాదిరి పేలుతూ; తిలతులాం= నువ్వులతో సామ్యాన్ని (అల్పత్వంసూచితం); యాంతి= పొందుతున్నాయో; అకాండే= అకాలమందు (ప్రళయం); త్రిభువన దహన+ఆశంకయా= ముల్లోకాలు కాలుతాయన్న భయంచేత; కృత్స్నం= పూర్తిగా; సంహృత్య= తన్ను తాను తగ్గించుకొని; ఆలోక మాత్రం= చూడడానికి మాత్రమే సరిపోయిన; ప్రలఘు= అల్పమైన; ధామ= తేజస్సును; విదధతః= ప్రసరింపజేస్తున్న; చండాంశోః= తీక్ష్ణకిరణుడైన సూర్యునియొక్క; తత్మండలం= ఆ మండలము; వః= మీయొక్క; ముదే= సంతోషంకోసం; స్తాత్= అగుగాక!

**తా :** ప్రళయకాలమందు సూర్యకిరణ సంతప్తములయిన మహాసముద్రాలు మరుభూములుగా మారిపోతాయి సప్తకులపర్వతాలు నువ్వుల్లాగ చిటచిట పేలిపోతాయి. కాని ముల్లోకాలు దహింప బడకుండ ఉండేలాగున కంటితో చూడదగిన కాంతిమాత్రమే కలిగి వుండి కారుణ్యబుద్ధిగల సూర్యమండలం మీకు సంతోషాన్నిచ్చుగాక!

శ్ర. **ఉద్యద్ద్యుద్యానవాప్యాం బహులతమతమః పంకపూరం విదార్య
ప్రోద్భిన్నం పత్రపార్శ్వే ష్వవిరళమరుణచ్ఛాయయావిస్ఫురంత్యా,
కల్యానాని క్రియాద్వః కమలమివ మహన్మండలం చండభానో
రన్వీతం తృప్తిహేతో రసకృదలికులాకారిణా రాహుణా యత్. 79**

**అవ :** సూర్యమండలం కమలంలాగ వుందని చెబుతున్నాడు.

**ప్రతి :** యత్= ఏదైతే; ద్యు= ఆకాశమనే; ఉద్యానవాప్యాం= తోటబావి యందలి; బహుళతమ= దట్టమైన; తమః= చీకటి అనెడి; వంకపూరం= బురదసమూహాన్ని; విదార్య= చీల్చుకొని; ఉద్యన్= వెలువడుతున్నదో; అవిరళం= నిర్విరామంగా; విస్ఫురంత్యా= ప్రకాశిస్తున్న; అరుణచ్ఛాయయా= అనూరు కాంతిచేత (ఎర్రని); పత్రపార్శ్వేషు= కమలదళాల అంచులందు (గుర్రాలకు ప్రక్కల); ప్రోద్భిన్నం= రంజితమైనదో (ఎర్రదనంకలిగినదో); అసకృత్= ఎడతెగని; అలికూల+ఆకారిణా= తుమ్మెదలగుంపు ఆకారంగల; రాహుణా= రాహువుచేత; తృప్తిహేతోః= పానకారణంగా (మింగాలన్న కోరికతో); అన్వీతం= సేవింప (వెంబడించ)బడుతున్నదో; తత్= ఆ; కమలం ఇవ= కమలంలాంటి; చండభానోః= సూర్యునియొక్క; మహత్ మండలం= గొప్పమండలము; వః= మీకు; కల్యాణాని= శుభాలను; క్రియాత్= చేయుగాక!

**తా :** రవిమండలం కమలంలాంటిది. కమలం నీటిలోబురద నుంచి పైకి వచ్చినట్లే మండలంకూడ ఆకాశపుష్కరిణిలోని చీకటి అడుసు నుండి వస్తున్నది. ఎర్రని రంగుచేత కమలం భాసించినట్లే అరుణ (అనూరు) కాంతిచేత మండలం శోభిస్తుంది. కమలంలోని మకరందానికి తుమ్మెదల గుంపు చేరినట్లే మండలగత సూర్యునికోసం రాహువనే భ్రమరం చేరుతున్నది. ఇటువంటి మండలం మీకు శుభాన్ని చేయుగాక!

**అలం :** శ్లేష, రూపకం, ఉపమ.

**వివ :** అరుణచ్ఛాయ అనేది శ్లిష్టరూపకం అలాగే పత్రపార్శ్వేషు అనేదికూడ. పత్రం అంటే గుర్రం, కమలదళం అని అర్థాలున్నాయి. కమలంతో మండలానికి అభేదం లేక (తాద్రూప్యం) శ్లేషద్వారాసాధింపబడింది. కనుక శ్లిష్టరూపకం అనవచ్చు.



**స్ర.** **చక్షుర్దక్షద్విషో యన్నతు దహతి పరం పూరయత్యేవ కామం**
**నా స్తం జుష్టం మరుద్భిర్యదిహనియమినాం యానపాత్రం భవాబ్ధౌ**
**యద్వీతశ్రాంతి శశ్వద్భ్రమదపి జగతాం భ్రాంతిమభ్రాంతిహంతి**
**బ్రధ్నస్యావ్యాద్విరుద్ధక్రియమపి విహితాధాయి తన్మండలంవః 80**

**అవ :** సూర్యమండలంలోని అన్యోన్య వైరుధ్యగుణాలను ప్రదర్శిస్తున్నాడు.

**ప్రతి :** యత్= ఏది; దక్షద్విషః= దక్షవిరోధియైన శివునియొక్క; చక్షుః= నేత్రమైనప్పటికీ; నతుదహతి= దహించడంలేదో; పరం= పైగా; కామమేవ= కామాన్ని (మన్మథుణ్ణి) (కోరికను); పూరయతి= పెంచుతున్నదో; యత్= ఏది; ఇహ= భూలోకంలో; మరుద్భిః= గాలులచేత (దేవతలచేత); న అంతం= వినాశాన్ని పొందక (తోయబడక); నియమినాం= యోగులకు; భవ+అబ్ధౌ= సంసారసాగరమందు; జుష్టం= ప్రీతిపాత్రమైన; యానపాత్రం= తరింపజేసే (దాటించే) పడవలాంటిదో; యత్= ఏది; శశ్వత్= మాటిమాటికి; వీతశ్రాంతి= శ్రమలేక; భ్రమత్అపి= తిరుగుతున్నప్పటికీ; జగతాం= లోకాలయొక్క; భ్రాంతిం= మిథ్యాజ్ఞానాన్ని[1] (తిరగడాన్ని); అభ్రాంతి= నిస్సంశయంగా; హరతి= తొలగిస్తున్నదో; తత్= అ; విరుద్ధక్రియమ్ అపి= విరోధస్వభావం కలిగీ; విహిత+అధాయి= మేలుచేకూర్చే; బ్రధ్న స్యమండలం= సూర్యమండలం; వః= మిమ్మల్ని; అవ్యాత్= కాపాడుగాక!

**తా :** ఏది శివుని నేత్రమైన్నప్పటికి కామాన్ని చంపకపోగా పెంచుతున్నదో, యేది సంసారసాగరాన్ని దేనిచేత కదల్చబడని రీతిలో నిశ్చలంగా తరింపజేసేనావయో, యేది నిరంతరం శ్రమిస్తున్నప్పటికీ అలసట ఎరగదో, యేది నిస్సంశయంగా లోకంలోని మిథ్యాజ్ఞానాన్ని తొలగిస్తుందో అట్టి విరుద్ధ ప్రవృత్తిగలిగి మేలుచేసే సూర్యమండలం మిమ్మల్ని కాపాడుగాక!

**అలం :** విరోధం, వ్యతిరేకం (అక్షిప్తం)

**వివ :** శివుడు కామాన్ని (మన్మథుణ్ణి) దహించగా సూర్యమండలం కామాన్ని (కోరికను) పెంచుతున్నది. యోగులకు సంసారసాగర తరణాన పడవలా పనిచేస్తూ గాలులచేత (మరుత్తులు) కదల్చబడక పోవడమేగాదు వాటిచేత (దేవతలచేత) ఆదరింపబడుతున్నది. అలసట లేక తాను తిరుగుతున్నా లోకాల తిరగడాన్ని (భ్రాంతిని, మిథ్యా జ్ఞానాన్ని) తొలగిస్తుంది. ఇది విరుద్ధప్రవృత్తి. శ్లేషద్వారా విరోధ పరిహారం. అంటే కామ శబ్దానికి మన్మథుడు అన్నప్పుడు ఉన్న విరోదాన్ని సూర్యమండల పక్షంలో 'కోరిక' అని చెప్పుకోవాలి. మరుత్ అనే శబ్దానికి గాలి, దేవత అనే రెండర్థాలు చెప్పుకుంటే వ్యతిరేకాలంకారం అవుతుంది. పడవ మరుత్తులచేత ఊగుతుంది. మండలం మరుత్తుల (దేవతలు) చేత పొగడబడుతుంది. కనుక శబ్దశక్తిమూలోత్థాపిత వ్యతిరేకం. అలాగే 'భ్రాంతి' అన్నపుడు తాను తిరుగుతూ లోకాల తిరుగుడు తొలగించడం విరోధం. దానికి 'మిథ్యాజ్ఞానం అని చెప్పుకుంటే పరిహారం.

**వివ :** 1. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥
అని భగవద్గీత

***ఇంతటితో 'బాలప్రభ'తో కూడిన "మండలవర్ణనం" ముగిసింది.***

* * *

# రవివర్ణనమ్

**ప్ర. సిద్ధైస్సిద్ధాంతమిశ్రం శ్రితవిధి విబుధై శ్చారణై శ్చాటుగర్భం**
**గీత్యా గంధర్వముఖ్యై ర్ముహురహిపతిభి ర్యాతుదానైర్యతాత్మ,**
**సార్థంసాధ్యైర్మునీంద్రైర్ముదితతమమనో మోక్షిభిః పక్షపాతాత్**
**ప్రాతః ప్రారభ్యమాణస్తుతి రవతు రవి ర్విశ్వవంద్యోదయో వః* 81**

**అవ :** ఇకనుంచి చివరిదాక అంటే ఇరవైశ్లోకాల్లో రవివర్ణన చేయబడుతుంది. సిద్ధాది దేవగణాలచేత స్తోత్రం చేయబడుతున్న రవిని గూర్చి చెబుతున్నాడు.

**ప్రతి :** సిద్ధైః= సిద్ధులనే దేవవిశేష సంఘంచేత; సిద్ధాంత మిశ్రం= సిద్ధాంతోక్త విధులచేత మిశ్రితమగునట్లుగా (బ్రహ్మ, సూర్య, సోమ, గురు, గర్గ, నారద, పరాశర, పులస్త్యవసిష్ఠ, జ్యోతిష, సిద్ధాంత గ్రంథాలు); విబుధైః= దేవతలచేత; శ్రితవిధి= వేదోక్తంగాను; చారణైః= స్తోత్రాలుచేసే దేవగాయక బృందాలచేత; చాటుగర్భం= ప్రీతికరమైన వాక్యయుక్తముగాను (గుణోద్గార సారంగా); గంధర్వముఖ్యైః= గంధర్వ ప్రముఖులచేత; గీత్యా= పాటలరూపాన; అహి పతిభిః= నాగశ్రేష్ఠులచేత; ముహుః= మాటిమాటికి; యాతుధానైః= పిశాచాది రాక్షసజాతులచేత; యతాత్మ= సంయమనయుక్తంగాను; సాధ్యైః[1]= సాధ్యులచే దేవవిశేషంచేత; సార్థం= అర్థయుక్తంగాను (సార్ఘ్యం అనుపాఠాన పూజాద్రవ్యాదియుక్తంగా); మునీంద్రైః= మునిశ్రేష్ఠులచేత; ముదితతమమనః= మిక్కిలిసంతుష్టమైన హృదయాలతోను; మోక్షిభిః= యోగులచేత; పక్షపాతాత్= ఆత్మభావము వలననూ; ఈ విధంగా; ప్రాతః= ఉదయకాలమున; ప్రారభ్యమాణ స్తుతిః= ప్రారంభింపబడుతున్న స్తోత్రంకల్గి; విశ్వవంద్య+ ఉదయః= ప్రపంచముచేత పూజింపదగినపుట్టుకగల; రవిః= ఆ సూర్యుడు; వః అవతు= మిమ్మల్ని కాపాడుగాక!

**తా :** ఉదయకాలమున సూర్యుణ్ణి పలువురు పలువిధాలుగా స్తోత్రం చేస్తున్నారు. సిద్ధులు సిద్ధాంత మిశ్రితంగా, దేవతలు వేదసమ్మతంగా,

చారణులు ప్రియవాక్య సహితంగా, గంధర్వులు సంగీత యుక్తంగా, నాగప్రముఖులు మాటిమాటికి, రాక్షసాదిగణాలు మనో నిగ్రహంతోనూ, సాధ్యులు అర్ధయుక్తంగానూ, మహర్షులు అత్యంత సంతోషంతోను, యోగులు ఆత్మభావంతోనూ స్తోత్రంచేస్తున్న ఆ రవి మిమ్మల్ని రక్షించుగాక!

**అలం :** దీపకం

**విశే :** ఇటువంటి వర్ణన భారతంలో కన్పిస్తుంది,

"తవ దివ్యరథం యాంతమనుయాంతి వరార్థినః ।
సిద్ధచారణ గంధర్వాః యక్షగుహ్యక పన్నగాః ॥ (3-3-40)

**వివ :** * శ్రీనాథుని అనువాదం వుంది (కాశీ.3-175).

1. సాధ్యంతే ఆరాధ్యంతే ఇతిసాధ్యాః, లేక సాధ్యంసిద్ధిః యేషాం అస్తీతి సాధ్యాః అని వ్యుత్పత్తి (మనువు, మంత్రుడు, ప్రాణుడు, చేతయానుడు, వీర్యవంతుడు, విత్తి, జయుడు, నయుడు, హంసుడు, నారాయణుడు, ప్రభువుడు)

స్ర. **భాసామాసన్న భావా దధికతరపటో శ్చక్రవాలస్య తాపాత్**
**ఛేదాదచ్ఛిన్న గచ్ఛ త్తురగఖురపుటన్యాసనిశ్శంకటంకైః,**
**నిస్సంగస్యందనాగ్రభ్రమణనికషణా త్పాతు వస్త్రి ప్రకారం**
**తప్తాంశు స్తత్పరీక్షా వర ఇవ పరితః పర్యటన్హాటకాద్రిమ్. 82**

**అవ :** రవి స్వర్ణ పరీక్షాధికారిగా చెప్పబడుతున్నాడు.

**ప్రతి :** ఆసన్నభావాత్= మేరుపర్వతానికి బాగా సన్నిహితంగా వున్న కారణంగా; అధికతరపటోః= మిక్కిలి తీవ్రంగావున్న; చక్రవాళస్య= సూర్యమండలంయొక్క; భాసాం= కాంతుల; తాపాత్= వేడిమివల్ల (మండల కిరణసంతప్తము మేరువు); అచ్ఛిన్న... టంకైః; అచ్ఛిన్న= అనవరతము; గచ్ఛత్= చుట్టూ తిరుగుతున్న; తురగ= గుర్రాల; ఖురపుటన్యాస= గిట్టలతాకిడియనెడి; నిశ్శంకటంకైః= రాళ్ళుకొట్టుసాధన విశేషములచేత; ఛేదాత్= ముక్కలు కావడంవల్లనూ; (మేరుపర్వత శిలలు గిట్టలుచేత ముక్కలుకావడం); నిస్సంగ= ఎటువంటి ప్రతిబంధకంలేని; స్యందన+అగ్ర= రథచక్రపు; భ్రమణ= తిరుగుటయనెడి; నికషణాత్= రాపిడివల్లనూ అనే (చక్రంతిరగడంవల్ల కలిగే రాపిడి); త్రిప్రకారం= మూడు విధాలయిన; తత్పరీక్షావరఃఇవ= దాన్ని (మేరుపర్వతమనే బంగారాన్ని) పరీక్షించుటయందు ఆసక్తి కలిగిన వాడులాగ; హాటకాద్రిం= మేరుపర్వతాన్ని; పరితః= అంతటా (చుట్టూరా); పర్యటన= తిరుగుతున్నట్టి; తప్తాంశుః= సూర్యుడు; వః= మిమ్మల్ని; పాతు= రక్షించుగాక!



**తా :** మేరుపర్వతం బంగారం. బంగారం లోకంలో మూడు విధాలుగా పరీక్షకుగురౌతుంది. నిప్పుతోకాల్చడం, ముక్కతుంచి చూడ్డం ఒరిపిడిరాయిచేత రాసిచూడ్డం. మేరుపర్వతాన్ని బంగారంలా సూర్యుడు తన కిరణాలనే నిప్పుల్లోకాల్చి, గుర్రాలగిట్టలతో ముక్కలుకొట్టి, రథ చక్రపు రాపిడిచేత రాసి పరీక్షిస్తున్నాడా అన్నట్లు మేరుపర్వతంచుట్టూ పరిభ్రమిస్తున్న సూర్యుడు మిమ్మల్ని రక్షించుగాక!

**అలం :** ఉత్ప్రేక్ష.

**విశే :** మయూరుని లోకవృత్త పరిశీలనానికి ఇది మచ్చుతునక.

స్ర. **నోశుష్కం నాకనద్యా వికసితకనకాంభోరుహం భ్రాజితం తు**
**ప్లుష్టా నైవోపభోగ్యా భవతి భృశతరం నందనోద్యానలక్ష్మీః,**
**నో శృంగాణి ద్రుతాని ద్రుతమమరగిరేః కాలధౌతాని ధౌతా**
**నీత్థంధామద్యుమార్గే ప్రమదయతిదయయాయాత్రసోஉ వ్యాదినోవః. 83**

**అవ :** తీక్షణభానుడైన సూర్యుడు లోకోపకారేగాని అపకారికాదంటున్నాడు.

**ప్రతి :** నాకనద్యాః= స్వర్లోకనదియైన గంగయొక్క; వికసిత...రుహం; వికసిత= వికసించిన; కనక+అంభోరుహం= స్వర్ణకమల సముదాయం;

నశుష్కం= వాడిపోలేదు (ఎండిపోలేదు); తు= పైగా; భ్రాజితం= ప్రకాశితమైనది (వికసించినది); నందనోద్యానలక్ష్మీః= నందనోపనశోభ; ప్లుష్టాన ఏవ= దహింపబడలేదు పైగా; భృశతరం= మిక్కిలి; ఉపభోగ్యాభవతి= ఆస్వాదయోగ్యమవుతున్నదని; అమర గిరేః= మేరుపర్వతంయొక్క; శృంగాణి= శిఖరాలు; నద్రుతాని= కరిగిపోయినవికావు; పైగా; ద్రుతం= శీఘ్రముగా; ధౌతాని= కిరణాలతో పరిశుభ్రము చేయబడినవై; కాలధౌతాని= బంగారురూపం గలవి అవుతున్నవి. ('కాలధౌతం రూప్యహేమ్నోః' అని అమరం) యత్రద్యుమార్గే= ఏ ఆకాశమార్గాన; ఇత్థం (ఇద్ధం) ధామ= ఈ విధమైన (ప్రకాశవంతమైన) తేజస్సును; దయయా= కృపచేత; ఎవరైతే; మ్రదయతి= మృదువుగా చేస్తున్నాడో; సః అర్కః= ఆ సూర్యుడు; వః అవ్యాత్= మిమ్మల్ని కాపాడుగాక!

**తా :** ఎవరు ఉదయించగానే ఆ తేజస్సుకు లేక ప్రతాపానికి గంగానదిలోని కమలాలు వాడకపోగా వికసితమయ్యాయో, నందన వనం క్షీణింపకపోగా ఆస్వాదయోగ్యమైనదో; మేరుపర్వత శిఖరాలు శిథిలంకాకపోగా స్వర్ణమయాలయ్యాయో ఆకాశమార్గంలో మృదువుగా కనిపించే ఆ సూర్యుడు మిమ్మల్ని రక్షించుగాక!

స్ర. **ధ్వాంతస్యైవాంతహేతు ర్నభవతి మలినై కాత్మనః పాప్మనోఽపి**
**ప్రాక్పాదోపాంతభాజాం జనయతి న పరం పంకజానాం ప్రబోధమ్,**
**కర్తానిః శ్రేయసానా మపి తు నఖలు యః కేవలం వాసరాణాం**
**సోఽవ్యాదేకోద్యమేచ్ఛావిహితబహుబృహద్విశ్వకార్యోఽర్యమావః. 84**

**అవ :** ఒకే ప్రయత్నంతో అనేక కార్యాలను సాధిస్తున్నాడు సూర్యుడు.

**ప్రతి :** మలిన+ఏకాత్మనః= మాలిన్యమే ప్రధానంగా గల; ధ్వాంతస్య+ఏవ= చీకటికిమాత్రమే; అంతహేతుః= వినాశకారి; నభవతి= కావడంలేదు; కింతు= పైగా; పాప్మనః అపి= పాపాలకుగూడ వినాశహేతువు; ప్రాక్= పూర్వము



(మొదటగా); పంకజానాం= కమలాలకు మాత్రమే; నప్రబోధం జనయతి= వికాసాన్ని కలిగించడంలేదు; వరం= అయితే (మీదుమిక్కిలి); పాద+ ఉపాంతభాజాం= పాదాలను (కిరణాలను, చరణాలను) ఆశ్రయించిన వారికి గూడ; ప్రబోధం జనయతి= తత్వబోధాన్ని (మేలుకొలుపు) చేస్తున్నాడు[1]; కేవలం వాసరాణాం= ఒక్క వగళ్ళకు మాత్రమే; నఖలు= కాదు; నిఃశ్రేయ సానాం అపితు= మోక్షములకు గూడ; కర్తా= కర్త అవుతున్నాడు; ఏక....కార్యః ఏక+ఉద్యమ= ఒకే ప్రయత్నమందలి; ఇచ్ఛా= కోరికచేత; విహిత= చేయబడిన (సాధించిన); బహు= అనేకాలయిన; బృహత్ విశ్వకార్యః= గొప్ప ప్రపంచ కార్యక్రమాలుగల; సః అర్యమా= ఆ రవి; వః అవ్యాత్= మిమ్మల్ని కాపాడుగాక!

**తా :** కేవలం లోకంలోని చీకటినేకాదు పాపాన్నికూడ పారదోలుతున్నట్టి, కమలాలకేగాదు పాదాల నాశ్రయించిన వారికెల్లా బోధాన్ని (వికాసం) కలుగజేస్తున్నట్టి, పగటికేకాదు మోక్షాలకుగూడ కర్తృత్వం వహించినట్టి ఆ సూర్యభగవానుడు మిమ్మల్ని రక్షించుగాక!

**వివ :** 1. "ఏషసుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః" అని ఆదిత్య హృదయం.

స్ర. **లోటన్లోష్టావిచేష్ట శ్రితశయనతలో నిస్పృహీభూతదేహ**
**స్పందేహీ ప్రాణితవ్యే సపది దశదిశః ప్రేక్షమాణోఽంధకారమ్,**
**నిః శ్వాసాయాసనిష్ఠః పరమ పరవశో జాయతే జీవలోక**
**శ్శోకేనేవాన్యలోకాభ్యుదయకృతిగతే యత్రసోఽర్కోఽవతాద్వః. 85**

**అవ :** సూర్యుడులేని జగత్తుపడే అవస్థ ఎలా వుంటుందో చెబుతున్నాడు.

**ప్రతి :** యత్ర= ఏ సూర్యుడు; అన్యలోక+అభ్యుదయకృతి= మరియొక లోకవికాస కార్యాన్ని గూర్చి; గతే= వెళ్ళగా; జీవలోకః= ఈ ప్రాణికోటి; శ్రితశయనతలః= మంచమెక్కి; నిస్పృహీభూత దేహః= స్పృహతప్పిన శరీరం కలిగి; లోష్టావిచేష్టః= మంటిగడ్డవలె (మన్ను తిన్న పాములా అనవచ్చు);

లోటన్= ప్రవర్తిస్తూ; ప్రాణితవ్యే= జీవితమందు; సందేహీ= సంశయాస్పదమవుతున్నదో (బ్రతుకుతానో లేదో అని); సపది= ఆవెంటనే; దశదిశః= పదిదిక్కులా; అంధకారం= చీకటిని; ప్రేక్షమాణః= చూస్తున్నదో (సందేహంతో అని); శోకేన+ఇవ= దుఃఖంచేతలాగ; పరమ పరవశః= మిక్కిలి దుఃఖస్థితినంది (స్వాధీనంతప్పి); నిశ్వాస+అయాసనిష్ఠః= నిట్టూర్పుల శ్రమలో నిమగ్నము (దుఃఖిత); జాయతే= అవుతున్నదో; నః అర్కః= ఆ సూర్యుడు; వః అవతాత్= మిమ్మల్ని రక్షించుగాక!

**తా :** ఏ సూర్యభగవానుడు మరోలోకానికి వెళ్ళగా ఈ జీవకోటి చేష్టలుడిగి (మాని) మట్టిగడ్డలా మంచమెక్కి చుట్టూరా ఆవరించుకున్న చీకటినిచూస్తూ జీవితంమీద ఆశ సన్నగిల్లి నిట్టూర్పులతో బ్రతుకుతున్నదో ఆ సూర్యుడు మిమ్మల్ని రక్షించుగాక!

స్ర. ***క్రామన్‌లోలోఽపి లోకాంస్తదుపకృతి కృతావాశ్రితః స్థైర్యకోటిం**
**నృణాం దృష్టిం విజిహ్మాం విదధదపి కరోత్యంతరత్యంతభద్రామ్,**
**యస్తాపస్యాపి హేతుర్భవతి నియమినామేక నిర్వాణదాయీ**
**భూయాత్స ప్రాగవస్థాధికతరపరిణామోదయోఽర్కః శ్రియై వః. 86**

**అవ :** సూర్యుడు పైకి విరుద్ధ ప్రవృత్తితో కనిపించినా విశ్వశ్రేయస్సే లక్ష్యంగా గల వాడంటున్నాడు.

**ప్రతి :** యః= ఎవరు; లోకాన్= లోకాలను; క్రామన్= దాటుతూ; లోలః అపి= చంచలుడై నప్పటికీ; తదుపకృతికృతౌ= ఆలోకోపకార విషయంలో; స్థైర్యకోటిం= స్థిరత్వాన్ని (నిలకడతనం); ఆశ్రితః= ఆశ్రయించారో; నృణాం= నరులకు; విజిహ్మం= మాంద్యమైన; దృష్టిం= చూపుని; విదధత్+అపి= కలుగజేస్తున్నప్పటికీ (దుర్ని రీక్ష్యత్వం); అంతః= లోపల (మనస్సులో); అత్యంతభద్రాం= మిక్కిలి శుభాన్ని (కృతార్థతను); కరోతి= చేస్తున్నాడో; తాపస్య= సంతాపానికి (బాగావేడికి); హేతుః భవత్యసి= కారణమైనప్పటికీ;



నియమినాం= యోగులకు; ఏకనిర్వాణదాయీ= ముఖ్యమైన మోక్ష ప్రదాతమో; ప్రాక్+అవస్థా= మొదటిదశలోనే; అధికతర= ఎక్కువైన; పరిణామ+ఉదయ= పరిణతిచెందిన ఆవిర్భావంగల; నఃఅర్కః= ఆ సూర్యుడు; వః శ్రియై భూయాత్= మీకు సంపదకోసం అగుగాక!

**తా :** ఏ సూర్యుడైతే నిరంతరం సంచరిస్తున్నా (చంచలుడైనా) లోకోపకారంలో స్థైర్యాన్ని పొందతాడో (అచంచలుడో), నరులకు దుర్ని రీక్ష్యుడైనా అంతః కరణాన్ని కృతార్థత (పవిత్రం) నొందిస్తాడో, యోగులకు తాపం కలిగించినా మోక్షాన్ని ప్రసాదిస్తాడో ఆ సూర్యుడు మీకు సంపదలిచ్చుగాక!

**వివ :** * శ్రీనాథుని అనువాదం వుంది (కాశీ.3–176).

స్ర. **వ్యాపన్నర్తుర్నకాలో వ్యభిచరతిఫలం నౌషధీ ర్వృష్టిరిష్టా**
**నేష్టైస్తృప్యంతి దేవా నహి వహతి మరు న్నిర్మలాభాని భాని,**
**ఆశాశ్శాంతా నభిన్దన్త్యవధి ముదధయో బిభ్రతి క్ష్మాభృతః క్ష్మాం**
**యస్మిస్త్రైలోక్యమేవం న చలతితపతిస్తాత్ససూర్యః శ్రియై వః. 87**

**అవ :** ప్రపంచం మనుగడ సూర్యుడుమీద ఆధారపడి వుందంటున్నాడు.

**ప్రతి :** యస్మిన్= ఏ సూర్యుడు; తపతి= వెలుగుతుండగా; త్రైలోక్యం= మూడులోకాలు; ఏవం= ఈ క్రింద చెప్పబోయేవిధంగా; న చలతి= విపరీతత్వం పొందవో; నః సూర్యః= ఆ సూర్యుడు; వః= మీయొక్క; శ్రియైస్తాత్= సంపదకోసం అగుగాక! అదెట్లనగా; కాలః= కాలము; వ్యాపన్న+ ఋతుః= ఋతువులులేనిది; న= కాదు; ఓషధీః= ఓషధులు; ఫలం= ఫలాన్ని; నవ్యభిచరంతి= అతిక్రమించవు (పంటలు పండుతాయి); వృష్టిః= వర్షము; ఇష్టా= అభిమతమౌతుంది (వర్షం కురుస్తుంది); దేవాః= దేవతలు; ఇష్టైః= హోమాదులచేత ("అథక్రతుకర్మేష్టం" అమరం); న నహి తృప్యంతి= తృప్తులు కాకపోవడంలేదు (సంతృప్తులౌతారు); మరుత్= వాయువు; వహతి= వీస్తుంది; భాని= నక్షత్రాలు; నిర్మల+అభాని= స్వచ్ఛమైన కాంతి గలవి అవుతాయి;

ఆశాః= దిక్కులు; శాంతాః= ప్రసన్నాలవుతాయి; ఉదధయః= సముద్రాలు; అవధిం= చెలియలికట్టను; నభిన్దంతి= దాటవు; క్ష్మాభృతః= కులపర్వతాలు; క్ష్మాం= భూమిని; బిభ్రతి= మోస్తాయి.

**తా :** ఏ సూర్యుడు ప్రకాశిస్తుండగా షడ్రుతువులు, వర్షాలు, పంటలు, యాగాలు, వాయువు, నక్షత్రాలు, దిక్కులు, సముద్రాలు, పర్వతాలు యథావిధిగా ప్రవర్తిల్లుతాయో ఆ సూర్యుడు మీకు సంపదలిచ్చుగాక!

ప్ర. **కైలాసే కృత్తివాసా విహరతి విరహత్రాసదేహోఢకాంతః**
**శ్రాంతశ్శేతే మహాహావధిజలధి వినా ఛద్మనాపద్మనాభః,**
**యోగోద్యోగైకతానో గమయతి సకలం వాసరం స్వం స్వయంభూ**
**ర్భూరిత్రైలోక్య చింతాభృతిభువనవిభౌయత్రభాస్వన్సవోఽ వ్యాత్. 88**

**అవ :** త్రిమూర్తులు నామమాత్రులు, సూర్యుడే సృష్టిని గురించి దాని మంచిచెడ్డలగూర్చి ఆలోచించేవాడంటున్నాడు.

**ప్రతి :** యత్ర= ఏ సూర్యుడు; భువననిభౌ= లోకప్రభువై; భూరి= గొప్పదైన; త్రైలోక్యచింతాభృతి= మూడులోకాల బాధని భరిస్తుండగా; విరహత్రాస= ఎడబాటుభయంవల్ల; దేహ+ఊఢ కాంతః= శరీరమందు భార్యను ధరించినవాడై[1]; కృత్తివాసాః= గజచర్మధారియైన శివుడు; కైలాసే= కైలాసమందు; విహరతి= నిశ్చింతగా విహరిస్తున్నాడో; పద్మనాభః= కమలనాభుడైన విష్ణువు; ఛద్మనావినా= తాపాదివ్యాజములేక (మాయవీడి); అధిజలధి= సముద్రమందు; మహా+అహౌ= ఆదిశేషువుమీద; శ్రాంతః= అలసటతోఖిన్నుడై; శేతే= పరున్నాడో; యోగ+ఉద్యోగ+ఏకతానః= యోగముద్రలో ఏకాంతమున; స్వయంభూః= ఆత్మజుడైన బ్రహ్మ; స్వంవాసరం= తన కాలాన్ని (రోజుని); సకలం= పూర్తిగా; గమయతి= పెళ్ళబుచ్చుతున్నాడో (నిశ్చింతగా); సఃభాస్వాన్= ఆ సూర్యుడు; వః అవ్యాత్= మిమ్మల్ని కాపాడుగాక!



**తా :** ఏ సూర్యుడు ముల్లోకాల బాధను తాను భరిస్తుండగా త్రిమూర్తులు వారివారిలోకాల్లో వారిసుఖాల్లో కాలం వెళ్ళగదుపుతున్నారో ఆ సూర్యుడు మిమ్మల్ని రక్షించుగాక!

**విశే :** ఇటువంటి భావాలు కావ్యాలను అంకితం పుచ్చుకున్న ప్రభువులను శ్లాఘించే సందర్భాల్లోకూడ కన్పిస్తుంటాయి.

**వివ :** 1. శివుణ్ణి అర్ధనారీశ్వరుడంటారు. ఇటువంటి వర్ణనం ప్రాచీనకాలంలో లేదు. బహుశా మయూరుడి తర్వాతనే వ్యవహారంలోకి వచ్చిందేమో, పురాణాల్లోను ఇటువంటి వ్యవహారం కనిపించడంలేదని పరిశోధకాభిప్రాయం. (సూ.శ.చౌఖంబా.పుట.50, 1981 ముద్రణం)

ప్ర. **ఏకద్యన్మండలం భే తపతిదినకృతస్తా ఋచోఽ ర్చీంషియాని**
**ద్యోతంతేతాని సామాన్యయమపి పురుషో మండలేఽ ణుర్యజూంషి,**
**ఏవం యం వేద వేదత్రితయమయ మయం వేదవేదీ సమగ్రో**
**వర్గస్స్వర్గాపరవర్గోపకృతి రవికృతిస్సోఽ స్తు సూర్యః శ్రియై వః. 89**

**అవ :** సూర్యభగవానుడి వేదత్రయీమూర్తిత్వాన్ని చెబుతున్నాడు.

**ప్రతి :** భే= ఆకాశమందు; దినకృతః= సూర్యునియొక్క; ఏతత్యత్ మండలం= ఏయీ మండలము; తపతి= వెలుగుతున్నదో; తాః= అవి; ఋచః= ఋగ్వేదమంత్రాలు; అర్చీంషి= ఏ కిరణాలు; ద్యోతంతే= వెలుగుతున్నాయో; తాని= అవి; సామాని= సామగీతాలు; అయం= ఈ; మండలే= మండలమందలి; అణుః= సూక్ష్మరూపమైన; పురుషః అపి= పురుషుడన్ననో; యజూంషి= యజుర్వేద మంత్రాలు; (పురుషుడు యజుర్వేదం); ఏవం= అని ఈ విధంగా; వేదత్రితయం= వేదత్రయరూపునిగా; యం= ఎవరిని; అయం= ఈ; వేదవేదీసమగ్ర వర్గః= వైదికులయిన సమస్తబృందము; వేద= తెలుసుకుంటున్నదో; స్వర్గ+అపవర్గః= సంపాదసుఖరూప స్వర్గంతోపాటు మోక్షానికిగూడ; ఉపకృతిః= కారకుడూ;

అవికృతిః= నిర్వికారుడున్నూ అయిన; సః సూర్యః= ఆ సూర్యుడు; వః శ్రియైఅస్తు= మీ సంపదలకోసం అగుగాక!

**తా :** సూర్యస్వరూపం వేదత్రయాత్మకం అని వైదికభావన సూర్యమండలం ఋగ్వేదం. కిరణాలు సామవేదం. మండలాంతస్థ పురుషుడు యజుర్వేదం. అటువంటి పవిత్రమూర్తి మీకు సంపదలు ప్రసాదించుగాక!

**విశే :** ఈ భావాన్ని మయూరుడు చిన్న మార్పులతో శతపథ బ్రాహ్మణంనుంచి గ్రహించినట్లు తోస్తున్నది. "యద్ ఏతన్మండలం తపతి" అనే ప్రారంభంతో అందులో వుంది. (10-5-2)

సూర్యుని వేదత్రయాత్మకతని శ్రుతులు ప్రబోధిస్తున్నాయి.

1. "వేదైశ్చ సర్వైరహమేవ వేద్యః"
2. ఋగ్భిః పూర్వాహ్ణే దివిదేవ ఈయతే, యజుర్వేదే తిష్ఠతి మధ్యే అహ్నః, సామవేదేనాస్తమయే మహీయతే వేదై రశూనస్త్రిభిరేతి సూర్యః"

**స్ర. నాకౌకః ప్రత్యనీకక్షతిపటుమహసాం వాసవాగ్రేసరాణాం**
**సర్వేషాం సాధుపాతాం జగదిదమదితే రాత్మజత్వే సమేఽపి,**
**యేనాదిత్యాభిధానం నిరతిశయగుణై రాత్మనిన్యస్తమస్తు**
**స్తుత్యస్త్రైలోక్యవంద్యై స్త్రిదశమునిగణైస్సోఽస్తుసూర్యః శ్రియై వః. 90**

**అవ :** దేవతలంతా ఆదిత్యులే అయినా ఆదిత్యపదం సూర్యునికి మాత్రమే సార్థకమంటున్నాడు.

**ప్రతి :** నాక+ఓకః+ప్రత్యనీక= స్వర్గవాసులైన దేవతలకు శత్రువులైన రాక్షసులయొక్క; క్షతి= వినాశమందు; పటుమహసాం= గొప్ప సమర్థతకల్గి (తేజస్సు కలిగి); ఇదంజగత్= ఈ ప్రపంచాన్ని; సాధు= బాగుగా; పాతాం= రక్షిస్తున్న (పాత్ అనేదాని షష్ఠీరూపం); వాసవ+అగ్రేసరాణాం= ఇంద్రాది ప్రముఖులకు; సర్వేషాం= అందరికీ; అదితేః ఆత్మజత్వే= అదితికి పుట్టినవారన్న



విషయంలో; సమే అపి= తుల్యత ఉన్నప్పటికీ (ఆదిత్య వ్యవహారం సమానమే అయినా) నిరతిశయగుణైః= విశేషమైన గుణాలచేత (వారికందరికీ సామన్య గుణమే కాని విశేషగుణాలరు లేవని ఉద్దేశం); యేన= ఏ సూర్యునిచేత మాత్రమే; ఆదిత్య+అభిధానం= ఆదిత్యనామము[1]; ఆత్మని= తన యందు (సూర్యునియందు); న్యస్తం అస్తు= ఉంచబడినదో; (ఆదిత్య నామం ఎవరికి సార్థకమైనదో); త్రైలోక్యవంద్యైః= ముల్లోకములచేత నమస్కరింపదగిన; త్రిదశమునిగణైః= దేవర్షిసంఘుంచేత; స్తుత్యః= కొనియాడదగిన; సఃసూర్యః= ఆ సూర్యుడు; వః శ్రియైఅస్తు= మీ సంపదలకోసం అగుగాక!

**తా :** అదితేః అపత్యం అను వ్యుత్పత్తినిబట్టి ఇంద్రాదిదేవతలంతా ఆదిత్యులే అయినా విశేషగుణాలచేత ఆ వ్యవహారం సూర్యుడికి మాత్రమే అన్వయిస్తుంది. అంటే శాబ్దికంగా వాళ్ళు ఆదిత్యులే అయినా ఆర్థికంగా సూర్యుడు మాత్రమే ఆదిత్యుడు. అట్టి సూర్యుడు మీకు సంపదలిచ్చుగాక!

**వివ :** 1. "యస్మాత్ సర్వమానదత్తే" ఇతి ఆదిత్యః ।

దేనివలన అన్నింటిని గ్రహిస్తాడో దానివలన ఆదిత్యుడనే ఔపథిక వ్యుత్పత్తినిబట్టి సమస్తవిషయాలను గ్రహించి అనుభవించేవాడని అర్థం

**స్ర. భూమింధామ్నోఽభివృష్ట్యాజగతిజలమయీం పావనీంసంస్మృతావ**
**ప్యాగ్నేయీందాహశక్త్యాముహురపియజమానాత్మికాంప్రార్థితార్థైః**
**లీనామాకాశ ఏవామృతకరఘటితాం ధ్వాంతనక్షన్య పర్వ**
**ణ్యేవం సూర్యోఽష్టభేదాంభవివభవతఃపాతుబిభ్రత్స్వమూర్తిమ్. 91**

**అవ :** ఇక నుంచి మూడుశ్లోకాల్లో త్రిమూర్తులతో అభేదం[2] చెబుతూ మొదట సూర్యుడుకూడ శివునిలా అష్టమూర్తి స్వరూపుడంటున్నారు.

**ప్రతి :** ధామ్నః= తేజస్సువలన; భూమిం= భూమిత్వమునూ; జగతి= లోకంలో; అభివృష్ట్యా= వర్షంచేత; జలమయీం= జలత్వాన్ని; సంస్మృతౌ= స్మరణమందు; పావనీం= వాయుత్వాన్నీ; దాహశక్త్యా= దహించే స్వభావంచేత;

ఆగ్నేయీంఅపి= అగ్నిత్వాన్నీ; ముహుః= మాటిమాటికి; ప్రార్థితార్థైః= యాచకులచేత జ్ఞాపికాలైన వాక్యాలచేత; యజమానాత్మికాం= యాజమాన్యతని; ఆకాశేఏవ= ఆకాశమందే; లీనాం= సంబద్ధతని (ఆకాశమందుండడం); ధ్వాంతపక్షస్యపర్వణి= అమావాస్యయందు; అమృతకరఘటితాం= చంద్రత్వాన్ని (చంద్రుడుతో కలసి వుండడం); ఏకం= ఒకేవిధంగా; స్వమూర్తిం= తన ఆకారాన్ని; అష్టభేదాం= ఎనిమిది భేదాల స్వరూపంగా; బిభ్రత్= ధరిస్తున్న; భవఃఇవ= శివునిలాంటి; సూర్యః భవతః పాతు= సూర్యుడు మిమ్మల్ని రక్షించుగాక!

**తా :** "క్షితి, జల, పవన, హుతాశన, యజమాన, ఆకాశ, సోమ, సూర్యాఖ్యాః అష్టమూర్తాయః" అను వాక్యాన్నిబట్టి సూర్యుని అష్ట మూర్తిత్వం చెప్పబడింది. తేజోనిధిత్వం భూమి, వర్షకారకత్వం జలం, స్మరణంవల్ల వాయుత్వం; (పావనీం– పవిత్రత) తపింపజేయడంవల్ల అగ్ని, ప్రార్థిశులచేత పిలవబడి కోరికలు తీర్చడం యాజమాన్యత; ఆకాశనివాసము ఆకాశత్వం; అమావాస్యలో చంద్రసహవాసం సోమత్వం తన స్వరూపంతో సూర్యత్వం. ఈ విధంగా అష్టమూర్తిమంతుడైన సూర్యుడు మిమ్మల్ని రక్షించుగాక!

**వివ :** 2. ఎషబ్రహ్మాచ విష్ణుశ్చ శివస్స్కందః ప్రజాపతిః ।
మహేంద్రోధనదః కాలోయమస్సోమోహ్యసాం పతిః ॥

ఆదిత్య హృదయం

"సబ్రహ్మ స శివస్సహరిస్సేంద్రస్సోఽక్షరః పరమస్స్వరాట్" అని శ్రుతి.

స్ర. **ప్రాక్కాలోన్ని ద్రవద్మాకర పరిమిళనావిర్భవత్పాదశోభో**
**భక్త్యా త్యక్తోరుశోకోద్గతి దివివినతాసూనునా నీయమానః,**
**సప్తాశ్వాప్తాపరాంతాన్యధిక మధరయన్యోజగంతి స్తుతోఽలం**
**దేవైర్దేవస్సపాయా దపరఇవ మురారాతిరహ్నాం పతిర్వః. 92**

**అవ :** సూర్యుడు విష్ణువులాంటి వాడంటున్నాడు.



**ప్రతి :** ప్రాక్కాల= ఉదయకాలమున (తనకంటే ముందుగా అని విష్ణుపక్షం); ఉన్నిద్ర= వికసించిన (నిద్రలేచిన); పద్మాకర= కమలా కరములు అంటే సరస్సులయొక్క (లక్ష్మీదేవి చేతులచేత); పరిమిళన= అవగాహనం వలన; అంటే కమలాలతో లీనంగావడం; (సంవాహనం వలన ఆ కాళ్ళు పిసకడం); ఆవిర్భవత్= ఉద్గమించుతున్న (వెలికివస్తున్న); పాదశోభః= కిరణాలకాంతి గలవాడు (చరణాలకాంతి గలవాడు); దివి= ఆకాశమందు; త్యక్త+ఊరు (ఉరు)+శోక+ఉద్గతి= విడువ బడిన జంఘల (తొడలు) బాధావిర్భావం గలిగి (విడువబడిన గొప్ప శోకావిర్భావం కలిగి); భక్త్యా= భక్తితో; వినతాసూనునా= అనూరునిచేత (గరుత్మంతునిచేత); ఆనీయమానః= తీసుకురాబడుతున్నవాడై (మోయబడుతున్నవాడై); సప్తాశ్వ= ఏడుగుర్రాలచేత; ఆప్త= పొందబడిన; అపరాంతాని= పశ్చిమ దిగంతముకలిగిన; జగంతి= లోకాలను; (సప్త+ఆశు+ఆప్త+ అపరాంతాని= శీఘ్రంగా చేరుకున్న తక్కిన కొనలుగల ఏడులోకాలను అని విష్ణు). అధికం= మిక్కిలి; అధరయన్= దాటుతూ; దేవైః= దేవతలచేత; అలం= మిక్కిలి; స్తుతః= పొగడబడిన; అపరః ముర+అరాతిఃఇవ= మరోవిష్ణుమూర్తిలాంటి; సః అహ్నాం పతిః= ఆ పగటినాథుడైన సూర్యుడు; వః పాయాత్= మిమ్మల్ని కాపాడుగాక!

**తా :** విష్ణువు లక్ష్మీ కరస్పర్శచేత భాసించు పాదశోభ కలిగివున్నట్లే సూర్యుడుకూడ పద్మాకర వికాసన పాద (కిరణ) శోభగలవాడు. విష్ణువును, సూర్యుణ్ణి ఇద్దర్నీ వినతాసూనులే అంటే బిడ్డలే మోస్తున్నారు. (గరుత్మంతుడు, సారధి అనూరుడు) అనూరుడు సూర్యుణ్ణి సప్తాశ్వాల సాయంతో లోకసంచారం చేయిస్తుండగా గరుత్మంతుడు వేగంగా ఏడు లోకాలు విహరింపజేస్తున్నాడు. ఈ విధంగా ఆపర విష్ణువులాంటి సూర్యుడు మిమ్మల్ని రక్షించుగాక!

**అలం :** శ్లేష, (శబ్దశక్తిమూలకం)

**వివ :** పరిమిళన పాదశోభ, వినతాసూను, శబ్దాల్లో అభంగశ్లేష, పద్మాకర, త్యక్త+ఉరు; త్యక్త+ఊరు; సప్త+ఆశు+ఆప్త; సప్తాశ్వాప్త అనేచోటల్ల సభంగశ్లేష ప్రదర్శింపబడింది. "అలాగే 'ఉన్ని ద్రపద్మాకర' అనడంలో అంతర్యం కవి భారతీయ సంప్రదాయాన్ని పాటించడమే. మన సాంప్రదాయం ప్రకారం భర్తకంటె భార్యముందు నిద్రలేచి భర్తపాదాలకు నమస్కరించి గృహకృత్యాల కుపక్రమిస్తుంది.

స్ర. **యః స్రష్టాపాంపురస్తాదచలవరసమభ్యున్నతేర్హేతు రేకో**
**లోకానాం యస్త్రయాణాం స్థితుపరి వరందుర్విలంఘ్యేనధామ్నా,**
**సద్యస్సిద్ధ్యైప్రసన్నతిశుభచతురాశాముఖఃస్త్రాద్విభక్తో**
**ద్వేధా వేధా ఇవావిష్కృతకమలరుచి స్సోఽర్చిషామాకరోవః. 93**

**అవ :** సూర్యునియొక్క చతుర్ముఖ సమానత్వాన్ని చెబుతున్నాడు.

**ప్రతి :** యః= ఎవరైతే; పురస్తాత్= మొదట; అపాం= నీటికి; స్రష్టాః= సృష్టికర్తయై (సూర్యుడు – బ్రహ్మ); అచలవర= పర్వతరాజంయొక్క (మేరువు); మభ్యున్నతేః= ఉదయాచలమనే పేరు గాంచుటకు (పర్వతాలయొక్క ఔన్నత్యానికి అని బ్రహ్మ.ప.); ఏకః హేతుః= ప్రధానకారణమో (అద్వితీయమో); యః= ఎవరైతే; పరం= మిక్కిలి; దుర్విలఘ్యేన= అమల్లంఘనీయమైన (దుష్ప్రాప్యమైన); ధామ్నా= తేజస్సుచేత (విలాసమైన సత్యలోకంచేత); త్రయాణాంలోకానాం= మూడులోకాలయొక్క (భూర్భువస్స్వః); ఉపరి= పైభాగాన; స్థితః= ఉన్నాడో; ప్రసన్న= నిర్మలమైన; ద్యుతి= దీప్తిచేత; శుభ= మనోహరమైన; చతుర్+ఆశాముఖః= నాలుగు దిగంతాలుకలిగి (నాలుగు ముఖాలుకలిగి); ద్వేధా= రెండువిధాల (పైన చెప్పబడిన రీతిలో బ్రహ్మ; సూర్యుడు అని); విభక్తః= విభజింపబడినవాడై (వ్యవహరింపబడిన అని అర్థం); ఆవిష్కృత కమలరుచిః= కమలాలకు వికాసము కలిగించిన (వికసిత కమలమందు నివాసకారణంగా శోభకలిగిన); వేధాఃఇవ= బ్రహ్మవంటి; సః అర్చిషాం ఆకరః=



కాంతినిలయుడైన అసూర్యుదు; వః= మీయొక్క; సద్యఃసిద్ధ్యై= తత్క్షణ అభీష్టము కొరకు; స్తాత్= అగుగాక!

**తా :** బ్రహ్మ సృష్టి ప్రారంభంలో నీటిని పుట్టించినట్లె[1] సూర్యుడుకూడ వర్షస్రష్ట (ఆదిత్యాజ్జాయతే సృష్టి...అని శ్రుతి) కుల పర్వతాల ఔన్నత్యానికి బ్రహ్మకారుకుడైనట్లే మేరుపర్వతానికి ఉదయాచల వ్యవహారానికి కారకుడు సూర్యుడు. ముల్లోకాలకావల నివాసము ఇద్దరికీ ఉన్నది బ్రహ్మకు ప్రసన్నమైన నాలుగు ముఖాలున్నట్లే సూర్యుడికి నాల్గుదిక్కులు ఉన్నాయి. స్వర్లోక భూలోక విభజనం ఇరువురికి సమానం[2]. వికసిత కమలాననుడు బ్రహ్మ. వికసిత కమలుడు సూర్యుడు. ఈ విధంగా ఆ పరబ్రహ్మలాంటి సూర్యుడు మీ కోర్కెలు తీర్చుగాక!

**అలం :** శ్లేష (శబ్దశక్తి మూలకం)

**వివ :** 1. "ఆత ఏవ ససర్జాదౌ... .... .... ... అని మనుస్మృతి.

2. బ్రహ్మ సృష్టించిన బంగారు అండానికి బ్రహ్మకు భేదంలేదు. ఈగుడ్డు నుంచే బ్రహ్మ, సమస్త ప్రపంచం పుట్టుకొచ్చాయి. దీన్నే బ్రహ్మాండం అంటారు. దీన్ని బ్రహ్మ తన సమాధిశక్తిచేత రెండుగా విభజించాడు. వీటిలో ఒకటి స్వర్గం, రెండవది పృథివి. అందుకే బ్రహ్మని ద్వేధా అనికూడ అంటారు. ఈ బ్రహ్మాండవర్ణనం మనుస్మృతిలో వుంది.

"తదండమభవద్ధైమం ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ...
స్వయమేవాత్మనో ధ్యానాత్తదండమకరోద్ద్విధా ॥
తాభ్యాం స శకలాభ్యాం చ దిపం భూమించనిర్మమే
మధ్యేవ్యోమ దశశ్చాష్టావపాంస్థానం చ శాశ్వతం ॥ (1-9 నుండి 1)

స్ర. **సౌద్రిద్యూర్వీనదీశా ధిశతి దశదితో దర్శయన్ద్రాగ్తృశోయ**
**స్సాదృశ్యం దృశ్యతేనో సదశశతదృశిత్రైదశేయస్యదేశే,**

**దీప్తాంశుర్వ స్స దిశ్యాదశివయుగదశాదర్శితద్వాదశాత్మా**
**శాస్త్యశ్వాన్ శర్మయస్యాశయవిదతిశ యాద్దంధశూకాశనాద్యః ॥ 94**

**అవ :** సూర్యుణ్ణి ద్వాదశాదిత్యరూపంగా చెబుతున్నాడు.

**ప్రతి :** స+అద్రి+ద్యు+ఉర్వీ+నదీశాః= పర్వత, ఆకాశ, భూ, సముద్రాలతో సహా; దశదిశః= పది దిక్కులనూ; ద్రాక్= శీఘ్రంగా; దర్శయన్= ప్రకాశింపజూస్తూ; యః= ఎవరైతే; దృశః దిశతి= చూపును ఇస్తున్నారో; యస్య= ఎవరికైతే; సదశశతదృశి= సహస్రాక్షుడైన ఇంద్రునితోగూడిన[1]; త్రైదశేదేశే= స్వర్గమందు; సాదృశ్యం= సాటి; న దృశ్యయే= కనబడడంలేదో; యస్య= ఎవరియొక్క; అశ్వాన్= గుర్రాలను; అతిశయాత్= విశేషంగా; ఆశయవిత్= అభిప్రాయం తెలిసిన (సూర్యునియొక్క); దందశూకాశనాద్యః= పాములను తినే గరుడునికంటె పెద్దవాడైన అనూరుడు; శాస్తి= తోలుతున్నాడో (శాసించడం); అశివయుగదశా= ప్రళయ కాలావస్థయందు; దర్శితద్వాదశాత్మా= పన్నెండుమంది ఆదిత్య రూపాలుగల్గిన[2]; సః దీప్తాంశుః= ఆ సూర్యభగవానుడు; వః శర్మ దిశ్యాత్= మీకు సుఖాన్నిచ్చుగాక!

**తా :** ఎవరైతే సముద్ర, పర్వత, భూ, ఆకాశాలతోసహా పది దిక్కులను ప్రకాశింపజేస్తున్నారో, ఎవరికి స్వర్గంలో ఇంద్రునితో సహాసాటిలేదో, ఎవరి గుర్రాలను మనసుదెలిసి అనూరుడు నడుపుతున్నారో, ఎవరు ప్రళయకాలంలో పన్నెండు స్వరూపాలను కలిగివుంటారో అట్టి సూర్యుడు మీకు సుఖాన్నిచ్చుగాక!

**అలం :** అనుప్రాసం, ('శ' వర్ణావృత్తి).

**వివ :** 1. 'తిలోత్తమ' మీది వ్యామోహంతో ఎన్ని వైపులకు ముఖం తిప్పి ఇంద్రుడు చూశాడో అన్ని కళ్ళు ఏర్పడ్డాయని (వెయ్యికళ్ళు) భారతకథనం. "తథాసహస్రనేత్రశ్చబభూవ బలసూదనః" (భార.1-211-28). మరో కథనం ప్రకారం గౌతముని శాపకారణంగా వెయ్యికళ్ళు ఏర్పడ్డాయి. (భార. 12-266-45-50; 13-41-21);



2. ఆదిత్యులను గూర్చి ఋగ్వేదంలో స్పష్టంగా వుంది.

మం.2, సూ.27లో మిత్రావరుణులతోపాటు అర్యమత్, భగ, దక్ష, అంసులప్రసక్తి కూడ వుంది. మం.9, సూ.114 నుంచి మం.10, సూ.72లో ఆదిత్యుల సంఖ్య 7 అని వుందని కొందరి వుద్దేశం. (వేద వాఙ్మయం పుట 40, 1953 ముద్రణం.)

**"ఇంద్రో, ధాతా, భగః, పూషా, మిత్రో, ఉ ధవరుణో, ఉ ర్యమా, ।**
**అర్చి, ర్వివస్వాన్, త్వష్టా చ, సవితా, విష్ణురేవ చ ॥**

అని ఆదిత్యుల పేళ్ళు.

ఈ ద్వాదశాదిత్య ప్రసక్తి భారతంలోకూడ వుంది.

**"కృత్వాద్వాదశాత్మానం ద్వాదశాదిత్యతాంగకః ।**
**సంహృత్యైకార్ణత్వం సర్వం త్వం శోషయసి రశ్మిభిః ॥ (భార.3, 3-59)**

స్ర. **తీర్థాని వ్యర్థకాని హ్రాదనదసరసీ నిర్ఝరాంభోజినీనాం**
**నోదన్వంతో నుదంతిప్రతిభయమశుభం శ్వ భపాతానుబంధి,**
**ఆపో నాకాపగాయా అపికలుషముషో మజ్జతాం నైవ యత్ర**
**త్రాతుం యాతేఽన్యలోకాన్సదిశతుదివసస్త్వైకహేతుర్హితంవః 95**

**అవ :** సూర్యుడుదయించని యెడల అన్ని తీర్థాదులు వ్యర్థాలట.

**ప్రతి :** యత్ర= ఎవరు; అన్యలోకాన్= వేరేలోకాలను; త్రాతుం= రక్షించడానికి; యాతే= వెళ్ళగా హ్రద, నద, సరసీ, నిర్ఝర+అంభోజినీనాం= మడుగులు, నదులు, సరస్సులు, సెలయేళ్ళు, పుష్కరుణులుయొక్క; తీర్థాని= నీరు (తీర్థయాత్రలు); వ్యర్థకాని= ప్రయోజన రహితాలౌతున్నాయో; ఉదన్వంతః= సముద్రాలు; శ్వభ్ర= నరకానికి; పాత+అనుబంధి= పోవడానికి ప్రధానహేతువైన; ప్రతి భయం అశుభం= భయంకరమైన పాపాన్ని; న నుదంతి= పోగొట్ట దంతేదో; నాక+అపగాయాః= గంగానదియొక్క; ఆపః

అపి= నీరుకూడ; మజ్జతాం= మునుగుతున్న వారియొక్క; కలుషహారి= పాపాలను తొలగించేది; న+ఏవ= కావడంలేదో; సః= ఆ; దివ సస్య+ ఏకహేతుః= పగటికి ప్రధానకారణమైన సూర్యుడు; వఃహితం దిశతు= మీకు మంచిని కలుగజేయుగాక! (మంచినిచ్చుగాక!)

**తా :** ఏ సూర్యుడుదయించకపోతే తీర్థాలన్నీ వ్యర్థాలౌతున్నాయో గంగానదిలాంటి పవిత్రనదులుకూడ నరుల పాపాలను తొలగించలేక పోతున్నాయో[1]; ఆ సూర్యుడు మీకు మంచిని ప్రసాదించుగాక!

**వివ :** 1. ఇలాంటి అభిప్రాయం భారతంలో కనిపిస్తున్నది.

"తవ యద్యుదయో న స్యాదన్ధం జగదిదం భవేత్ ।
న చ ధర్మార్థకామేషు ప్రవృత్తేరన్ మనీషిణః ॥ (3-3-53)

"తత్సవితృవరేణ్యం భర్గోదేవస్య ధీమహిధియో యోనః ప్రచోదయాత్" అని శ్రుతివాక్యం.

(మమ్మల్ని పవిత్రకర్మలలో ప్రవర్తిల్లజేయునట్టి ఆ దివ్యుడైన సవితృని మనోహరమగు ప్రకాశాన్ని ధ్యానించెదము.)

స్ర. **ఏతత్పాతాళపంకప్లుతమివ తమసాచైక ముద్గాఢమాసీ**
**దప్రజ్ఞాత ప్రతర్క్యం నిరవగతి తథా లక్షణం సుప్త మంతః,**
**యాదృక్సృష్టేః పురస్తాన్నిశి నిశి నిఖిలం జాయతే తాదృగేవ**
**త్రైలోక్యం యద్వియోగాదవతు రవిరసౌ సర్గతుల్యోదయోవః 96**

**అవ :** సూర్యోదయంలేని ముల్లోకాలు అంధకారమయాలంటున్నాడు.

**ప్రతి :** యత్‌వియోగాత్= ఎవరి ఎడబాటువలన; ఏతత్ త్రైలోక్యం= ఈ మూడులోకాలు; తమసా చ= చీకటిచేత; ఏకం= ముఖ్యంగా; ఉద్గాఢం= దట్టమైన; పాతాళపంకప్లుతమ్ ఇవ= పాతాళమనే బురదలోపడిపోయిన దానిలాగ; సుప్తమంతః= నిద్రించినవాని; లక్షణంతథా= లక్షణ లాగ; అప్రజ్ఞాత= ఏమీతెలియని; అప్రతర్క్యం= అనూహ్యమైన (ఊహింపరానిది);



నిరవగతి= ప్రత్యక్షవిషయము తెలియని విధంగాను; ఆసీత్= ఉండెనో; అలాగే ఈ మూడులోకాలు; సృష్టేః పురస్తాత్= సృష్టికిపూర్వము; యాదృక్= ఏ విధంగా వుండెనో; తాదృక్ ఏవ= ఆ విధంగానే; సూర్యోదయానికిముందు; నిశిని= ప్రతిరాత్రి యందును; నిఖిలం= సమస్తము; జాయతే= అవుతున్నదో; సర్గ తుల్య+ఉదయః= సృష్టితో సమానమైన పుట్టుకగల (సృష్టితోపాటే సూర్యోదయం అవుతుందని); అసౌ రవిః= ఈ సూర్యుడు; వః అవతు= మిమ్మల్ని రక్షించుగాక!

**తా :** ఏ సూర్యోదయం లేకపోతే ఈ మూడులోకాలు సృష్టికి పూర్వంలాగా చీకటి అనే పాతాళపు బురదలోమునిగి (కూరుకుపోయి) తెలియడానికి, ఊహించడానికి వీలులేని రీతిలో పడివుంటుందో సృష్టితో సమానమైన పుట్టుకగల ఆ సూర్యుడు మిమ్మల్ని రక్షించుగాక![1]

**వివ :** 1. ఈ భావం మనుస్మృతిలో కూడ వుంది.

"ఆసీదిదం తరో బూతమప్రజ్ఞాతమలక్షణం ।
అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్తమివ సర్వతః ॥ (1-5-?)

* శ్రీనాథుని అనువాదం (కాశీ. 1-129).

స్ర. ***ద్వీపేయోఽస్తాచలోఽస్మిన్భవతి ఖలు సఏవా పరత్రోదయాద్రి**
**ర్యాయామిన్యుజ్జ్వలేందు ద్యుతిరిహదివసోఽన్యత్రతీవ్రాతపస్సః,**
**యద్వశ్యౌ దేశకాలావితి నియమయతో నోతు యందేశకాలా**
**వవ్యాత్స స్వప్రభుత్వాహితభువనహితో హేతురహ్నామినో వః. 97**

**అవ :** దేశకాలాలు సూర్యునికి లోబడి ప్రవర్తిస్తాయంటున్నాడు.

**ప్రతి :** అస్మిన్‌ద్వీపే= ఈ ద్వీపమందు; యః అస్తాచలః= ఏది అస్త్రాది అవుతున్నదో; సః ఏవ= అదే; అపరత్ర= మరొక ద్వీపమందు; ఉదయాద్రిః భవతి= ఉదయాచలం అవుతున్నది; ఇహ= ఇక్కడ; యా= ఏది; ఉజ్జ్వలా ఇందుద్యుతిః= బాగా ప్రకాశిస్తున్న వెన్నలగల; యామినీ= రాత్రియో; సః=

అదే; అన్యత్ర= మరొొకచోట; తీవ్రాతపః దివసః= తీక్ష్ణమైన ఎండగల పగలు అవుతున్నది; దేశకాలౌ= ప్రదేశ, సమయాలు; యత్‌వశ్యౌఇతి= ఎవరియొక్క స్వాధీనములే కాని; దేశకాలౌ= ప్రదేశసమయాలు; యం= ఎవరిని; నతు నియమయతః= శాసించడంలేదో (దేశాలు సూర్యాధీనాలేగాని సూర్యుడు వాటికిలోబడి నడుచుకోడు); స్వప్రభుత్వ+అహితః= తన అధికారంచేత చేయబడిన; త్రిభువనహితః= మూడులోకాల మేలుగల; అహ్నంహేతుః= పగటికికారణమైన; సః ఇనః= ఆ సూర్యుడు; వః= మిమ్మల్ని; అవ్యాత్= కాపాడుగాక!

**తా :** సూర్యగమనాన్నిబట్టి దేశకాలాలుమారతాయి. సూర్యుడు ఒకదేశంలో ఉదయిస్తే అది ఉదయాద్రి అవుతుంది. మరొక దేశానికి అది అస్తాద్రి అవుతుంది. ఒకదేశంలో వెన్నెలకాస్తుంటే, మరొక దేశములో ఎండకాస్తుంది[1]. ఈ విధంగా దేశకాలాలను తన గమనానికి లోబడి శాసిస్తున్న సూర్యుడు మిమ్మల్ని రక్షించుగాక!

**వివ :** 1. ఆధునిక వ్యవహారంలో దేశమే మయూరుడి 'ద్వీపం'. ఎందుకంటే పశ్చిమఖండంలోని అమెరికాదేశంలో తూర్పుఖండ దేశాలైన జపాను తదితర దేశాలకంటె సూర్యోదయం 18 గం॥లకు పైగా వెనుక అవుతుంది. అలాగే మన పగలు వాళ్లకు రాత్రి, మన రాత్రి వాళ్ళకు పగలు.

స్ర. **వ్యగ్రై రగ్ర్యగ్రహోడు గ్రసన గురుభరైర్నో సమగ్రైరుదగ్రైః**
**ప్రత్యగ్రై రీషదుగ్రై రుదయగిరిగతో గోగణై ర్గౌరయన్గామ్,**
**ఉద్గాఢార్చిర్విలీనా మరనగర నగగ్రావ గర్భామివాహ్నో**
**మగ్రేయోఽగ్రే విధత్తే గ్లపయుతు గహనం స గ్రహగ్రామణీర్వః 98**

**అవ :** లోకోపకార వ్యాసక్తాలయిన సూర్యకిరణాలు మేరుపర్వతాన్ని కరిగించి భూమిని బంగారుమయం చేస్తున్నాయంటున్నాడు.

**ప్రతి :** వ్యగ్రై= లోకోపకారమున వ్యాసక్తములు (వేగిరపడేవి); అగ్ర్యగ్రహ= ఎదురుగావున్న కుజాది గ్రహాలను; ఉడు= నక్షత్రాలను; గ్రసన= మింగడంలో (కాంతిహీనం చేయడం); గురు భరైః= మిక్కిలి భారము (బాధ్యత) కలవీ; న సమగ్రైః= అసంపూర్ణములు; ఉదగ్రై= సుదీర్ఘములు (గొప్పవి); ప్రత్యగ్రై= నూతనములు; ఈషత్+ఉగ్రైః= కొద్దిగానే వేడికల్గినవియైన; గోగణైః= కిరణసమూహంచేత; ఉదయగిరిగతః= ఉదయాద్రియందున్నవాడై; గాం= భూమిని; గౌరయన్= పసుపుపచ్చని వర్ణముతో ప్రకాశింపజేస్తూ; యః= ఎవరైతే; ఉద్గాఢ= ప్రబలమైన; అర్చిః= కాంతులచేత (కిరణాలు); విలీన= కరిగిన; అమరనగర= స్వర్గ మరియు; నగ= మేరుపర్వతములయొక్క (అమరశబ్దం నగర, నగశబ్దాలతో ప్రత్యేకంగా అన్వయిస్తుంది); గ్రావ= శిలలయొక్క; గర్భాంఇవ= అంతర్యంకలదానిగా (బంగారుమయంగా); అహ్నంఅగ్రే= దినారంభమున; విధత్తే= చేస్తున్నారో (భూమిని); సః గ్రహగ్రామణీః= ఆ గ్రహాధిపతియైన సూర్యుడు; వః= మీ యొక్క; గహనం= పాప సమూహాన్ని; గ్లపయతు= ఛేదించుగాక! (పారద్రోలుగాక!)



**తా :** లోకోపకారంకోసం కలవరపడుతూ (తొందర) ఎదురుగావున్న గ్రహాదులను కాంతిహీనంచేసే అసంపూర్ణములు, నూతనములు, కొద్దిగా వేడికలవీ, గొప్పవీ అయిన కిరణాలతో ఉదయాద్రిని అధిరోహించి ఏ సూర్యభగవానుడైతే భూమిని పసుపువర్ణంతో స్వర్ణమయంలా చేస్తున్నాడో ఆ సూర్యుడు మీ పాపాలను పోగొట్టుగాక!

**అలం :** అనుప్రాసం. 'గ్ర' వర్ణావృత్తి.

**విశే :** మూర్తికవి పేర్కొన్న మయూరుని 'సువర్ణ' కలనత్వం ఈ శ్లోకంలో పరాకాష్ఠకు చేరుకొని పఠితల్ని మంత్రముగ్ధుల్ని చేస్తుంది.

స్ర. **యోనిస్సామ్నాం విధాతా, మధురిపు రజితో, ధూర్జటిశ్శంకరోఽసౌ,**
**మృత్యుఃకాలోఽలకాయాః పతిరపి ధనదః పావకో జాతవేదాః,**
**ఇత్థం సంజ్ఞా దబిత్థాది వదమృతభుజాం యా యదృచ్ఛా ప్రవృత్తా**
**స్తాసామేవాభిధేయోఽనుగతగుణగణైర్యస్స సూర్యోఽవతాద్వః 99**

**అవ :** విధాత్రాదులకు వారిపేర్లు అలంకారార్థమేకాని సాభిప్రాయాలు కావని, సూర్యుడికి మాత్రం ఆ పేరు సార్థకమని చెబుతున్నారు.

**ప్రతి :** విధాతా= బ్రహ్మ; సామ్నాం= సామమంత్రాలకు; యోనిః= జనకారకుడు (వాటిని పుట్టించినవాడు); మధురిపుః= మధువనే రాక్షసవిరోధియైన విష్ణువు; అజితః= అజేయుడు; అసౌధూర్జటిః= ఈ జడలదారియైన శివుడు; శంకరః= శుభాలుచేయువాడు; మృత్యుః= యముడు; కాలః= కాలుడు; అలకాయాఃపతిః= అలకానగరాధిపతి కుబేరుడు; ధనదః= ధనాన్నిచ్చేవాడు; జాతవేదాః= అగ్ని; పావకః= పవిత్రుడు; ఇత్థం= ఈ విధంగా; జాతిగుణ క్రియానిమత్తంలేని రీతిని; యాః వంజ్ఞాః= ఏ పేర్లు; అమృతభుజాం= పైన పేర్కొన్న అమృతాన్ని తాగిన దేవతలకున్నాయో; అవి; డబిత్థ+ఆదివత్= డబిత్థః డిత్థమొదలగు సాంకెతిక నామాలమాదిరిగా (వ్యుత్పత్తిరహితాలు అవి) యదృచ్ఛా ప్రవృత్తాః= యాదృచ్ఛికంగా (నిరభిప్రాయంగా) ఏర్పడినవే; తాసాంఏవ= ఆ పేర్లయందే; అనుగతగుణగుణైః= తగినగుణ గణాలతో (పేరుకుతగ్గ); యః= ఎవరైతే; అభిధేయః= పిలువదగియున్నాడో; సః సూర్యః= ఆ అన్వర్థనామంగల సూర్యుడు; వః అవతాత్= మిమ్మల్ని రక్షించుగాక!

**తా :** విధాత (బ్రహ్మ) మొదలయిన దేవతలకు ఆ పేర్లు యాదృచ్ఛికంగా ఏర్పడినవేకాని సాభిప్రాయంగా కలిగినవికావు. అనగా వారికి గుణక్రియాదులనుబట్టి ఆ పేర్లు రాలేదు. ఒక్క సూర్యుడు మాత్రమే సార్థకనామధేయుడు. "సూతే జనాన్ కర్మసు" జనులను వారివారి పనులందు ప్రవర్తింపజేస్తాడు కాబట్టి సూర్యుడవుతున్నాడు. అటువంటి సార్థకనామధేయంగల సూర్యుడు మిమ్మల్ని రక్షించుగాక!

స్ర. **దేవఃకింబాంధవస్స్యాత్ప్రియసుహృదథవాచార్య ఆహోస్విదర్యో**
**రక్షా చక్షుర్నుదీపో గురురుత జనకోజీవితం భీజమోజః,**



**ఏవం నిర్ణీయతే యఃకిమితి నజగతాం సర్వదా సర్వదోఽసౌ**
**సర్వాకారోపకారీ దిశతు దశశతాభీశు రభ్యర్థితం వః ॥ 100**

**అవ :** సూర్యుని సర్వాంతర్యామిత్వాన్ని, అజ్ఞేయతత్వాన్ని పరమాత్మ (పరబ్రహ్మ) స్వరూపంగా భావిస్తూ సూర్యవర్ణన ముగిస్తున్నాడు.

**ప్రతి :** దేవఃకిం?= దేవుడా ఏమి?; బాంధవఃస్యాత్= బంధువగునా?; అథవా= లేక; ప్రియసుహృత్= ప్రియమైన స్నేహితుడా?; ఆహోస్విత్= అలాగాక!; ఆచార్యః= గురుదేవుడా?; అర్యః= యజమానియా? (రక్షణమా); ను= లేక; దీపః= వెలుగా?; ఉతగురుః= లేక పూజ్యుడా?; జనక్య= తండ్రియా?; జీవితం= ప్రాణమా?; బీజం= ప్రపంచానికి ప్రధానకారణమా?; ఓజః= తేజస్సా? (బలమా); ఏవం= ఈ విధంగా; జగతాం= లోకాలకు; సర్వదా= ఎల్లప్పుడు; యః= ఎవరైతే; కిం ఇతి= ఎవరు అనేది (ఫలానా అని); న నిర్ణీయతే= నిర్ణయించడానికి వీలుకావడంలేదో; అసౌసర్వదః= ఈ కోర్కెలన్నింటినీ తీర్చేశక్తిగల; సర్వ+ఆకార+ఉపకారీ= అన్ని రకాల మేలు చేసే; దశశత+అభీశుః= సహస్రకిరణుడైన సూర్యుడు; వః= మీయొక్క అభ్యర్థితం= అభీష్టాన్ని; దిశతు= నెరవేర్పుగాక!

***ఇంతటితో 'బాలప్రభ'తో కూడిన "రవివర్ణనం" ముగిసింది.***

* * *

ప్ర. *చత్వారిం శత్ప్రభాయాస్త్ర యమథ చ పునర్వాజినాం షట్కముక్తం
పశ్చాన్నేతుర్ద్విషట్కం పునరపిచదశ స్యందనస్యైకముక్తమ్,
భూయోఒష్టా మండలస్య స్ఫుటమథచ రవేర్వింశతి శ్రీమయూరే
ణేత్థం ప్రాతః పఠేద్యశ్శతక మనుదినం సూర్యసాయుజ్యమేతి. **101**

**అవ :** ఇంతవరకు వర్ణితాలైన విషయాలు యేవి యెన్నిన్ని శ్లోకాల్లో చెప్పబడ్డాయో వివరిస్తూ ఫలశ్రుతిని అందిస్తున్నాడు.

**ప్రతి :** శ్రీమయూరేణ= పూజ్యుడైన మయూరునిచేత; ప్రభాయాః= సూర్యకిరణాలకు; చత్వారింశత్ అథత్రయం చ= నలుబది మూడు; వాజినాం పునః= గుర్రాలకైతే; షట్కంఉక్తం= ఆరుచెప్పబడ్డాయి; పశ్చాత్= తర్వాత; నేతుః= సారథియైన అనూరునికి; ద్విషట్కం= పన్నెండు; పునః అపిచ= మరియు; స్యందనస్య= రథానికి; దశఏకం= పదకొండు; ఉక్తం= చెప్పబడినవి; భూయః= మరల; మండలస్య= సూర్యమండలానికి; అష్టౌ= ఎనిమిది; అథ= తర్వాత; రవేః= సూర్యునికి; వింశతిశ్చ= ఇరవై; స్ఫుటం= చెప్పబడినవి; ఇత్థం= ఈ విధంగా; శతకం= ఈ నూరుశ్లోకాలను; అనుదినం= ప్రతిరోజు; ప్రాతః= ప్రాతఃకాలంలో (ప్రొద్దున్నే); యః పఠేత్= ఎవరైతే చదువుతారో; (సః) అతడు; సూర్యసాయుజ్యం= సూర్యునితో ఐక్యమును (తాదాత్మ్యం); ఏతి= పొందుతున్నాడు.

**తా :** శ్రీ మయూరుడు తన గ్రంథంలో కిరణాలనుగూర్చి 43, గుర్రాలనుగూర్చి 6, సారధి అనూరుణ్ణి గూర్చి 12, రథాన్ని గూర్చి 11, మండలాన్ని గూర్చి 8, సూర్యుని గూర్చి 20, శ్లోకాల్లో చెప్పాడు వీటిని ఎవరైతే రోజూ ఉదయాన్నే పారాయణంచేస్తారో వారికి సూర్య భగవానుడు సాయుజ్యాన్ని (మోక్షాన్ని) ప్రసాదిస్తున్నాడు.

**వివ :** * ఈ శ్లోకం చౌఖంబా, (1981) నిర్ణయసాగర్ (1954) ప్రతుల్లోలేదు. వావిళ్ళ ప్రతిలో మాత్రమే (1972) వుంది.



ప్ర. * శ్లోకాన్లోకస్యభూత్యై శతమితిరచితాన్ శ్రీమయూరేణ భక్త్యా
యుక్తశ్చైతాన్పఠేద్యస్సకృదపి పురుషస్సర్వపాపైర్విముక్తః,
ఆరోగ్యం సత్కవిత్వం శ్రియమతులబలం కాంతిమాయుః ప్రకర్షం
విద్యామైశ్వర్యమర్థం వరమపి లభతేసోఒత్రసూర్యప్రసాదాత్. **102**

**అవ :** ఫలశ్రుతితో గ్రంథాన్ని ముగిస్తున్నాడు.

**ప్రతి :** లోకస్య= లోకముయొక్క; భూత్యై= సమృద్ధికోసం; శ్రీమయూరేణ= మయూర మహాకవిచేత; శతంఇతి= నూరుగా; రచితాన్= రచింపబడిన; ఏతాన్ శ్లోకాన్= ఈ శ్లోకాలను; యః= ఎవరైతే; భక్త్యాయుక్తః= భక్తిప్రపత్తులుకలిగి; సకృత్ అపి= ఒక్కసారైనా; పఠేత్= చదువుతారో; సః పురుషః= ఆ వ్యక్తి; సూర్యప్రసాదాత్[1]= సూర్యుని అనుగ్రహంవల్ల; సర్వపాపైః= సర్వపాపాల నుంచి (చేత); విముక్తః= విడువబడి (పాప విమోచనంకలిగి); ఆరోగ్యం= ఆరోగ్యాన్ని[2]; సత్కవిత్వం= మంచి కవిత్వాన్ని; శ్రియం= సంపదని (శోభ); అతులబలం= సాటిలేని బలాన్ని; కాంతిం= తేజస్సును; ప్రకర్షం ఆయుః= ఎక్కువ ఆయుస్సును; విద్యాం= విద్యను; ఐశ్వర్యం= సకలభోగాలు లేక ప్రభుత్వాన్ని; అర్థం= ప్రయోజనం లేక డబ్బుని; పరంఅపి= మోక్షాన్ని సైతం; లభతే= పొందుతున్నాడు.

**తా :** శ్రీ మయూర మహాకవిచేత లోకకల్యాణంకోసం రాయబడ్డ ఈ నూరుశ్లోకాలను (సూర్యవర్ణనంవరకుగల వంద) రోజుకి ఒక్కసారైనా భక్తిప్రపత్తులతో ఎవరైతే చదువుతారో వారికి ఆ సూర్యభగవానుడు పాపవిముక్తి కలిగించి సకల ఆయురారోగ్య ఐశ్వర్య మోక్షాదులను కలుగజేస్తాడు[3].

* ఈ శ్లోకం త్రిభువనపాల వ్యాఖ్యలోలేదు. కాని నిర్ణయసాగర్ ముద్రణంలో (1954) యజ్ఞేశ్వరశాస్త్రి వ్యాఖ్యతో ఇవ్వబడింది. వావిళ్ళ చేఖంబా, ముద్రణంలో వుంది.

1. స్తోతృసూర్యప్రసాదాత్ – అని పాఠాంతరం.

2. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అని వక్యాం.

3. 'విశ్వశ్రేయః కావ్యం' అన్న నన్నయ వాక్యం మయూర వాక్యంతో బలబడింది. (లోకస్యభూత్యై) అందుకే మయూరుడు "వః" అని మధ్యమ పురుషవాడాడేగాని గ్రంథంలో ఎక్కడా ఉత్తమ పురుష ప్రయోగించలేదు.

**ఇతి మహాకవి శ్రీమయూర విరచితం**

**'సూర్యశతకం' సమాప్తం.**

**మహాకవి శ్రీ మయూరుడు రచించిన "సూర్యశతకం" పూర్తయింది.**

**ఇంతటితో సూర్యశతక వ్యాఖ్య 'బాలప్రభ' ముగిసింది.**

# ప్రసక్త గ్రంథపట్టిక


1. అభిజ్ఞానశాకున్తలం (సం.)
2. అమరకోశం (సం.)
3. ఆదిత్యహృదయం (సం.)
4. ఋగ్వేదం (సం.)
5. కావ్యప్రకాశం (సం.)
6. కాశీఖండం (తె.)
7. ధ్వన్యాలోకం (సం.)
8. నరసభూపాలీయం (తె.)
9. భగవద్గీత (సం.)
10. భాగవత పురాణం (సం.)
11. మనుస్మృతి (సం.)
12. మహాభారతం (సం.)
13. మార్కండేయ పురాణం (సం.)
14. ముహూర్తచింతామని (సం.)
15. రఘువంశం (సం.)
16. విశ్వకోశం (సం.)
17. విష్ణుపురాణం (సం.)
18. వేదవాఙ్మయం (తె.)
19. శృంగారనైషధ సర్వంకష వ్యాఖ్య (తె.)
20. సుభాషితరత్న భాండాగారం (సం.)

# శ్లోకానుక్రమణిక

| వరుస | శ్లోకం | పుట | శ్లోక సంఖ్య |
|---|---|---|---|
| 1. | అక్షైరక్షాంనిబధ్య | 85 | 67 |
| 2. | అశ్యామఃకాలఏకో | 27 | 20 |
| 3. | అస్తవ్యస్తత్వశూన్యో | 24 | 18 |
| 4. | అస్త్రాద్రీశోత్తమాంగే | 54 | 42 |
| 5. | ఆక్రాంత్యావాహ్యమానం | 66 | 51 |
| 6. | ఆయాంతీకింసుమేరోః | 36 | 27 |
| 7. | ఆవానైశ్చంద్రకాంతైః | 49 | 37 |
| 8. | ఆవృత్తిభ్రాంతవిశ్వాః | 19 | 14 |
| 9. | ఉజ్జృంభాభోరుహాణాం | 52 | 39 |
| 10. | ఉత్కీర్ణస్వర్ణరేణు | 86 | 68 |
| 11. | ఉద్గాఢేనారుణిమ్నా | 10 | 8 |
| 12. | ఉద్యద్ద్యాధ్యానవాప్యాం | 97 | 79 |
| 13. | ఏకంజ్యోతిర్ద్విశౌద్వే | 17 | 13 |
| 14. | ఏకాహేనై వదీర్ఘాం | 82 | 65 |
| 15. | ఏతత్పాతాళవంక | 118 | 96 |
| 16. | ఏతద్వ్యన్మండలం | 109 | 89 |
| 17. | కస్త్రాతాతారకాణాం | 94 | 76 |
| 18. | కైలాసేకృత్తివాసా | 108 | 88 |
| 19. | క్రామన్లోలోఽపిలోకాన్ | 106 | 86 |
| 20. | క్ష్మాంక్షేపీయః క్షపాంభః | 29 | 22 |
| 21. | గంధర్వ్వోర్గద్యపదబ | 48 | 36 |
| 22. | గర్భేష్వంభోరుహాణాం | 4 | 3 |
| 23. | చక్రీచక్రారపంక్తిం | 89 | 71 |
| 24. | చక్షుర్దక్షద్విషోయన్న | 99 | 80 |
| 25. | చత్వారింశతప్రభాయాః | 124 | 101 |
| 26. | జంభారాతీభ | 1 | 1 |
| 27. | జ్యోత్స్నాంశాకర్షపాండు | 35 | 11 |
| 28. | తన్వానాదిగ్వధూనాం | 21 | 15 |
| 29. | తీర్థానివ్యర్థకాని | 117 | 95 |
| 30. | తీవ్రం నిర్వాణహేతుః | 38 | 29 |
| 31. | దత్తానందాః ప్రజానాం | 12 | 9 |
| 32. | దత్తార్ఘైర్దూరనమ్రైః | 67 | 52 |
| 33. | దేవః కింబాంధవఃస్యాత్ | 122 | 100 |
| 34. | ద్యేపేయోఽస్తాచలో | 119 | 97 |
| 35. | ధారారాయోధనాయ | 15 | 11 |
| 36. | ధున్వంతోనీరదాళీ | 63 | 49 |
| 37. | ధూర్ధ్వస్తాగ్ర్యగ్రహాణి | 83 | 66 |
| 38. | ధ్వాంతధ్వంసంవిధత్తే | 37 | 28 |
| 39. | ధ్వాంతస్యైవాంతహేతుః | 104 | 84 |